# కట్టా వరదరాజకవి
# ద్విపదరామాయణము -
# ఒక పరిశీలన



డా॥ కడియాల వెంకటరమణ
తెలుగు అధ్య.యనశాఖ
శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ, తిరుపతి

1998

# కట్టా వరదరాజకవి ద్విపద రామాయణము - ఒక పరిశీలన

డా॥ కడియాల వెంకటరమణ

ప్రథమ ముద్రణ

వేయి ప్రతులు

అక్టోబరు - ౧౯౯౪



వెల ౧౦౦-౦౦

ఈ గ్రంథము తిరుమల తిరుపతి దేవస్థానంవారి
ఆర్థిక సహాయంతో ప్రచురితం

ముద్రణ

కీర్తి ఆఫ్‌సెట్,

౧౦౩, ప్రకాశం రోడ్,

తిరుపతి

# అంకితం

తల్లిదండ్రులు

శ్రీ కడియాల రెడ్డెప్పనాయుడు,

శ్రీమతి నారాయణమ్మలకు

భక్తితో....

# కైమోడ్పు

శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థలో డా॥ కె. జె కృష్ణమూర్తిగారి దగ్గర పరిశోధన విద్యార్థిగా ఏప్రిల్ 1986 నుండి కావించిన పరన పరిశీలనముల ఫలితరూపమే ఈ పరిశోధక వ్యాసం. నా పరిశోధనకు పర్యవేక్షణ బాధ్యతను స్వీకరించి ప్రతిచిన్న విషయంలోను సలహాలను, పుస్తకాలను ఇచ్చి, నా పరిశోధనను పూర్తిచేయించిన సహృదయులు డా॥ కె. జె. కృష్ణమూర్తి గారికి ......................... ...

నా పరిశోధనకు విశేషంగా తన సలహాలు, సూచనలు యిచ్చి తోడ్పడిన గురువర్యులు డా॥ జి. దామోదర నాయుడు గారికి .........

నాపట్ల, నా పరిశోధనాంశంపట్ల ఉన్న అభిమానంతో తమ అమూల్యమైన సమయాన్ని కేటాయించి నాపరిశోధన వ్యాసరచనకు సహకరించిన సహృదయులు కీర్తిశేషులు విద్వాన్ శ్రీ డి. నాగసిద్దారెడ్డిగారికి ........

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు అధ్యయనశాఖలోని నాగురువర్యులెల్లరకు . . ... .....

పరిశోధన కవసరమగు వ్రాతప్రతులను సంప్రదించుట కనుమతించిన సహృదయులు ప్రాచ్యపరిశోధన సంస్థకు డైరెక్టరుగా నుండిన కీ.శే. డి. శ్రీధరబాబుగారికి, అట్లే ప్రస్తుత డైరెక్టర్ ఆచార్య యం. శ్రీమన్నారాయణ మూర్తి గారికి, పైసంస్థ యందలి ఉద్యోగి బృందమునకు, గ్రంథాలయ సిబ్బంది, అందరకు ........... .. ...

అడిగినదేతడవుగా ఆప్యాయతతో ఆవశ్యకమైన పుస్తకములను అందించిన శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ గ్రంథాలయ తెలుగు విభాగ సంరక్షణాధికారి శ్రీషణ్ముగంగారికి కృతజ్ఞతాంజలులు

ఈ పరిశోధనా వ్యాస రచనలో విశేషంగా సహకరించిన నా శ్రీమతి రజనికి - అభినందనలు.

డా॥ కె. వెంకటరమణ

# ఆ కాంక్ష

తెలుగు నాట రామాయణ వాఙ్మయ ప్రభావం ప్రజలలో భక్తిరూపంగా వెలసింది దేశం నలుమూలలా రామ భక్త సంఘాలు, భజన కూటాలు వున్నాయి రామాయణ, భారత, భాగవతాలు భారతీయ సంస్కృతికి నిలువుటద్దాలు విస్తారమైన రామాయణ కధా వాఙ్మయం తెలుగు వారి ఆర్ద్రహృదయానికి అన్ని కోణాల నుండి పదును పెట్టింది జీవితంలోని లోతు పాతుల్ని త్రవ్వి చూపింది సాహిత్యం సాధించగల సత్ఫలితాలన్నింటినీ రామాయణం సాదించింది

తెలుగు సాహిత్యంపై రామాయణ ప్రభావం అత్యధికం భారతాంధ్రీకరణం వైదిక మత పునరుద్దరణ కోసం సాగింది వీరశైవ వాఙ్మయం శైవమత ప్రభావంతో విలసిల్లింది వైష్ణవ మత వ్యాప్తిననుసరించి అన్నమయ్య కీర్తనలు, ఆముక్త మాల్యాది గ్రంధాలు తెలుగున వెలసినవి అయితే రామాయణ కధారచన మాత్రం యిందుకు భిన్నంగా ఏమత ప్రసక్తీ లేకుండా నేటి వరకూ సాగుతూనే వుంది

తెలుగున రామాయణానికి అనేకానువాదాలు వచ్చాయి స్వతంత్రరచనలూ వెలిశాయి తెలుగు సాహిత్యంలో ప్రక్రియలు ఎన్ని వెలిశాయో అన్ని ప్రక్రియల్లోనూ రామాయణ కదా రచన సాగింది విపుల కావ్యాలుగా యధానువాదాలు కొన్ని వచ్చాయి అట్లే స్వతంత్రానువాదాలు వచ్చాయి ఇంకా సంక్షేప రామాయణ కావ్యాలు వచ్చాయి కావ్య ప్రబందాలుగా, కళ్యాణ కావ్యాలుగా, అచ్చ తెలుగు కావ్యాలుగా, ద్విపద కావ్యాలుగా, శ్లేష కావ్యాలుగా, లఘు కావ్యాలుగా, యక్ష గానాలుగా, గేయాలుగా, పాటలుగా, వచన కావ్యాలుగా, నాటకాలుగా యింకా యింకా అనేక రకాలుగా తెలుగున రామాయణం వెలుగు చూసింది

తెలుగున రామాయణం ద్విపద కావ్యంగా కూడా అవతరించింది అందు రంగనాధ రామాయణం మొదటిది తర్వాతది కట్టావరద రాజకవిది సూర్యవంశక్షత్రియుడు, శ్రీరంగమహాత్మ్య, పరమ భాగవత చరిత్ర కర్త అయిన కట్టా వరదరాజు 1600 - 1650 ప్రాంతమువాడు వరదరాజకవి రామాయణము యధావాల్మీకము అయినా యిందు స్వతంత్రమైన కూర్పులు లేకపోలేదు రంగనాధ రామాయణంలో వుండే కొన్ని అవాల్మీకాలు యితడు పరిహరించాడు కొన్ని స్వీకరించాడు గ్రంధాన్ని తన యిష్టదైవమైన శ్రీ వేంకటేశ్వర స్వామికి అంకితమిచ్చాడు ద్విపద రామాయణాలలో యిది పెద్దది రచన సరళంగా సాగింది

ఎంతో విశిష్టతను పొందిన కట్టావరదరాజ కవి ద్విపద రామాయణాన్ని డా|| కడియాల వెంకటరమణ ఐదు ప్రధాన భాగాలుగా విభజించి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయానికి డాక్టరేట్ పట్టాకోసం సమర్పించి పట్టాను పొందాడు

పరిశోధకుడు వరదరాజ కవి జీవిత విశేషాల్ని, ఆకవి కృతుల్ని మొదట వివరించాడు తరువాత తాను పరిశోధనకు స్వీకరించిన గ్రందము యొక్క అనువాద విధానాన్ని చాలా సూక్ష్మంగా, సవివరంగా చర్చించాడు ఈ భాగంలోని ఒక్కొక్క కాండను విడి విడిగా మూలంతో పోల్చి చూడడం రమణ నిశిత పరిశీలనకు నిదర్శనం ఆతర్వాత విభాగం పరిశోధకుని సాహితీ శక్తిని తెలియ జేస్తుంది అది వరదరాజు కవితా వైశిష్ట్యాన్ని గూర్చిన విషయం దీనిని రమణ పాత్రచిత్రణ, వర్ణన, రసపోషణ, శైలీవిన్యాసం మొదలైన అంతర్భాగాలుగా వింగడించి పాఠకులకు వరదరాజుకవితా వైశిష్ట్యాన్ని చక్కగా అందించాడు వరదరాజు భాషా విశేషాల్ని గూర్చి ఒక విభాగం పెట్టుకొని అందులో జాతీయాలు, సామెతలు, లోకోక్తులు, శబ్దవిశేషాలు అని అనేక విదాలుగా పరిశీలించాడు

శ్రీ కడియాల వెంకటరమణ ప్రస్తుతం తెలుగు అధ్యయన శాఖలో గత ఐదు సంవత్సరాలుగా రీసెర్చి సైంటిస్ట్‌గా పని చేస్తున్నాడు అంతకు మునుపు యిదే శాఖలో యం ఏ తెలుగు పట్టాను 1985లో పొందాడు తరువాత ఆచార్య కె జె కృష్ణమూర్తి ఆధ్వర్యంలో "కట్టా వరదరాజ కవి ద్విపద రామాయణం - ఒక పరిశీలన" అనే అంశంపై డాక్టరేట్ పట్టాను పొందాడు ఇంతకు మునుపే "సృష్టిపై చలం ఆలోచనలు - ఒక విమర్శ, పరమ బాగవత చరిత్రము అనే పుస్తకాల్ని ముద్రించి వుండడం గమనార్హం. అందులో "సృష్టిపై చలం ఆలోచనలు - ఒక విమర్శ" అనే గ్రంధం రమణ సమాజాన్ని ఎంత చక్కగా అధ్యయనం చేశాడో సాహిత్యంతో పాటు సమాజాన్ని కూడా ఎంత నిశితంగా పరిశీలించాడో అభివ్యక్తమవుతుంది

ప్రస్తుత గ్రందం రమణ పరిశీలనా దృష్టికి ఒక ఉదాహరణ నిగ్రహమే కాని ఆగ్రహ మెరుగని రమణ జీవితంలో యింకా పైమెట్లు అదిరోహించాలని, సమాజానికి పనికి వచ్చే మరిన్ని గ్రందాలు వెలువరించాలని మనసా ఆకాంక్షిస్తున్నాను ఇందుకు రమణకు ఆయురారోగ్యాల్ని, సాహితీ సంపత్తును ప్రసాదించాల్సిందిగా తిరుమల వేంకటేశ్వరుని ప్రార్దిస్తున్నాను

తిరుపతి,
12-10-'98

*డా|| జి. డి. నాయుడు*
తెలుగు అధ్యయన శాఖ,
యస్ వి యు తిరుపతి

# విషయ సూచిక

# ప్రకరణము - 1

# కట్టావరదరాజకవి జీవిత విశేషాలు - కృతుల సమీక్ష

**1.0** ఆంధ్రభాషలో రాజకవులు పెక్కురుకలరు. వీరిలో కొందరు చక్రవర్తులు. కొందరు మహారాజులు. అట్టివారిలో కొందరు స్వయంగా కవీశ్వరులై కావ్యరసాన్ని గ్రోలుతూ విద్యావిలాసాల్లో పొగడ్తకెక్కినారు ఆంధ్రదేశంలో విలసిల్లిన అట్టిరాజకవుల్లో కట్టావరదరాజు పేర్కొనదగిన కవిరాజు.

## 1.1 వంశం :

దక్షిణ భారతదేశాన్ని క్రీ.శ. 485లో కరికాళచోళుడు గొప్పగా పరిపాలించాడు. ఆతని వంశంలోని వారు అటు తమిళదేశాన్ని ఇటు తెలుగుదేశాన్ని చక్కగా పరిపాలించారు. కరికాళునిరాజ్యం అంతరించిన 750 సంవత్సరాల తర్వాత ఆతని సంతతివారు నెల్లూరును పరిపాలించినట్లు తిక్కన నిర్వచనోత్తర రామాయణము వల్ల తెలియవస్తున్నది. క్రీ.శ 1650 ప్రాంతాల్లోకూడా కరికాళుని వంశంలోని వారు తెలుగుదేశంలో ఉన్నారు. కరికాళుడు కావేరికి ఆనకట్ట కట్టించుటచే ఆతని వంశీయులకు 'కట్టావారు' అనే ఇంటిపేరు ఏర్పడిందని తెలుస్తున్నది. ఈ విషయాన్ని కట్టావరదరాజు తన శ్రీరామాయణ గ్రంథారంభంలో ఇలా పేర్కొన్నాడు

> **"ఆకరికాళచో-ళాధీశు కీర్తి**
> **యాకర్ణనీయమి-య్యవని నెయ్యెడల**
> **అతఁడు కావేరిక-ల్లన కట్టుగట్టు**
> **నతిశయించెను తదీ-యాన్వవాయమునఁ**
> **బుట్టిన రవివంశ - భూభుజావళికిఁ**
> **గట్టాన్వయులనంగఁ - గలిత తేజమున"**[1]

ఈవైనాన్ని బట్టి కరికాళుని వంశం తెలుగునాట దాదాపు 1200 సంవత్సరాలు వర్ధిల్లిందని చెప్పవచ్చు.

## 1.2 కాలం :

ఈ రాజకవిని గూర్చి ఆంధ్రపండితలోకానికి తొలుత తెలియబరచినవారు కీ.శే. మానవల్లి రామకృష్ణకవిగారు. ఈయన తనచే విరచింపబడిన భైరవకృత శ్రీరంగమాహాత్మ్య సంపాదకీయ పీఠికయందు కట్టా 'వరదరాజు అళియ రామరాజు

పెదతల్లి కుమారు'డని వ్రాసియున్నారు. అయితే కీ.శే. చెలికాని లచ్చారావుగారు చెప్పినట్లు వారు దానికి ఆధారాలు చూపలేదు. అయినను కవిగారి వాక్యాల్ని అంగీకరించి వరదరాజు క్రీ.శ. 16వ శతాబ్దం కడపట ఉండినవాడని నిశ్చయించారు.

"వరదరాజు శ్రీమానవల్లి కవిగారు చెప్పినట్లు రామరాజు బంధుగుడైనచో తప్పక 16వ శతాబ్దం కడపటివాడగును ............ పైగా ఆముక్త మాల్యద పోలికలుండుటచే ఇతడు 16వ శతాబ్దము కడపటి భాగమునకే యుండి యుండవచ్చును."[2]

అయితే ఈ కాలనిర్ణయం అంగీకరించుటకు వీలులేదు. వరదరాజు క్రీ.శ 17వ శతాబ్ద పూర్వార్ధములో ఉండెనని చెప్పడానికి ఆతని గ్రంథములందే ప్రబలమైన సాక్ష్యం కనపడుతున్నది.

కవి తన ద్విపద రామాయణ కృత్యవతారిక యందు తనవంశాన్ని వర్ణిస్తూ ఇట్లు చెప్పినాడు.

"పరవధూ ద్రవ్య - చాపల్యదూరుండు
హరిదాసరాజైన - హరిదాసరాజు
అంగనాభూషణం-బగు పోచిరాజు
సింగరి రాజన్య - శేఖరుసుతను
బాళిమై కృష్ణమాం-బను వరియించె
నాలేమతోఁబుట్టు-వగు నోబమాంబ
అర్థి శ్రీరంగరా-యలు నాల్గుపూరు
షార్థముల్‌గలుగఁగ-ల్యాణమై మించె
ఆయశోనిధిసుతుం-డై రామదేవ
రాయలు మారటు - రాముఁడై వెలసె
హరిదాసరాజు కృ-ష్ణాంబయందులను
హరిసుదర్శనమూర్తి-యగు రామరాజు
రాజ భగీరథు - రవితేజు వరద
రాజును నిను దాత - రాయనిఁగాంచె,
రచియింపు మీవు శ్రీ-రామాయణంబు"[3]

పై ద్విపదల్లో వర్ణింపబడిన బాంధవ్యాన్ని ఇట్లు ప్రదర్శింపవచ్చు.







ఈ బాంధవ్యం రామరాజీయంలో కూడా సూచింపబడింది.

"తే. గీ    రాజకుల భూషణుడు చిక్కరాయభూప
శౌరి వరియించె జిల్లేళ్ల నారసింహ
రాజ దేవేంద్ర పుత్రియం భోజనేత్రి.
యైన యోబమ్మదేవి నాయతివ వలన

తే గీ.    అవసుమ తీసునకు రామదేవరాయ
లుదయమైనను రిపురాజు లొదిగి శైల
గుహల జేరిరి ---------------"[4]

దీన్నిబట్టి జిల్లేళ్ల వారికి 'పోచిరాజువా'రనే నామాంతరం కూడా ఉన్నట్లు తోస్తున్నది.

ఇందువల్ల క్రీ.శ. 1618 మొదలు 1630 వరకు విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన రామదేవరాయలకు టీకకట్టా వరదరాజు పెద్దతల్లి కుమారుడనియు, సమకాలికుడనియు స్పష్టమౌతున్నది. మరియు విజయ రాఘవనాయకుడు రచించిన రఘునాథాభ్యుదయమనే ద్విపద కావ్యంలో క్రీ.శ. 1618లో జరిగిన తోపూరుయుద్ధానికి రామదేవరాయలకు బాసటగాపోయిన నాయకుల్లో వరదరాజు పితామహుడైన కట్టారంగరాజు ఒక్కడైనట్లు చెప్పబడింది.

"ద్వి.    ఆరామదేవరాయలు చనుదేర
తరతరమ్ములకునుఁదగులైన కతన
నెఱనమ్మఁదగిన కోనేటి కొండ్రాజు
కట్టరంగరాజు కస్తూరిరాజు"[5]

క్రీ.శ. 1618లో కట్టారంగరాజు యుద్ధంచేయగల దేహపటుత్వం కలిగి ఉండుటచే మనుమడైన వరదరాజు సమకాలికుడును, పినతల్లికుమారుడైన రామదేవరాయలవలె బాలుడై ఉండవలెను. ఈ వరదరాజు తండ్రి క్రీ.శ. 1630 మొదలు 1642 వరకు విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన ముమ్మడి వేంకట దేవరాయలకు సమకాలికుడని కడప మండలం జమ్మలమడుగు తాలూకా మాధవాపురం గ్రామంలోని హనుమంతరాయని ఆలయంగోడ దగ్గర పడివుండిన శాసనశకలం వల్ల తెలియవస్తున్నది.

"యీశ్వర సంవత్సరానను చలమర్తి గండపట్నానను జియ్యంగారి వారి సన్నిధి వేంకటయ్యగారికి కట్టహరిదాసరాజు ధారపోసిన చేనినడిమి కత్తువను భీముని గుండంచేను ------" ఇందు ఉదహరించిన ఈశ్వర సంవత్సరము ముమ్మడి వేంకటదేవరాయల రాజ్య మధ్యకాలమున క్రీ.శ. 1636 - 37కు సరిపోతున్నది. దీనివల్ల కట్టావరదరాజు రాయలసీమ వాడనియు, క్రీ.శ. 17వ శతాబ్ద మధ్యకాలంలో జీవించియుండుననియు నిశ్చయింప వీలగుచున్నది.

అంతేగాక మరొక విదంగా కూడా పైకాల నిర్ణయాన్ని సమర్థించవచ్చు. వరదరాజకవి తనశ్రీరంగ మాహాత్మ్యంలోని ఆంధ్రకవిస్తుతిలో ఈక్రింది కవుల్ని పేర్కొన్నాడు.

> "నన్నయభట్టు ప్రెగ్గడను నాచనసోముని సార్వభౌముఁది
> క్కన్నను పెద్దిరాజు మొదలైతగు నంధ్రకవీంద్ర ముఖ్యులన్
> సున్నుతిచేసి వారి రచనల్ పొసఁగించిన త్రోవగాంచియా
> యెన్నిక నేనుకొంత రచియించుటకున్మది నుత్సహించితిన్"[6]

ఈ పద్యాన్ని పరిశీలింపగా మనకు కొన్ని విశేషాలు వెల్లడౌతున్నాయి. ఇందులో నన్నయ, నాచనసోముడు, తిక్కనల పేర్లు స్పష్టంగా చెప్పబడి వున్నాయి. నన్నయ్యా తర్వాత పేర్కొన్న ప్రెగ్గడను ఎఱ్ఱాప్రెగ్గడగానే భావించవచ్చు. సార్వభౌముడు అనే విశేషణం తిక్కనకు అన్వయించవచ్చుకాని, సాహిత్య చరిత్రలో తిక్కనకు ఆబిరుదున్నట్లు తెలియరాదు. కవిబ్రహ్మ, ఉభయ కవిమిత్రుడు లోకప్రసిద్ధమైన తిక్కన బిరుదులు. సార్వభౌముడు అన్నబిరుదు సాహిత్యచరిత్రలో శ్రీనాథునకు కలదు. కాబట్టి ఈ 'సార్వభౌముడు' శ్రీనాథుడుగానే భావించవచ్చు. పెద్దిరాజు అల్లసాని పెద్దన అని ఊహించవచ్చు. ఇతణ్ణి 'పెద్దిరాజు' అని సంబోధించటం వ్యవహారంలో కలదు. కాబట్టి పైన పేర్కొన్న కవులలో క్రమం పాటించక పోయినా చివర పేర్కొన్న పెద్దిరాజు (అల్లసాని పెద్దన) తర్వాతి వాడే వరదరాజు అనుట స్పష్టం.

వరదరాజు క్రీ. శ. 17వ శతాబ్దివాడని చెప్పడానికి, ఇతని శ్రీరంగ మాహాత్మ్యము నుండి క్రింది పద్యాన్ని గణపవరపు వేంకటకవి తన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసమున ఉదహరించి యుండటం.

"మ ఎక తాళంబున వీరమద్దెలరవం బేకంబుగా నట్టువల్
ధికతోంతత్తక ఝుంకుఝుంకు కిణుతాంధిత్తాంగి నాలోధికం
ధికతెత్తెయ్యధి ధిక్కు ధిక్కు ధికతా దిక్తాది తాళంబులన్
కకుబంతంబుల మాఱుబల్కు కొనగోల్కాశ్యంద మున్నాడగన్"

- ప్రబంధరాజ వేం. వి విలాసము, 14 ఆశ్వా, 161ప

గణపవరపు వేంకటకవి క్రీ శ 1674 ప్రాంతంలో తంజావూరిని పరిపాలించిన మధురనాయకరాజగు ముద్దళగిరికి ఆశ్రితుడుగా ఉండెను. ఇతడు రాజుకు అంకితంగా విద్యావతీదండకాన్ని రచించినాడు [7] ఈ కవి 17వ శతాబ్ది ద్వితీయార్థమందున్న వాడు. వరదరాజు గ్రంథమునుంచి యాతడు పద్యాన్ని గ్రహించటంవల్ల వరదరాజు 17వ శతాబ్ది మధ్యనున్న వాడని నిశ్చితంగా చెప్పవచ్చును.

## 1.3 కృతుల సమీక్షణ :

వరదరాజు వైష్ణవమతాభిమాని. శ్రీ వేంకటేశ్వరుడు ఈతని ఇష్టదైవం. ఇతడు తనరచనలన్నింటిని శ్రీ వేంకటేశ్వరునికే అంకితమిచ్చాడు. ఇతని కవిత్వం మనోహరం, మాధుర్య గుణపూరితమై వుంటుంది. సులభమైనశైలి, మెత్తని మాటలు, నిరాఘాటమైన ధారాశుద్ధి కలిగి ఇతని కవిత్వం చదువ చదువ చవులూరుచుండును

రచనలు - సమీక్ష - ఈకవి రచనలివి.

(1) పరమ భాగవత చరిత్ర.

(2) శ్రీరంగ మాహాత్మ్యము.

(3) శ్రీ రామాయణము.

మొదటి రెండూ పద్యకావ్యాలుకాగా మూడవది ద్విపద.

### 1.3.1 పరమ భాగవత చరిత్ర

ఇది ఎనిమిది ఆశ్వాసాల ప్రబంధం. ఇందులో 14 మంది పరమ భాగవతుల కథలు కలవు ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీక, వ్యాస, అంబరీష, శుక, శౌనక, బీష్మ, దాల్భ్యాయన, రుక్మాంగద, అర్జున, బలి, విభీషణులనే వారు ఈ పరమ భాగవతులు. అయితే 8 ఆశ్వాసాల ఈ ప్రబంధంలో పుండరీక చరిత్ర, రుక్మాంగద చరిత్ర

అనే రెండు ఆశ్వాసాలు మాత్రం లభిస్తున్నాయి. తక్కిన గ్రంధం పూర్తిగా లభించడం లేదు. పై రెండు కథలు ఉన్న భాగాలు తంజావూరు పుస్తకశాల గ్రంధ వివరణ పట్టికలో రెండు ప్రత్యేక గ్రంధాలుగా పేర్కొన్నారు. దీన్నిబట్టి వరదరాజు కవి పరమభాగవత చరిత్ర, పుండరీక చరిత్ర, శ్రీ రంగమాహాత్మ్యము, శ్రీరామాయణము అనే నాలుగు గ్రంథాలు వ్రాశాడని శ్రీ వేంకటరమణయ్యగారు ఒకానొక వ్యాసంలో పేర్కొన్నారు.[8]

ఈ గ్రంథాంత గద్య ఇలాఉంది.

"ఇది శ్రీమదలమేలు మంగాసనాథ తిరువేంగళ నాథ కటాక్ష రక్షిత సకలసామ్రాజ్య వైభవ కట్ట హరిదాసరాజతనూభవ సాహితీభోజ వరదరాజ ప్రణీతంబైన పరమ భాగవత చరిత్రంబను మహా ప్రభందమునం దష్టమాశ్వాసము "

ఈ కావ్యాన్ని తన రచనలకన్నింటికి ముందు వ్రాసినట్లు వరదరాజు తన శ్రీరంగ మాహాత్మ్యములో ఇలా చెప్పుకొన్నాడు

ఈ కవికి శ్రీ వేంకటేశ్వర స్వామి కలలో ప్రత్యక్షమై -

"మున్నునాపేర నంకింతంబుగ నొనర్చి
తవనిలోఁబొగడొంద భాగవత
చరిత మిపుడొనర్చు ప్రబంధమ్ము నిమ్ము నాకు
నంకితమ్ముగ శ్రీ వేంకటాధిపతిని."

- అని పలికాడు.[9]

స్వప్న సందర్భంలో శ్రీ రామాయణ అవతారికలో

**"నినుమెచ్చి వచ్చితి-నీ తలంపెఱిఁగి**
**ననుఁదిరువేంగళ - నాథుఁగాఁదెలియు**
**పద్యకావ్యము చేసి - పరమ భాగవత**
**హృద్య చరిత్రంబు - నిచ్చితిమాకు**
**మంగళ ప్రద మసా-మ్యము శతాధ్యాయి**
**రంగమాహాత్మ్యంబు - రచియించినావు**
**మాపేరనిపుడు రా-మాయణ ద్విపద**
**యేపుమీఱఁగ రచి-యింపు మింపలర "**[10]

పై ద్విపదలను బట్టి వరదరాజకవి మొదట

'పరమ భాగవత చరిత్రము'ను తర్వాత 'శ్రీరంగ మాహాత్మ్యము'ను ఆపైన 'శ్రీ రామాయణము'ను రచించాడని తెలుస్తుంది.

కవి తన 'పరమ భాగవత చరిత్రము' లోని 8వ ఆశ్వాసంలో రుక్మాంగదుని ఇలా వర్ణించాడు.

"గౌరీవధూ జాని కనుముంగలికి బోని
యతల నాటి వలరేని చెలువు కాని
కళలు వెచ్చముగాని కలువనెచ్చెలికాని
గోము వీసరవోని మోమువాని
పసిమి మించుకదాని పసలనెంచగనీని
మిసమిసల్గల మేని మెరుగువాని
ముదురుకంపుల జేని యుదరియందియలోని
రొదల రాజసమూషాని పొదలు వాని
నెర చెలువులాని లావణ్యభరము పూని
దిశలుగనువాని వరసుదతి హృదంబు
జాత మదనానలద్యోత సామిధేని
రేకగనువాని నయ్యలరేని గనియె "[11]

'పరమ భాగవత చరిత్ర' పూర్తిగా లభించక పోవడం ఆంధ్రుల దురదృష్టంగా భావించవచ్చు. తెలుగు సాహిత్యంలో ఇతడొక్కడే కాక మరి కొంతమంది కూడా పరమ భాగవత చరిత్రను రచించారు.

ఆ రచయితల వివరాలు ఇవి.

(1) గణప వరపు వేంకటకవి. క్రీ.శ. 1674
(2) ఆలూరి కుప్పన, క్రీ.శ. 1730
(3) శృంగారకవి తిరుమల నాథుడు. క్రీ.శ. 1750

వీరు వ్రాసిన పై గ్రంథాల్లో ఏ ఒక్కటీ నేడు లభించడం లేదు వరదరాజు వ్రాసిన రెండు ఆశ్వాసాలైన లభిస్తున్నందుకు సంతోషించాలి. కవి ఈ ప్రబంధాన్ని వ్రాసి వేంకటేశ్వరునికి అంకితమిచ్చాడు.

**1.3.2. శ్రీరంగ మాహాత్మ్యము**

ఇది పది ఆశ్వాసాల పద్యకావ్యం. గరుడ పురాణంలోని శతాధ్యాయికి తెనిగింపు శ్రీరంగ మాహాత్మ్యము. ఈ గ్రంథాంత గద్య ఇట్లు ఉంది

"ఇది శ్రీ వేంకటేశ్వర వరప్రసాదాసాదిత చాటుధారా నిరాఘాట సరస చతుర్విధ చతుర కవిత్వ రచనా చమత్కార సకల విద్వజ్జనాధార కట్టహరిదాసరాజ గర్భాబ్ధి చంద్ర

వరదరాజేంద్ర ప్రణీతంబైన గారుడ పురాణ శతాధ్యాయి శ్రీరంగ మాహాత్మ్యంబను మహా ప్రబంధంబునందు సర్వంబును దశమాశ్వాసము. "[12]

గరుడ పురాణంలోని శతాధ్యాయిని శ్రీరంగ మాహాత్మ్యంగా తెనిగించమని, శ్రీ వేంకటేశ్వరుడు వరదరాజుకు ఇలా ఆదేశించాడు

"చేయరె తొల్లిసత్కవుల శేషపురాణములన్ దెనుంగునం
దీయితిహాస మెందురచియింపమి తావక పుణ్యమెంతయా
మ్నాయ చతుష్క సారము సనాతనగారుడసంహితా శతా
ధ్యాయి దెనుంగు సేయనొకడర్హుడె నేటికవీంద్ర కోటిలోన్."

- శ్రీరంగ మాహాత్మ్యము 1 ఆశ్వా, పుట. 6

అయితే ఈ కవికంటె ముందు ముగ్గురు కవులు శ్రీరంగ మాహాత్మ్యాన్ని తెలుగులో రచించారు. ఈ విషయం వరదరాజుకు తెలిసియుండక పోవచ్చు. చెన్నమల్లు శ్రీగిరన్న, భైరవుడు అనేకవులిద్దరు శ్రీరంగ మాహాత్మ్యాన్ని పద్యకావ్యంగా వ్రాశారు. ముకుందయోగి ద్విపదగా చెప్పాడు.

శైవుడైన శ్రీగిరి, శ్రీరంగ మాహాత్మ్యమునే కాక నవనాథ చరిత్ర పద్యకావ్యాన్ని, శ్రీగిరి శతకాన్ని రచించాడు.[13] ఇతడు నవనాథ చరిత్రను ద్విపదగా వ్రాసిన గౌరనకు పూర్వుడు. గౌరనతన ద్విపద కావ్యంలో ఈతని పద్య కావ్యాన్ని పేర్కొన్నాడు. శ్రీగిరికాలం క్రీ.శ. 13వ శతాబ్దం.

రెండవకవి భైరవుడు. ఇతడుకూడా శైవుడే. ఇతడు శ్రీరంగ మాహాత్మ్యము, రత్నశాస్త్రము, కవిగజాంకుశము అనే గ్రంథాలను రచించాడు. ఇతని రచనలన్నీ ముద్రితమైనవి. ఈకవి 14వ శతాబ్దం వాడు.

శ్రీరంగ మాహాత్మ్యమునందలి కవితారచనను గురించి శ్రీరామకృష్ణకవిగారు తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తంచేశారు.

"భైరవుండును విప్రకవియు శ్రీరంగ మాహాత్మ్యమును రచియించెను దుష్టకవి ఘోరపిశాచముల నదల్చు గురుభైరవుండగు భైరవుని కవితా ప్రవాహమున కిక్కవి వాక్పుష్పదామములు నిలువజాలకున్నను, వర్షాంతపు నదివోలె నదినీరసమగుచుండ నిత్యపరిమళశోభితంబగు వరదరాజ కృతి సరసమై పండిత భృంగముల కాకర్షణ యంత్రమువలె నున్నది."[14]

### 1.3 3 శ్రీ రామాయణము :

ఈ రామాయణాన్ని గురించి నిడుదవోలు వెంకట్రావుగారు 'శ్రీ రామాయణము' పీఠికలో ఈ విధంగా వ్రాశారు.

"శ్రీకట్టా వరదరాజకవి కృతమైన ద్విపద రామాయణము తెనుగు భాషయందలి ద్విపద వాఙ్మయ శాఖకేగాక రామాయణ వాఙ్మయమునకు ప్రత్యేక విశిష్టత చేకూర్చిన మహాగ్రంథము. ద్విపద వాఙ్మయశాఖలో గ్రంథ పరిణామమున దీనినిమించిన గ్రంథము లేదు. రామాయణ ద్విపదలలో నధిక వ్యాప్తిగం రంగనాథ రామాయణమునకు కాలక్రమము ననుసరించిన నిది ద్వితీయమే యైనను యథా వాల్మీకముగ మూల గ్రంథము ననుసరించుటలో నిది యద్వితీయమని చెప్పనొప్పును."[15]

### 1 3.3.1 ఇష్టదేవతా స్తుతి :

వరదరాజు తనయిష్టదైవమైన వేంకటేశ్వరుని గూర్చి తన శ్రీ రామాయణ గ్రంథారంభంలో ఈ విధంగా స్తుతిగావించాడు.

"శ్రీకరభోగీంద్ర - శిఖరవిహారి
లోకరక్షణ కళా-లోక ప్రచారి
కలశాంబునిధిరాజ - కన్యావినోది
అలఘుసత్త్వ విహంగ-హయవరసాది
వేదవేదాంతార్థ - విద్యానువాది
ఆది మధ్యాంత క్రి-యాపరిచ్ఛేది
నవరత్నమయభూష-ణవిభావిభాసి
రవికోటి సంకాశ - రమ్యవిభాసి
సకల కల్యాణరా - జద్గుణాకరుఁడు
వికచాబ్జనయనుండు - వేంకటేశ్వరుఁడు
ధారుణి పారిజా-తంబు మాకెపుడు
కోరికలెల్లఁజే - కూరుచుంగాఁత
అలక నిర్జిత భృంగ - అతికృపాపాంగ
అలఘుహేమాభాంగ - అలమేలుమంగ
మాయింటిలోన స-మస్త శోభనవి
ధాయినియగుచు ని-త్యము నుండుఁగాఁత."

శ్రీ రామాయణము (అవతారిక) పుట - 1 పంక్తులు 1 - 16

1.3.3.2 గ్రంథరచనోద్దేశము :

శ్రీ రామాయణ కావ్య రచనోద్దేశ్యాన్ని గురించి కవి ఈ విధంగా తెలిపాడు.

"ఏ కథ రచియింప - నిహపర సౌఖ్య
సాకల్య ఫలము లి-చ్చు విధేయములు
ఏ పురాణమొనర్ప - నెల్ల పుణ్యముల
తేపయై భవవార్ధి - తీరంబుఁ జేర్చు
నే కావ్యము వచింప - నెలమి నాచంద్ర
తారాలోచనకీర్తి - లోకంబు నిండు
నా కథ మానస మూ-హించి కావింపఁ

.........................................

.........................................

దలంచి యేనొక శుభో-త్కట దినంబునను"

- శ్రీ రామాయణము, అవతారిక, 3 - 4 పుటలు. పంక్తులు 57 - 86.

1.3.3.3 స్వప్న వృత్తాంతము :

శ్రీ వేంకటేశ్వరుడు కలలో ప్రత్యక్షమై తనకు తెలిపిన విషయాన్ని గూర్చి వరదరాజు ఈ విధంగా వ్రాశాడు.

"నిను మెచ్చివచ్చితి - నీతలంపెఱిఁగి
ననుఁ దిరువేంగళ - నాథుఁగాఁదెలియు
పద్యకావ్యము చేసి - పరమభాగవత
హృద్య చరిత్రంబు - నిచ్చితిమాకు
సంగత ప్రచమసా-మ్యము శతాధ్యాయి
రంగ మాహాత్మ్యంబు - రచియించినావు.
మాకిపనిపుడు రా-మాయణ ద్విపద
యేపుమీఱఁగ రచి-యింపు మింపలర"

శ్రీ రామాయణము అవతారిక పుట - 5 పంక్తులు 103 -110

1.3.3.4 వంశవర్ణన :

తాను శ్రీ రామచంద్రుని వంశీయుడు కాబట్టి రామాయణాన్ని వ్రాసేయోగ్యత తనకు కలిగినట్లు కవి గ్రంథారంభంలో ఇలా చెప్పాడు.

"ఇనకులంబున వేంక-టేశుండు మున్ను
జనియించి తనపుణ్య - చారిత్రమెల్ల
బోయకులంబునఁ - బుట్టు వాల్మీకి
సేయ నందుఁబ్రమోద - చిత్తుండుగాక
అర్క వంశమున నీ-వై జనియించి
తార్క్ష్యణగాఁగ నే-తత్కథా విధము
రచియింపు మనియె - శ్రీ రామచంద్రునకు
నచలిత ప్రీతిగ-దా నిజాన్వయుఁడు
తన చరిత్రంబు కీ-ర్తనసేయ వినుట
తనయులచేఁగాదె - తామున్ను వినియె"

- శ్రీ రామాయణము, అవతారిక, పుట - 7, పంక్తులు. 151 -160

### 1.3.3.5 వరదరాజు రామాయణము - రంగనాథ రామాయణము.

వరదరాజుకు ముందుగల ద్విపద రామాయణాలలో రంగనాథ రామాయణం ప్రఖ్యాతమైంది తర్వాత తాళ్ళపాక అన్నమయ్యగారి ద్విపద రామాయణం పేర్కొనదగి ఉంది. కాని ఇది నేడలభ్యం వరదరాజు తన శ్రీ రామాయణంలో రంగనాథ రామాయణ కర్తను గురించి ప్రస్తావించలేదు. కవిస్తుతిలో 'నన్నయభట్టారకాది కవులను మాత్రమే ప్రశంసించియున్నాడు. రంగనాథ రామాయణ ప్రశంస ఈ రామాయణంలో లేకున్నా ఆ రామాయణంలోని గుణదోషాల్ని వరదరాజు గుర్తించి ఉండవచ్చు. రంగనాథ రామాయణంలోని అనేక అమూలక విషయాల్ని గుర్తించి కాబోలు వరదరాజు తన శ్రీ రామాయణాన్ని మూల విధేయంగా వ్రాశాడు. తనకు ఇష్టదైవమైన శ్రీ వెంకటేశ్వరుడు ప్రత్యక్షమై

"ద్విపద గావింపుము - తేట తెల్లమిగ
నిపుణత శ్రీరాము-ని కథాక్రమంబు
వాలాయమిది యథా-వాల్మీకముగను
జాణస్తోత్రోర్చి ర-స స్థితుల్ మెఱయ
సేవగా కితరులు - నేరరుపూని
యేవం విడంబుగాఁ - గ్రంథి నిర్వహింప"[6]

అని చెప్పినట్లు గ్రంథావతారికలో వరదరాజు వ్రాశాడు. ఇదిపై అభిప్రాయానికి బలం చేకూరుస్తున్నది.

వరదరాజు రంగనాథ రామాయణాన్ని చూచినా చూడకపోయినా, రంగనాథ రామాయణ లేఖకులు రంగనాథ రామాయణం ప్రతులలో వరదరాజు రచించిన శ్రీ రామాయణ ద్విపదలను చేర్చి వ్రాశారు. ఈ విషయం క్రీ.శ 1942లో బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులచే పరిష్కృతమై ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచేత ప్రకటితమైన రంగనాథ రామాయణం ద్వారా వెల్లడౌతున్నది.[17] వారి ముద్రిత ప్రతిలో రెండు అనుబంధాలు చేర్చబడ్డాయి.

రెండవ అనుబంధంలో పరిష్కర్తలు చూపిన అధిక భాగాలలో అయోధ్యా కాండములోని ఈక్రింది ద్విపదలు కట్టావరదరాజు రామాయణంలోనివి.

1) " అననందులో వృద్ధులైన బ్రాహ్మణులు
వెనుకొని రాముండు విననిట్టులనిరి
రథమునఁగట్టు తురంగంబులార!
పృథువేగమున మీరు పోయెదరేల

స్థావర జంగమాత్మక మైనధరణి
దేవ ! నీరాక యర్థించె మాకరణి
ననియని పలుకుచు"

## అనుబంధము

ఈ పంక్తులు వరదరాజు రచించిన శ్రీరామాయణము, బాల అయోధ్యా కాండములు 435వ పుటలో 4679వ పంక్తినుంచి 438వ పుటలో 4732వ పంక్తివరకు కలవు.

| రంగనాథ రామాయణము పుట - పంక్తి | | వరదరాజు రామాయణము పుట - పంక్తి |
|---|---|---|
| 2 | కాంచన దళ.........లలామంబుజూచి | |
| | యా లక్ష్మణాగ్రజుడు. | 448 - 4983, 5012 |
| 3 | ఎచ్చు సౌమ్ములొసంగి యిరువదివేల | 588 - 8375 |
| | నొకదిప్పగను పట్టె నూరుగాయలను | 592 - 8472 |

4 అని పల్కి భరతుఁడ త్యాపన్నుఁ
డగుచు .... .. ....పల్కెనపుడు 613 - 8996

5 అనురక్తులై......... .. కూర్మిఁజేరఁగ 617 - 9085
నీవెకొలువు లోపలికి 9116

6 ఆవీరశేఖరుండ డలుచుఁ బలికె 626 - 9308
మనలను నెడవాసి మరణంబు నొందె - 9346

7 అరయదైవాధీనుఁడ స్వతంత్రుండు 638 - 9609
. . ... ....చూడఁడేమియును 9640

8 అలరాహు ముఖమున హరిణాంకు 669 - 10343
సూర్యప్రభవోలె 10374

వరదరాజు శ్రీ రామాయణ మందలి బాలకాండలో 5846, అయోధ్యా కాండలో 10738 ద్విపద పంక్తులు కలవు. మొత్తంమీాద వరదరాజు రచించిన శ్రీ రామాయణం రంగనాథ రామాయణం కంటె మూలానుసారిగా విపుల రీతిలో వెలసిన ద్విపదకృతిగా భావించ వచ్చును.

సంఖ్యా సూచిక

1 శ్రీ రామాయణము, కట్టా వరదరాజకవి, బాల అయోధ్యాకాండములు, మద్రాస్ గవర్నమెంట్ ఓరియంటల్ సిరీస్ నం ఎల్. పుట 8, పంక్తులు 173 - 178

2 అముద్రితాంధ్ర గ్రంధ సర్వస్వము 6, పీఠికపుటలు 11 - 111

3 శ్రీ రామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 9, పంక్తులు 199 - 213

4 Vide Sources of Vijayanagara History, PP 244 - 245

5 Vide Sources of Vijayanagara History, PP 262

6 శ్రీరంగ మాహాత్మ్యము, కాగితపు వ్రాతప్రతి, సంఖ్య. ఆర్ 519, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనా సంస్థ, పుట 4

7 Vide Madras Government oriental mannuscripts library Bulletin, Vol I No I Edited by Nidudavolu Venkatarao , P P 91

8 చూ. 17వ శతాబ్దినాటి ఆంధ్రవాఙ్మయ విశేషాలు (వ్యాసము) నేలటూరి వెంకట రమణయ్య, భారతి, పార్థివ మాఘము, సంచిక 2, సంపుటము 23, పుట 112

9 శ్రీరంగ మాహాత్మ్యము, కాగితపు వ్రాతప్రతి, సంఖ్య, ఆర్ 519, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనాసంస్థ, పుట. 5

10. శ్రీ రామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట. 5, పంక్తులు 103 - 110

11 చూ. పరమ భాగవత చరిత్రము, కాగితపు వ్రాతప్రతి, సంఖ్య 7294, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనా సంస్థ, పుటలు 21-22

12 శ్రీరంగ మాహత్మ్యము, కాగితపు వ్రాతప్రతి, సంఖ్య, ఆర్ 519, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోదనా సంస్థ , పుట 374

13 చూ ప్రాచీనాంధ్ర కవులు (వ్యాసము), నిడదవోలు వేంకటరావు, భారతి, ధాత జ్యేష్ఠము, సంచిక 6, సంపుటము 13, పుటలు 701

14 మానవల్లి రచనలు - వ్యాసములు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు - 4, 1972, పుటలు. 296 - 297

15 శ్రీ రామాయణము (ద్విపద), పీఠిక పుట xx

16 శ్రీరామాయణము, (అవతారిక) పుట 6, పంక్తులు 123 - 130

17 చూ. శ్రీ రంగనాథ రామాయణము, పరి. వేటూరి ప్రభాకర శాస్త్రి, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ప్రచురణము.

# ప్రకరణము - 2

# వరదరాజు అనువాద విధానం

**2.0** వరదరాజు వాల్మీకి రామాయణాన్ని మూల విధేయంగా రచించాడు. సంస్కృత రామాయణంలోని సర్గలను అనుసరించి కవిచేసిన విషయ విభాగమే ఇందుకు నిదర్శనం. అయితే వరదరాజు తనకాలం నాటి ప్రాబంధిక రచనా విధానాన్ని కాదనలేదు. కవి తన కాలంనాటి ఆచార వ్యవహారాల్ని వ్యక్తపరుస్తూ, జాతి వార్తా చమత్కార పూర్వకంగా కావ్యరచన చేశాడు. మూలానికి భిన్నాలైన వర్ణనలు ఈ కావ్యంలో లేవు. కవి తనకాలంనాటి సాంఘిక పరిస్థితుల్ని తీసికొని తనరచనలో ప్రతిబింబింపజేశాడు.

వరదరాజు మూలరామాయణాన్ని బాగాపరించి అందులో అనవసరమని తోచినచోట్లను తగ్గించాడు. అవసరమని తోచినచోట్లను పెంచి రచించాడు. పదానికి పదంగా రామాయణాన్ని అనువదించాలన్న అభిప్రాయం ఆయనకులేదు. వాల్మీకి వ్రాసిన రామాయణానికి అర్థభంగం కలుగకుండా వరదరాజు మూల రామాయణాన్ని ఆంధ్రీకరించాడు

వాల్మీకి కాలానికి, వరదరాజు కాలానికి మధ్య అనేకవందల సంవత్సరాలు గడిచాయి. వారు నివసించిన ప్రదేశాలు సైతం విభిన్నమైనవి. ఈ విధమైన దేశకాల భేదాల ననుసరించి, సాంఘికాది సంప్రదాయాల్లోను, ఆచార వ్యవహారాల్లోను, ఆహార విహారాల్లోను వైవిధ్యం ఏర్పడివుండటం సహజమే ఈ రీతిగా ఏర్పడిన వ్యత్యాసానికి అనుగుణంగా వరదరాజు తన కాలంనాటి రాజకీయ సాంఘిక పరిస్థితుల విశేషాల్తో శ్రీ రామాయణాన్ని అనువదించడం జరిగింది.

వరదరాజు తనకాలంనాటి మధురాపురాన్నే అయోధ్యగా వర్ణించినట్లు తెలుస్తూవుంది. ఆ పట్టణంలో చంద్రశాలలు, చావడులు, హజారాలు, హజారాల వద్ద కావలికాచే భటులు, చప్పరాలు, సాముగరిడీల శాలలు, ఉప్పరిగెలు ఉన్నట్లు వరదరాజు తన శ్రీ రామాయణంలో రచించాడు.

" రాజిల్లు మణిమయ - రంగ వల్లికలు
పువ్వుపిల్కుట్టుల-బ్బురపు మేడలును

సావళ్లఁ బసిఁడి హ-జారముల్ కడల
కావళ్లఁ గాచువి-క్రమ వీరభటులుఁ
గేళివనమ్ములుఁ - గృతకాచలములు

బాలికాలంకార - పణ్యవీధులునుఁ
బరపు చప్పరము లు-ప్పరిగెలు సౌము
గరుడులు వైభవా-గత విమానములుఁ
జెఱకుఁదోఁటలు - మిన్ను చెనకు కోటలును
విరులుఁ గదంబముల్- విలుచుఁ బేటలును"[1]

కలవని వరదరాజు వివరించాడు. ఈనాడు పట్టణాభివృద్ధి సంస్థవారు రూపొందించిన పట్టణ నిర్మాణ ప్రణాళిక వరదరాజు అయోధ్యానగర వర్ణనలో మనకు గోచరిస్తుంది.

వరదరాజు మూల రామాయణ అనువాదాన్ని ఐదు విధాలుగా పరిశీలించవచ్చు.

1) మూల విస్తరణలు
2) మూల సంక్షేపాలు
3) మూలానుసరణలు
4) కల్పనలు
5) మూలంలోని వర్ణనల్ని పరిహరించడం.

వరదరాజకవి అనువాదంలో అనుసరించిన పై ఐదు పద్ధతుల్ని కాండక్రమాన సోదాహరణంగా పరిశీలించటం ఈ ప్రకరణం యొక్క ముఖ్యాంశం.

### 2.1.1 మూల విస్తరణ (బాలకాండము)

వరదరాజు అనువాదంలో అక్కడక్కడ మూల విస్తరణ కనిపిస్తుంది. ఈ విస్తరణ అనేక రకాలుగా వుంది. I) మూలంలో లేని వర్ణనల్ని, భావాల్ని చొప్పించడం. II) మూలంలోని ఒక పదాన్నిగాని, పదసమూహాన్నిగాని తీసికొని అందలి భావాన్ని విపులీకరించడం. III) మూలంలో లేని అలంకారాల్ని ప్రవేశపెట్టడం. IV) వ్యక్తి గుణశీల ప్రదర్శనకు విశేషణాల్ని వాడటం - ఇలాంటి పద్ధతుల్లో వరదరాజు మూల విస్తరణల్ని చూడవచ్చు. అయితే కవి సందర్భాను గుణంగానే మూలానికి పెంపు చేకూర్చాడు.

"శ్లో || కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే,
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్"[2]

మూలంలోని పై శ్లోకాన్ని వరదరాజు పెంచి ఇరువదిమూడు పంక్తులలో ఇలా అనువదించాడు.

"గుణశాలియా కౌశి-కుఁడు 'కోసలేంద్ర!
కన్యకాగర్భము - క్షాఫల ! రాగ
తన్మయతను ప్రభా-తంబయ్యెనిపుడు
తావితోసురలు ఖ్యం-దార కాస్యముల
తో వికసిల్లె ని-ద్దురమేలు కొనుము !
శ్రీరామ ! మునికోటి - చింత తోఁదమము
దూరమై తొలఁగె ని-చ్దురమేలు కొనుము !
బలురక్కసుల ప్రతా-పంబులతోడఁ
దొలఁగె తారకలు ని-ద్దురమేలు కొనుము !
మొగిసెను రక్కస-ముదితల కన్నుఁ
దోగలతోఁ దోగలు ని-ద్దురమేలు కొనుము !
దశరథ రాజసు-ధాపయోరాశి
శశిధర ! నిద్దుర - చాలింపవయ్యా !
భరతాది సోదర-భావ మిళింద
సరసిజ ! నిద్దుర - చాలింప వయ్యా !
మాయా నిశాచర - మదవన్మరాళ
తోయద ! రామ ! ని-ద్దుర లేవవయ్యా !
పర్జన్యముఖ దేవ-పాలన శౌర్య
దుర్జయ !రామ ! - నిద్దుర లేవవయ్యా !
మలసియ గస్త్యాశ్ర-మంబు ఖేదములు
తొలగింపవలయు ని-ద్దుర లేవవయ్యా !
సరణిలోనర్ధయో-జన మాత్రఁజిన్న
దురమున్న దొకటి ని-ద్దుర లేవవయ్యా !
చెనకి నాజన్నంబు - చెఱుచుదాన వులఁ
దునిమింపవలయు ని-ద్దుర లేవవయ్యా ! "[3]

'పూర్వా సంధ్యా ప్రవర్తతే' అని మూలంలో వున్నభావాన్ని వరదరాజు పెంచి, ఐదు ద్విపదల్లో వ్రాశాడు. 'వేకువ వచ్చింది' అని అనడానికి కొన్ని ఆధారాల్ని చెప్పితే బాగుంటుందని వరదరాజు భావించాడు.

మునుల తపస్సు వల్ల చీకటి తొలగింది. రాక్షసుల ప్రతాపమనే నక్షత్రాలు తొలగిపోయాయి ఇలాంటి నిదర్శనాలతో విశ్వామిత్రుడు రాముణ్ణి మేల్కొలిపినట్లు

వరదరాజు రచించాడు.

'కౌసల్యా సుప్రజా రామ' అనేభావాన్ని వరదరాజు పెంచి ఎనిమిది ద్విపదలలో వ్రాశాడు. దైవస్వరూపుడైన శ్రీరాముని నిద్ర లేపేటప్పుడు ఆయనను గురించి ఆయన పరాక్రమాన్ని గూర్చి సమయోచితంగా పొగడడం భావ్యమని భావించినందువల్ల ఈ కవి 'మాయానిశాచర, మదవన్మరాళ, తోయద ! రామ !' 'పర్జన్యముఖ దేవ. పాలన శౌర్య ' దుర్జయ ! లాంటి పదాల్ని ఉపయోగించి వరదరాజు శ్రీ రాముణ్ణి ప్రస్తుతించాడు

"కౌసల్యాదేవి సుపుత్రుడవైన రాముడా ! వేకువ వచ్చింది లెమ్ము" అని మూలంలో రాముని మేల్కొల్పు ఆ దేశప్రాయంగా వుంది. వరదరాజు రాముణ్ణి పొగడి, ఆయన మేల్కొన్న తర్వాత చేయాల్సిన పనుల్ని కూడా సూచించాడు వరదరాజు ఇక్కడ మూలాన్నిపెంచి రామునికి గొప్పతనాన్ని ఆపాదించాడు.

"శ్లో || ఏవ ముక్త్వా దనుర్మ ధ్యే బద్వా ముష్టి మరిందమః |
జ్యాశబ్ద మకరో త్తీవ్రం దిశశ్శబ్దేన నాదయన్ ||
తేన శబ్దేన విత్రస్తా స్తాటకావన వాసినః |
తాటకాచ సుసంక్రుద్ధా తేన శబ్దేన మోహితా || "4

వరదరాజకవి పైరెండు శ్లోకాల భావాన్ని పదిహేడు పంక్తుల్లో పెంపొందించాడు

ముని చూచిమెచ్చ రా-ముఁడు కేలనంది
నారిసారించి గు-ణ ధ్వనిసేయ
ఘోరు కలఁగెను - భువనంబులెల్ల
కంటకారులఁ గూర్పఁ-గల స్వయంవరణ
ఘంటాధ్వనులు దేవ-కామినులకును
"నార్త రక్షణకథా-య తవందిబృంద
కీర్తనల్ రాఘవాం-కిత బాణములకు
సంతతా హ్వానముల్- సంగరాహోర
చింతఁ గ్రుమ్మరుముని - శ్రేష్ఠవీనులకు
రాజిత జలధరా - రావముల్ దైత్య
రాజన్యచే తోమ-రాళంబులకును
ఆధ్వని విని తాట - కాసురి చాల
సాధ్వసంబున గుండె-ఝల్లుమనంగ
దిగులుచే నేమియుఁ - దెలియకఁ గడుపు
పగిలి చెమర్చి కం-పమునంది భ్రమసి

ప్రానుగంట ముహూర్త - మాత్రంబునేల
యూనుక కరములు - నూరటనొంది"[5]

రాముని ధనుష్టంకార ధ్వని దిక్కులన్నింటినీ ధ్వనింపచేసిందని మూలంలో వుంది. అయితే వరదరాజు ఈ భావాన్ని పెంచి ఆ దనుష్టంకార ధ్వనిని గురించిన వర్ణన చేశాడు కంటకారుల్ని హతమార్చగల ఆ స్వయంవర ఘంటా ధ్వనులు దేవకామినులకు 'ఆర్తరక్షణ కథాయత వంది బృంద కీర్తన'లని కవి వర్ణించాడు.

ఆధ్వనిని వినినతాటక భయపడిందని మూలంలో వుంది. వరదరాజు తాటక ఎలా భయపడిందో వర్ణించాడు రాముని ధనుష్టంకార ధ్వనిని విన్నతాటక గుండె ఝల్లుమనింది. దిగులుచే దిక్కుతోచలేదు. ఆ భయానికి కడుపు పగిలింది. భయకంపిత అయి ఒక్క క్షణకాలం నేలపై ఊనుకొని అటు తర్వాత ఆ భయం నుంచి తేరుకుందని ఆయన తెలిపాడు

దైవ స్వరూపుడైన రాముని మహిమను చాటడానికే వరదరాజు మూలంలోని భావాల్ని పై విదంగా విస్తరించి వర్ణించాడని చెప్పవచ్చు

"శ్లో || అప్సరస్స్వాగతం తేఽస్తు వస చేహ మమాశ్రమే |
అనుగృహ్ణీష్వ భద్రం తే మదనేన సుమోహితమ్ || "[6]

తనను అనుగ్రహించడానికి రమ్మని విశ్వామిత్రుడు మేనకను తన ఆశ్రమానికి ఆహ్వానించిన విషయం మూలంలో ఒక శ్లోకంలో మాత్రమే వుంది దీన్ని వరదరాజు పెంచి పదునారు ద్విపద పంక్తుల్లో అనువదించాడు.

"ఆ రామముల నొంటి - నలసిన వాఁడ
నోరామ ! నీచెంత-ను నిచిలాలింపు
తీఱనియాఁకలి - తీరంగ నీవు
పారణయిడుము బిం-బఫలాధరమునఁ
బంచాగ్ని మధ్య త-పశ్శ్రాంతి నీదు
మించు కౌఁగిటిలో శ-మింపంగఁజేయు
సేసితాపము దీఱ- మీనాంకు కేళి
నానందరసవార్ధి - యందుఁదేలింపు
నాయాశ్రమంబులో - నాదానవగుచు
నోయిందువదన ! నీ-వుండి నఙాలు
యెవ్వారిచేఁగాని-యే కోర్కులైన

నెవ్వేళ గోరిన - నేనిత్తునీకు
మరుని బారికిలోఁగి - మానంబు వదలి
శరణుచొచ్చితి నీదు - చరణంబులకును
బంటనయ్యెద నన్నుఁ-బని గొమ్మువాలుఁ
గంటి ! వేఁడిన యూడి-గములు చేసెదను"[7]

తాను మన్మథునిచే మోహము నొందింపబడి పరవశుడైనట్లు విశ్వామిత్రుడు మేనకకు తెలిపి, తనతో క్రీడింపుమని కోరినట్లు మూలంలో వుంది. వరదరాజు ఈ భావాన్ని పెంచి విశ్వామిత్రుడు మేనకకు దాసోహమనినట్లు రచించాడు తాను ఆశ్రమాల్లో ఒంటరిగావుండి అలసిపోయానని మేనక తనను లాలించాలని, తనతీరని కోరికను తీర్చాలనీ విశ్వామిత్రుడు మేనకతో అంటాడు మేనక తనకౌగిట్లో అతన్ని బంధించాలని ఆయన శరీరతాపం తీరేవిధంగా ఆమెతన్ను రసవార్థిలో తేలించాలని విశ్వామిత్రుడు మేనకను కోరినట్లు వరదరాజు వ్రాశాడు.

మేనక తన ఆశ్రమంలో తనదానిగా వుంటే ఆమె ఏమికోరినా తీరుస్తానని విశ్వామిత్రుడు అన్నట్లు కవి వ్రాశాడు మన్మథునికి లొంగి, మానం వదిలి విశ్వామిత్రుడు ఆమె పాదాలకు శరణుచొచ్చినట్లు తెలిపాడు. తనను అనుగ్రహిస్తే ఆమెకు బంటుగావుండి వూడిగాలు చేస్తానని విశ్వామిత్రుడు అన్నట్లు వరదరాజు రచించాడు విశ్వామిత్రునంతటి వాడే వేశ్యకులొంగి ఇలాపతనం అయిపోతే ఇక సామాన్య వ్యక్తి విషయం చెప్పనవసరం లేదు. కామవాంచ బలీయమైందని దానికి లొంగినవాడు ఇంగితజ్ఞానాన్ని కోల్పోతాడని వరదరాజు నిరూపించాడు. కామవాంచకు లొంగిపోయి తనవ్యక్తిత్వాన్ని పూర్తిగా కోల్పోయిన ఒక సాధారణ వ్యక్తిగా విశ్వామిత్రుణ్ణి వరదరాజు చిత్రించాడు.

ఇలాగే బాలకాండలో ఇంకను కొన్నిచోట్ల వరదరాజు కావించిన మూల విస్తరణలను చూడవచ్చు

అంబరీషుని యాగానికి పశువుగా శునశ్శేఫునికి బదులుగా తనకొడుకుల్ని వెళ్ళమని విశ్వామిత్రుడు కోరగా, వారు ఆయన కోరికను తిరస్కరించినట్లు మూలంలోని ఒక శ్లోకంలో వుంది.

కథమాత్మసుతాన్ హిత్వా త్రాయసేన్యసుతం విభో
అకార్యమివ పశ్యామశ్శ్వమాంస ఇవ భోజనే. "[8]

పై శ్లోకభావాన్ని పెంచి వరదరాజు ఇరువదిరెండు పంక్తులలో రచించాడు.

"గౌరవించుటయు శృం-గారించి భక్తిఁ
దేఱిమాచుటయొ చే-తికి పండు ఫలము
నిచ్చుటో పెండ్లి -సేయించుటో చదువు
వచ్చెనా యనివిని -వారి మెచ్చుటయొ
క్రతువులు సేయించి - కలిగిన సౌమ్ము
హితబుద్ధితోఁబంచి-యిడుటయో యాత్మ
బోధంబు పిలిచి తె-ల్పుటయొ సద్వృత్తి
బోధించుటో నీవు - పుత్రులంజూచి
పట్టుచుఁబట్టి యీ-పాపంబుమాట
యెట్టాడితిరి చావ-నేఁటికి తమకు
నొనరునె యిట్టాడ - నొక్కని చావు
తనమీఁదఁదెచ్చు కోఁ-దలఁచునె యొకఁడు ?
ఒప్పుగాదిది తన-యుల ప్రాణములకుఁ
దప్పి చావుండను - తండ్రి గలాఁడె ?
ఆడక నీకేమి ? - యామాట వినఁగ
గూడదుగాక మా-కును వెఱ్ఱితండ్రి!
మహిభోజనము లశ్వ-మాసంబు నటుల
విహితంబుగా దిట్టి - విధమునఁ బల్కి
యీ ముని బాలకుం-డెటు వోయనేమి ?
యీ మహీవరు యాగ-మేమైననేమి ?
మీమాట మాతల - మీఁదట నున్న
దీ మొల్ల మనిన మౌ-నీంద్రుఁడిట్లనియె"[9]

'ఇతరులకు సహాయం చేయదల్చుకుంటె పండ్లు, ఫలాలు ఇవ్వవచ్చు. పెండ్లి చేయించవచ్చు. క్రతువులు చేయించవచ్చు. తనసొమ్మును పంచిపెట్టవచ్చు మంచిని బోధించవచ్చు. కాని, తనకొడుకుల ప్రాణాల్నే త్యాగంచేయాలని భావించడం వెఱ్ఱితన'మని విశ్వామిత్రునితో ఆయన కొడుకులు అన్నట్లు వరదరాజు తెలిపాడు

'ఒక్కని చావు తనమీాదికి తెచ్చుకోవాలని ఎవ్వరూ భావించరని, ఆ మునిబాలుని సంగతి, రాజుయాగం సంగతి తమ కనవసర'మని వారు విశ్వామిత్రునితో అన్నట్లు వరదరాజు పెంపుచేశాడు

విశ్వామిత్రుడు తనకొడుకుల ప్రాణాల్ని ఇతరులకోసం త్యాగం చేయడం భావ్యంకాదని వరదరాజు భావించాడు. ఇతరులకు సహాయ పడదల్చుకుంటే అనేక మార్గాలున్నాయని ఆయన ఉద్దేశం.

రాముడు, సమస్త భూషణాలతో అలంకరించుకొని తమ్ములతోకూడి, వివాహానికి తగిన ముహూర్తంలో వసిష్ఠుణ్ణి మరియు చాలమంది మహర్షుల్నీతోడ్కొని తండ్రివెంట వెళ్లినట్లు మూలంలోవుంది.

"శ్లో|| యుక్తే ముహూర్తే విజయే సర్వాభరణ భూషితైః|
బ్రాతృభిస్సహితో రామః కృతకౌతుక మంగళః|| "[10]

దీన్ని వరదరాజు పెంచి ఇరువదిరెండు పంక్తుల్లో రచించాడు.

" దరణీశునాజ్ఞ సో-దరులతోఁ గూడి
సరవిగా మంగళ-స్నానముల్ చేసి
సాంకవ మృగమద - సమ్మిశ్రమైన
కుంకుమ పంకంబు - ఘుమ్మన నలఁది
నవరత్న భాసమా-నములైన యట్టి
వివిధాంగుళీయక - వితతిఁగీలించి
జవ్వాది లావు లె-సంగు సంపంగి
పువ్వుటెత్తులు సిగఁ-బొసగించి చుట్టి
సరిలేని కట్టాణి - చౌకట్లతోడ
నొరయుఁ జొక్క పుఁగెంపు - టొంటులు దాల్చి
శ్రీకర రోహణ - శిఖరికూటంబు
రేక మాణిక్య కి-రీటం బమర్చి
మరకత శ్యామ కో-మల కటీరమున
గరువంబుగాంచు బం-గరుచేలఁగట్టి
పరమయోగులమనః - పద్మముల్ వ్రాలు
సరణి సుతారక -సరములవైచి
మనసులోఁ జొచ్చి య-మ్మదనుండు నిలిపెఁ
దనతేజి ననఁ జిల్క-తాళి ధరించి
పలక వజ్రముల జొ-ప్పడు భాషికంబు
నెలరేక హరుఁడు పూ-నిన మాడ్కి పూని

ధరణీభరము మాన్పఁ-దా దీక్షదాల్పు
కరణి ముంగేల కం-కణము ధరించి"[11]

'సమస్త భూషణాలు' అని మూలంలో ఉండగా ఏయే భూషణాల్తో వారు అలంకరింప బడిందీ వరదరాజు విపులంగా వ్రాశాడు.

రాముడు మంగళ స్నానాలుచేసి ఘుమ్మని వాసనవచ్చే కుంకుమ పంకాన్ని పూసికొని నవరత్నాల్తో పొదిగిన వివిధ రకాలైన ఉంగరాలనూ, సిగలో సంపంగి పువ్వుల్నీ మాణిక్యాల్తో పొదిగిన కిరీటాన్ని, నడుముకు బంగారు చేలానీ, తేజస్సుతోకూడిన చిల్కతాళినీ, వజ్రాల్తో పొదిగిన భాషికాన్నీ, ముంజేతికి కంకణాన్నీ ధరించి సోదరుల్తో కలసి వెళ్ళినట్లు కవి వ్రాశాడు. వరదరాజు తనకాలం నాటి రాజులు వివాహాలకు ఉపయోగించే అలంకరణ సామాగ్రిని ఇక్కడ ప్రస్తావించాడు.

ఈ రీతిగా ఈ కవిరాజు తనకాలంలో వాడుకలోఉన్న అలంకరణ సామగ్రిని రచనలో చొప్పించి మూలాన్ని చక్కగా విస్తరింపజేశాడు

సొమ్ములతో అలంకరింపబడిన సీతను జనకమహారాజు తోడ్కొనివచ్చి అగ్ని సమక్షంలో రాముని యెదుట నిలిపినట్లు మూలంలో కలదు.

"శ్లో|| తతస్సీతాం సమానీయ సర్వాభరణ భూషితామ్ |
సమక్షమగ్నే స్సంస్థాప్య రాఘవాభిముఖే తదా ||"[12]

సీతను ఆమె చెలికత్తెలు వివిధాలంకరణ సామగ్రితో అలంకరించినట్లు మూలాన్నిపెంచి కవి రచించాడు.

"నవరత్న సూర్య చం-ద్ర కలాపయుగము
సవరించె నొక్క చం-చలనేత్ర జడను
వడిఁ జంద్రకావి పా-వడమీఁదఁ బసిఁడి
పొడులెందు వెదచల్లు - బురుసా పటంబు
పసిఁడి కంగులు దీరు - పైరిణీ రవికె
నొసపరి దొడిగించె - నొకతె సీతకును
నిలువుటద్దము చెంత-నిలిపె యొక్కర్తు
తిలకించి కస్తూరి - తిలకంబు దీర్చె
పలచనగా కదం-బము పూసిమేల్మి
తళుకు గందవొడి మీఁ-ద నలందె నొకతె
సరిలేని ముత్యాల - సరులను కంట

సరియు నొడ్డాణంబు - సందిదండలును
కట్టాణి ముక్కర - కళుకుఁగమ్మలును
మట్టెలుఁగరము ల-మ్మణుల గాజులును
కంకణమ్ములు సూడి-గములు నందెలును
కింకిణీ రవములఁ-గెలయు మేఖలయు
ముత్తేల బొగడలు - ముక్కెఁ ఘనడుగు
లత్తుకలును నేర్పు-లను చంద్రముఖులు
సవరణల్ చేసిరి - జనక తనూజ
నవలఁ బెండ్లికుమార్తె -లైనముప్వురును"[13]

సీతకు నవరత్న సూర్యచంద్ర కలాపయుగాన్ని ఒకచెలికత్తె సవరించింది. పైరిణీరవికెను ఒక చంచలనేత్రి తొడిగింది మరొక చెలికత్తె కస్తూరి తిలకం తీర్చిదిద్దింది. ఇంకొకతె గంధపొడి చల్లింది. ఆమెకంఠంలోని ముత్యాల సరాలను ఒక చెలికత్తె సవరించింది. ఇలాగే ఒడ్డాణం, సందిదండలు, కట్టాణి ముక్కెర, కళుకు గమ్మలు, మట్టెలు, మణుల గాజులు, కంకణాలు, సూడిగలు, అందెలు కింకిణీరవాలగెల, ముత్యాల బొగడల్ని జనకతనూజకు ఆయా చెలికత్తెలు అలంకరించారు.

సీతకు అలంకరించిన అలంకరణ సాగ్రిని గురించి మూలంలో తెలుపలేదు. పై అలంకరణ సామగ్రి అంతా వరదరాజు కాలం నాటిదని చెప్పవచ్చు.

### 2.1.2 మూల సంక్షేపాలు

వరదరాజకవి మూలాన్ని కొన్నిచోట్ల తగ్గించి అనువదించాడు. మూలానికి ఈయన చేసిన సంక్షేపం కథను ముందుకు నడిపించడానికి, పాఠకునకు అనవసరశ్రమను తగ్గించడానికి దోహదం చేసేవిగా ఉన్నాయి. మూలంలోని వర్ణనల్ని, సంభాషణల్ని, ప్రశ్నోత్తరాల్ని, కవి సందర్భాను గుణంగా అక్కడక్కడ తగ్గించి రామాయణాన్ని చక్కని ద్విపదకావ్యంగా రచించాడు.

దశరథ మహారాజు మంత్రులను గురించిన వర్ణన మూలంలో

"శ్లో || తస్యామాత్యా గుణైరాసన్నిక్ష్వాకోస్తు మహాత్మనః |

నీతి శాస్త్ర విశేషజ్ఞాస్సతతం ప్రియవాదినః || "[14]

అని పదునేడు శ్లోకాల్లో వుంది.

దీన్ని వరదరాజు తగ్గించి పదునెనిమిది పంక్తుల్లో అనువదించాడు.

"ఇంగితజ్ఞులు నతి-హితులు మంత్రజ్ఞు
లంగీకృతాన్యోన్య-లను రక్తులైన
సిద్ధార్థ విజయ ధృ-ష్టి జయంత మంత్ర
సిద్ధ సాధకజయ-స్థిర సుమంత్రులును
మఱియశోకుఁడు నెన-మంత్రుఁ ప్రధాను
లరయ నవ్విభుని(కా-యకఁగొల్చియుండ
వరపుణ్యులు వసిష్ఠ - వామదేవాఖ్యు
లిరువురు హితపురో-హితులైవసింప
వెలయుచు ధర్మకో-విదులు జితేంద్రి
యులు ననాగత కార్య-యోజనపరులు
రాజానుమతులు ప-రస్పర స్నేహ
రాజితుల్ చారవా-ర్తా విలోకనులు
సర్వసమాను లు-త్సాహసమేతు
లుర్వీహితులు చతు-రోపాయమతులు
సంధివిగ్రహముఖ - షడ్గుణోన్నతులు
సంధా ప్రతిష్ఠితుల్- సామాదిరతులు
నైన మంత్రుల కర-ణావళి చేత
భానుఁడొప్పెడు రీతిఁ-బఙ్క్తిరథుండు"[15]

మూలకర్త దశరథుని మంత్రుల గుణగణాల్ని తెలిపి, వారుచేసే కార్యాల్ని గురించి విపులంగా వివరించాడు. వరదరాజు సంక్షిప్తంగా వారి గుణగణాల్ని మాత్రమే తెలిపాడు.

ధర్మకోవిదులు, జితేంద్రియులు, కార్యయోజనపరులు, రాజాను మతులు, చారవార్తా విలోకనులు, ఉర్వీహితులు, స్నేహరాజితులు, ఉత్సాహ సమేతులు, చతురోపాయమతులు, సంధాప్రతిష్ఠితులు, సామాదిరతులు - అయిన మంత్రులతో దశరథుడు సూర్యునివలె వెలుగొందు చుండెనని వరదరాజు రచించాడు.

మూలంలో విస్తారంగా ఉన్న వర్ణనల్ని యథాతథంగా అనువదిస్తే, ప్రధానకథపై పాఠకునికి ఆసక్తి తగ్గుతుందని భావించడంవల్ల సంగ్రహించి, ఈకవి పై రీతిని మంత్రుల గుణగణాల్ని మాత్రమే చెప్పాడు.

దశరథుని అశ్వమేధయాగానికి గుణవంతులైన రాజులను పిలువ వలసిందని వసిష్ఠుడు సుమంత్రునికి చెప్పేవిషయం మూలంలో

"శ్లో || నిమంత్రయస్వ నృపతీన్ పృథివ్యాం యేచ ధార్మికాః|

తానాయన యథాక్షిప్రంసానుగాన్ సహబాంధవాన్"[16]

అని తొమ్మిది శ్లోకాల్లోవుంది దీన్ని వరదరాజు తగ్గించి పది పంక్తుల్లో వ్రాశాడు

"ఆ సుమంత్రునిఁ జూచి-యనియె వసిష్ఠుఁ

డో సచివోత్తమ ! - యుత్తమశీలు

భావన జ్ఞానసం - పన్నుని జనక

భూవరుఁదోతెమ్మ - పోరాని సఖుని

కాశీశుమామఁగే-కయ ధారుణీ త

లేశునిం దోతెమ్ము - హితబంధులైన

కోసల మగధులం - గొనిరమ్ము నీవె

వాసిగా నీధ రా-వరుల సీమలకుఁ

బోయితోడుక తెమ్ము-పౌంతలనృపుల

రాయబారుల నంపి - రప్పింపు వేగ"[17]

జనకమహారాజు, కాశిరాజు, కేకయరాజు రోమపాదుని గుణాల్ని తెలిపి, వారిని ధశరథుని అశ్వమేధయాగానికి పిలువుమని వసిష్ఠుడు సుమంత్రునితో చెప్పినట్లు మూలకర్త రచించాడు.

జనక మహారాజును గురించి మూలకర్త దృఢ పరాక్రమం కలిగిన శూరుడు, సమస్త శాస్త్రాలు తెలిసినవాడు, మహాభాగ్యశాలి - అని తెలిపినాడు వరదరాజు ఆయన్ని గూర్చి ఉత్తమశీలుడు, భావనజ్ఞాన సంపన్నుడు - అని మాత్రమే వ్రాశాడు.

మూలకర్త కాశీరాజును గురించి దయాశీలి, ఎప్పుడూ ప్రియంగా మాట్లాడేవాడని, కేకయరాజును గురించి ధర్మాన్ని ఆచరించే వారిలో శ్రేష్ఠుడని, రోమపాదుని గురించి, సద్గుణాలచే అలంకరింపబడిన వాడు, శ్రేష్ఠమైన కీర్తిగలవాడు, మహాభాగ్యశాలి - అనీ తెలిపాడు, వరదరాజు ఈ ముగ్గురిని గూర్చి ఏమీ తెలుపకుండా 'కాశీశుమామఁగేకయు ధారుణీ తలేశునిందోతెమ్ము' అని వారిపేర్లను మాత్రమే వివరించాడు.

అశ్వమేధయాగానికి హితులైన రాజుల్ని పిలువుమని వశిష్ఠుడు సుమంత్రునికి చెప్పేటప్పుడు ఆరాజులగుణాల్ని వర్ణించడం సందర్భోచితం కాదని వరదరాజు భావించి మూలాన్ని సంక్షేపంగావించి వుండవచ్చు.

భగీరథుడు బ్రహ్మదేవుణ్ణి వరాలడగడం మూలంలో మూడు శ్లోకాల్లో ఉంది.

"శ్లో|| అది మే భగవన్ ప్రీతో యద్యస్తి తపసః ఫలమ్ |,
సగరస్యాత్మజాస్సర్వే మత్తస్సలిలమాప్నుయుః ||
గంగాయాస్సలిలక్లిన్నే భస్మన్యేషాం మహాత్మనామ్ |,
స్వర్గం గచ్ఛేయురత్యంతం సర్వే మే ప్రపితామహాః ||
దేయా చ సంతతిర్దేవ నావసీదేత్కులం చ నః |,
ఇక్ష్వాకూణాం కులే దేవ ఏష మేఽస్తు వరః పరః || [18]

దీన్ని వరదరాజు మూడు పంక్తుల్లో కుదించి అనువదించాడు.

"కొడుకులఁ గామించు - కోరిక యొకటి
మా పెంపజులరుఁగ-ర్మంబులు దీర్ప
దేవతానదిని ధా-త్రికిఁదెచ్చుటొకటి"[19]

తాను చేసిన తపస్సు ఫలిస్తే సగరుని కొడుకులకు జలతర్పణం చేయగలనని భగీరథుడు బ్రహ్మదేవునితో అన్నట్లు మూలకర్త ఒక శ్లోకంలో రచించాడు.

మరో శ్లోకంలో, సగరపుత్రుల దేహభస్మం గంగానదీజలంలో తడుపబడితే వారందరు స్వర్గాన్ని పొందుతారని భగీరథుడు అన్నట్లు వ్రాశాడు. తన ఇక్ష్వాకువంశంలో సంతానం కలుగవలెనని భగీరథుడు బ్రహ్మదేవుని కోరినట్లు మూడవశ్లోకంలో వుంది.

వరదరాజు పై భావాన్ని మూడు ద్విపద పంక్తుల్లో రచించాడు. కొడుకులు కావాలన్న కోరిక ఒకటికాగా రెండవది దేవతానదిని భూమిపైకి తేవః అని బ్రహ్మదేవునితో భగీరథుడు అన్నట్లు వరదరాజు వ్రాశాడు.

వాల్మీకి భగీరథుడు బ్రహ్మదేవుణ్ణి ముక్కుకు సూటిగా వరాలు అడగలేదు. మూలంలోని భగీరథుని కోర్కెల్లో స్పష్టతలేదు. ఆయన భయపడుతూ బ్రహ్మను వరాలడిగినట్లు వుంది. వరదరాజు భగీరథుడు ఎలాంటి జంకూ, గొంకూ లేకుండా బ్రహ్మను వరాలడిగాడు. అందువల్లనే వరదరాజు భగీరథుని కోర్కెల్లో స్పష్టత, సంక్షిప్తత చోటుచేసుకొన్నాయి.

### 2.1.3 మూలానుసరణలు

వరదరాజు కొన్నిచోట్ల మూలంలోని భావానికి ఎలాంటి మార్పులు చేయకుండ యథాతథంగా అనువదించాడు. అలాంటిచోట్ల మూలానికి మార్పు చేయకుండుటే ప్రధాన కథకు దోహదం చేసినట్లు అవుతుందని ఆయన భావించాడు.

రావణుని దుష్టప్రవర్తనను గురించి దేవతలు బ్రహ్మదేవునికి విన్నవించటం మూలంలో -

"శ్లో || భగవన్ త్వత్ప్రసాదేన రావణో నామ రాక్షసః |,

చలోర్మిమాలీ తం దృష్ట్వా సముద్రోఽపి న కంపతే || "[20]

ఐదుశ్లోకాల్లో వుంది

మూలంలోని పైశ్లోకాల భావాన్ని ఎలాంటి మార్పులు చేయకుండా వరదరాజు ఆంధ్రీకరించాడు

"దేవ ! నీవరము లొం-దిన కావరమున
రావణుం డఖిలవి - ద్రావణుండిపుడు
యక్షులందోలి వి-ద్యా ధరావళిని
శిక్షించి దివి-జులం జీకాకుచేసి
పన్నగుకోటుల - బాధించి గరుడ
కిన్నర శ్రేణులం - గీడ్పడందరిమి
గంధర్వులనుఁ గొట్టి-ఖ చరులనణఁచి
బంధురోన్నతిని ది-క్పాలురఁ గెలిచి
గర్వాంధుఁడై కన్ను-గానకయెందు
సర్వంకషంబైన - సాహసోద్ధతిని
నందనకాన నాం-తర పారిజాత
చందన కల్పక-చ్ఛాయల యందు
మెలఁగెడు దేవతా-మీన లోచనలఁ
జలమునఁ జెఱపట్టి - సనియె లంకకును,
అతని యాజ్ఞచలింప - నంబుధి వెఱచు
వెతల రాపడిగాలి - విసరంగ వెఱచు
నాశికమిత్రుఁ డెం-డలు గాయవెఱచు"[21]

రావణుని దుష్ట ప్రవర్తనను, మూలంలోని భావాన్నే యథాతథంగా ఆంధ్రీకరించాలని వరదరాజు భావించినా, ఒక విషయాన్ని ఆయన కల్పించక తప్పలేదు

దేవతలు రావణుని గూర్చి ఆతడు లోకపాలురను ద్వేషిస్తున్నాడని, ఇంద్రుని అవమానిస్తున్నాడని బ్రహ్మదేవునితో తెలిపారు. అలాగే ఆరావణుడు, ఋషుల్ని, యక్షుల్ని, గంధర్వుల్ని, అసురుల్ని, బ్రాహ్మణుల్ని అవమానిస్తూన్నాడని బ్రహ్మదేవునితో విన్నవించినట్లు మూలంలో కలదు

వరదరాజు ఇక్కడ మరో విషయాన్ని రచించాడు. అది వనాల్లో పారిజాత పుష్పాల్ని కోసుకోవడానికి వచ్చే దేవతాస్త్రీల్ని రావణుడు చెరపట్టి లంకకు తీసుకుపోతున్నాడని దేవతలు బ్రహ్మతో తెలుపడం మూలాన్ని మరింత విస్తరించి రావణుని దుష్టత్వాన్ని తెలిపితే ప్రధాన కథకు అవరోధం కలుగుతుందని కవి భావించాడు

విశ్వామిత్రుడు అయోధ్యకు రాగా దశరథ మహారాజు సంతసించి, అతణ్ణి పొగడిన విషయం మూలంలో

"శ్లో || యథాఽమృతస్య సంప్రాప్తి ర్యథా వర్ష మనూదకే |,

ఇచ్ఛామ్యనుగృహీతోఽహం త్వదర్థ పరివృద్ధయే || "22

అని ఏడు శ్లోకాల్లోవుంది వరదరాజు దీన్నియథాతథంగా ద్విపదీ కరించాడు.

"ఘోరున నిర్జల - భూమినిఁ గురియు
ధారాళమగున మృ-తపు వానరీతి
తగినదంపతులకుఁ - దనయులు గలిగి
యగణిత సంతోష - మందించినటుల
యెన్నేని నాళ్లఁ బో-యిన సొమ్ముమణులు
కన్నుల ముందరఁ - గనుపించు కరణి
కోరికతా రేఁగి -కొలుచు నవ్వేల్పు
వారకయెదురు గా-వచ్చిన మాడ్కి-
మునినాథ ! నామనం-బునకు నీ రాక
యనుపమ సంతో-ష మందించె నిపుడు
ఎంత కల్యాణ మ-య్యెను నేటిదివస
మింతటి వేడుక - యెట్లు వాకొందు

ఫలియించెనాదు త-పంబు లన్నియును
సులభంబుగా మిమ్ముఁ - జూడంగఁ గల్గె
యేను నేసిన భాగ్య-మెవ్వరుఁ జేయ
రానందమగ్నుం-డనైతి నివ్వేళ
రాజర్షి వయ్యును - బ్రహ్మర్షివైతి
వే జటీంద్రులకైన - నీశక్తి గలదె ?
నీవువచ్చుటఁ జేసి - నేఁడు నాభూమి
పావనంబయ్యె నా-భాగ్య వైఖరిని
నాకేశవందిత ! - నాకిట్టిమేలు
చేకూరఁదలఁచి వి-చ్చేసితిరిటకు
నేమి వేఁడిననిత్తు - నెటు సేయుమనినఁ
దామ సింపకొనర్తు - దప్పదీమాట
అవుగాము లెన్నక-యను మానముడుగి
ప్రవిమలాత్మక నన్నుఁ-బని గొను మిపుడు. "[23]

వరదరాజు ఇక్కడ మూలాన్ని కొద్దిగా విస్తరించినా మొత్తం మీద ఈ భాగాన్ని మూలానుసరణగానే భావింపవచ్చు. వరదరాజు మూలంలోని భావానికి ఎలాంటి హాని జరుగనీయకుండా క్రొత్తమెరుగులు దిద్దాడు. దశరథ మహారాజు విశ్వామిత్రునికి స్వాగతం చెప్పి ఆయన్ని పొగడిన విషయానికి వరదరాజు అక్కడక్కడ ఒకటిరెండు పంక్తుల్ని పెంచాడు.

విశ్వామిత్రుణ్ణి ఉద్దేశించి దశరథుడు 'నాభాగ్య వశాన నీవు ఇచ్చటికి వచ్చావు. నా పుట్టుక సఫలమైంది. నాబ్రతుకు మంచి బ్రతుకైంది' అని అన్నట్లు మూలంలో వుంది వరదరాజు ఇక్కడ రెండు పంక్తుల్ని అదనంగా చెర్చాడు. 'ఇంత సంతోషాన్ని ఎట్లా భరించగలనని, తనతపస్సులన్నీ ఫలించాయని' దశరథుడు అన్నట్లు వరదరాజకవి రచించాడు.

'మీరు అయోధ్యకు రావడంవల్ల నేను పుణ్యక్షేత్రాల్లో వుండే వాడినైతి' నని దశరథుడు విశ్వామిత్రునితో అన్నట్లు మూలంలో వుంది. వరదరాజు 'తమరాకవల్ల మాభూమి పావనమయ్యిందని, మాకు ఇలాంటి మేలు చేయడానికే మీరు వచ్చార'ని దశరథుడు విశ్వామిత్రునితో అన్నట్లు వ్రాశాడు.

**2.1.4** కల్పనలు :

వరదరాజు స్వతంత్రించి తనకావ్యంలో కొన్నిచోట్ల మూలభిన్నాలైన కల్పనల్ని కావించాడు. ఈ కల్పనలు సందోర్భో చితంగాను, కావ్యసౌందర్యాన్ని ఇనుమడింప జేసేవిగాను ఉన్నాయి.

త్రిశంకువు గురువువద్ద శాపం పొందినందువల్ల ఆతణ్ణి ఇంద్రుడు స్వర్గానికి రానివ్వలేదని మూలంలో -

"శ్లో|| త్రిశంకో గచ్ఛ భూయ స్త్వం నాసి స్వర్గ కృతాలయః|,
గురుశాపహతో మూఢ పత భూమిమవాక్ఛిరాః||[24]

అని వుంది. వరదరాజు పై శ్లోకభావాన్ని ఈక్రింది విధంగా మార్చి అనువదించాడు.

"పచ్చిమాలవు నీవు-పాపాత్మ! యోరి!
గురుశాపహతుఁడవు -కొంకకేరీతి
నరుదెంచినావు నా-యా స్థానమునకు ? "[25]

'పచ్చిమాల' అని వరదరాజు మూలంలో లేని విషయాన్ని ప్రత్యేకంగా కల్పించి వ్రాశాడు త్రిశంకువు గురుశాపహుతుడే కాకుండా 'పచ్చిమాల' అయినందువల్ల పాపాత్ముడని వరదరాజు భావం. దీనివల్ల మూలరామాయణ కాలంనాటికంటె వరదరాజు రామాయణ కాలంనాటికి సమాజంలో కులవ్యవస్థ బాగా పాతుకుపోయినట్లు తెలుస్తూవుంది.

రామలక్ష్మణ, భరత శత్రుఘ్నులు శాస్త్ర పద్ధతిలో వివాహం చేసికొన్నారని మూలంలో

"శ్లో || అగ్నిం ప్రదక్షిణీకృత్య వేదిం రాజాన మేవచ|,
ఋషీంశ్చై వ మహాత్మానస్స భార్యా రఘుసత్తమాః||
యథోక్తేన తదా చక్రుర్వివాహం విధిపూర్వకమ్|| "[26]

అనే రెండు శ్లోకాలు ఉన్నాయి అయితే వరదరాజు తనకాలంలోని రాజకుటుంబాల్లో వివాహవేదికలపై నిర్వహింపబడే తంతును వివరించాడు

"రవి వంశదీపకుల్- రత్న పీఠముల
నాసీనులగు తరి-నంకురార్పణము
చేసి యక్షతముల - శ్రీ చందనంబు

లాజలు నేయి పా-లాశముల్ తేనె
భాజనంబులును ద-ర్భములు మున్గాఁగ
హోమసామాగ్ని వ-హ్నులుఁ దెచ్చియునిచి
శ్రీమించ రఘురాము - చేత వేల్పించి "[27]

రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు, అగ్నిహోత్రునకు, వేదికకు, జనక మహారాజునకు, ఋషులకు ప్రదక్షిణం చేసి, శాస్త్ర పద్ధతిలో కల్ప సూత్రం ప్రకారం వివాహం చేసికొన్నట్లు మూలంలోవుంది.

అయితే వరదరాజు మూలాన్ని మార్చి స్వతంత్ర కల్పనచేశాడు. రామలక్ష్మణ, భరతశత్రుఘ్నుల్ని రత్నపీఠికలపై ఆసీనుల్ని చేయించి అక్షతలు, శ్రీచందనము, లాజలు, నేయి, పాలాశములు, తేనె, భాజనాలు, దర్భలు మొదలైన హోమసామగ్రిని తెచ్చి, శ్రీరామునిచేత వేల్పించినట్లు వరదరాజు వర్ణించాడు. ఇది వరదరాజు కాలంనాటి సమాజంలో వివాహవేదికల వద్ద జరిగేతంతును గురించి తెలియజేస్తుంది.

వరదరాజు రామాయణానువాద సందర్భంలో అక్కడక్కడ ఇలా స్వతంత్రించి రచన చేశాడు ఈ స్వంతంత్రత వరదరాజు నివసించిన సమాజ, ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులకు అనుగుణంగా వెలసింది.

**2 1 5 మూలంలోని వర్ణనల్ని పరిహరించుట :**

వరదరాజు మూలంలోని కొన్ని వర్ణనల్ని పూర్తిగా పరిహరించాడు. అలా పరిహరించడానికి గల కారణాలను క్రిందిరీతిగా ఊహింపవచ్చు.

1) ఆవదలి వేయబడిన వర్ణనలు సందర్భోచితంగా లేవని కవి భావించడం.

2) అవి ప్రధానకథా గమనానికి అనువాదంలో ఆటంకంగా ఉంటాయని తలంచడం.

ఏదియేమైనా మూలంలోని కొన్ని వర్ణనల్ని ఆంధ్రీకరించకుండా వదలివేయడం వల్ల కావ్య సౌందర్యానికి ఎలాంటిలోటూ ఏర్పడలేదు.

రామ లక్ష్మణుల వృత్తాంతాన్ని గురించి జనకుడు విశ్వామిత్రుని అడిగేటప్పుడు వారిని గురించిన వర్ణన మూలంలో

"శ్లో || ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్య పరాక్రమౌ |
గజసింహగతీ వీరౌ శార్దూలవృష భోపమౌ, |
పద్మపత్ర విశాలాక్షౌ ఖడ్గతూణీ ధనుర్ధరౌ ||

అశ్వినావివ రూపేణ సముపస్థిత యౌవనౌ, |
యదృచ్ఛయైవ గాం ప్రాప్తౌ దేవలోకాది వామరౌ ||

కథం పాద్భ్యామిహ ప్రాప్తౌ కిమర్థం కస్యవామునే,
వరాయు ధధరౌ వీరౌ కస్య పుత్రౌ మహామునే.
భూషయంతావిమం దేశం చంద్రసూర్యా వివాంబరమ్, |
పరస్పరస్య సదృశౌ ప్రమాణేంగిత చేష్టితైః ||
కాకపక్షధరౌ వీరౌ శ్రోతుమిచ్ఛామి తత్త్వతః ."[28]

అనే ఒమ శ్లోకాల్లో వుంది. వరదరాజు ఈ వర్ణనను పూర్తిగా పరిహరించి ఈ విధంగా వ్రాశాడు.

"అంజలిచేసి యు-య్యనఘుని చెంత
రంజిల్లు చున్నట్టి - రామలక్ష్మణులఁ
జూచి 'వీరెవ్వ రె-చ్చోటికేఁగెదరు ?
రాచకుమారులే - రాజ నందనులు ?
వీరి పేరెయ్యది ? - వినుపింపు 'మనిన"[29]

జనకుడు రామలక్ష్మణుల శౌర్య పరాక్రమాల్ని రూపసౌందర్యాన్ని పొగిడి, వారి రాకకు గల కారణాన్ని గూర్చి విశ్వామిత్రుణ్ణి ప్రశ్నించినట్లు మూలంలో ఉంది.

జనకుడు రామలక్ష్మణుల చిరునామాను తెలుపమని విశ్వామిత్రుణ్ణి అడిగే సందర్భంలో, వారి శౌర్యపరాక్రమ, రూప సౌందర్యాల్ని గురించి వర్ణన చేయడం సందర్భోచితంగా ఉండదని వరదరాజు భావించాడు అందుకే మూలంలోని పై విషయానికి సంబంధించిన వర్ణనను పూర్తిగా పరిహరించి, రామ లక్ష్మణుల చిరునామాను జనకుడు విశ్వామిత్రుణ్ణి అడిగినట్లు మాత్రమే వ్రాశాడు.

వరదరాజు తన కావ్యరచనలో ఇలాంటి ఉత్తమ పద్ధతుల్ని అవలంభించి నందువల్లనే ఈతని ద్విపద రామాయణ రచన సాహితీలోకంలో ఒక విశిష్టస్థానాన్ని సంపాదించుకొన్నది

## 2.2.1 మూల విస్తరణ (అయోధ్యాకాండము)

వరదరాజు అయోధ్యాకాండలో చాలాచోట్ల మూలాన్ని చక్కగా విస్తరించాడు.

1) నేనుకోరిన వరాలు ఎందుకు ఇవ్వ'వని కైక దశరథుని ప్రశ్నించినట్లు మూలంలో -

"శ్లో|| త్వం కత్థసే మహారాజ ! సత్యవాదీ దృఢవ్రతః |
మమ చేయం వరం కస్మాద్విధారయితు మిచ్ఛసి || "[30]

అని ఒకశ్లోకంలో వుంది. దీన్ని వరదరాజు పెంచి పంద్రెడు పంక్తుల్లో ఆంధ్రీకరించాడు.

"సూనృత వాదివి - శూరవర్యుఁడవు
మానసీయుండవు - మానుష నిధివి
కల్లలాడవు నాదు - గారాబు ప్రాణ
వల్లభుండవు దృఢ - వ్రతుఁడ వేలయ్య ?
యిచ్చెద నను వరం-బిమ్మన్న వేగ
నిచ్చితి ననక నీ-విన్ని నేరుపులు
న్యాయ నిష్ఠురములు - నయగారి వగలు
సేయుచు నన్ను వం-చింపఁ జూచెదవు
ఇచ్చెదవో లేదొ - యిఁక నొక్క మాట
యుచ్చరింపుఁడు రాముఁ-డున్నాఁడు, నీకుఁ
గౌసల్య యున్నది - కడమ వారేల ?
వేసాలు చాలించి - వినఁ బల్కుఁ                    "[31]

వాల్మీకికైక దశరధుణ్ణి తానుకోరిన వరాలు ఇవ్వమని ఒక చిన్నశ్లోకంలో క్లుప్తంగా అడిగింది. వరదరాజుకైక ఆభావాన్నే పంద్రెండు పంక్తుల్లో విశదీకరించింది.

'సత్యవాదివి, దృఢవ్రతుడవు - ఐన ఓనాథా ! నేను కోరిన వరాలు ఇవ్వడానికి ఎందుకు సందేహిస్తున్నావు' ? అని మాత్రమే కైకమూలంలో ప్రశ్నించింది.

కైకకోర బోయేవి సామాన్య వరాలుకావు దశరథుని యొక్క అభీష్టానికి వ్యతిరేకంగా భరతునికి పట్టాభిషేకం, మరియు ఏకన్నతండ్రీ సహించలేని శ్రీరామ వనవాసం - ఆమె కోరికలు. ఇవి దశరథుని మరణానికి కూడ కారణాలయ్యాయి. ఇట్టికోరికలు కోరేముందు కైక కొంతనేర్పును ప్రదర్శిస్తుందనే అంశం సత్యం అందుకే వరదరాజు కైకనేర్పును పన్నెండు పంక్తుల్లో వివరించాడు.

'సూనృతవాదివి, శూరవర్యుడవు, మానసీయుడవు, కల్లలాడవు' - అని కైక తొలిపలుకుల్లోనే ముందరి కాళ్ళకు బంధంవేసింది 'నీవు అసత్యవాదివికాదు, అల్పుడవు కాదు ' - అని చెప్పి నావరాలు నాకిమ్మన్నప్పుడు దశరథుడు కాదనడానికి వీలులేకపోయింది. ఇంకాకైక 'గారాబు ప్రాణ వల్లభుండవు' అనుటతో వారి మధ్య

ప్రేమానురాగాలు అతిశయమని వ్యక్తమవుతుంది. అంతటి ప్రేమమూర్తి ఇస్తానన్న వరాల్ని ఇవ్వకపోవడం ధర్మంకాదు. ఇట్లు కైకదశరథుణ్ణి ధర్మసందేహంలో పడవేసింది. అంతేగాక 'నామీద నిజంగా ప్రేమవుంటే వరాలు ఇమ్మని కోరగానే వెంటనే ఇస్తాననక ఎందుకు సందేహిస్తున్నావు'? - అని నిలదీసింది. ఇంకా మరొక అడుగుముందుకు వేసి 'ఇచ్చెదవో లేదో తేల్చి చెప్పు'మని - పట్టుబట్టింది. మరియు స్త్రీ సహజమైన ఈర్ష్యను ప్రదర్శించింది 'కౌసల్యా, రాముడు - ఉండగా నాతో నీకేమిపని' ? అనిదెప్పిపొడిచింది.

పై విధంగా వరదరాజు కైకలో క్రమపరిణామం కనిపిస్తుంది. మొదట ఆమె దశరథుని పొగడించి కోరికలు తీర్చమనింది. వెంటనే తీర్చలేదని న్యాయ నిష్ఠురాలు ఆడింది. తానుకోరే కోర్కెలు బలీయమైనవి కావున తానుకూడ వాదనలో బలంగానిలవడానికి కోపాన్ని ప్రదర్శించి సవతిమీద తనకున్న అక్కసును వెళ్లగక్కింది.

ఇక్కడ వరదరాజు పెంపు ఎంతో సహజంగాను, సమంజసంగాను వుంది. ఈ పెంపు ద్వారా కైకపాత్రకు ఒక పుష్టి కలిగింది

2) భరతునకు మార్గాన్ని చక్కబరచడానికి పనివాళ్ళు గుంపులు గుంపులుగా ఆయనకన్నముందుగా తమసాధనాల్తో అరణ్యానికి పోయినట్లు ఒకే శ్లోకంలో వుంది.

"శ్లో|| తే స్వవారం సమాస్థాయ వర్త్మ కర్మణి కోవిదాః|,
కరణై ర్వివిధోపేతైః పురస్తాత్సం ప్రతస్థిరే|| "[32]

దీన్ని వరదరాజు పెంచి ఇరువదియొక్క పంక్తుల్లో రచించియున్నాడు

"వనమార్గములు దెల్ప - వచ్చినవారు
పారలునుప్పర - పారలు గడ్డ
పారలు చెక్కుడు - పారలు మడ్డు
గత్తులు గొడ్డండ్లు - కర్జెలుం గొలిమి
తెత్తులు దన్నీరు - తిత్తులు కరకు
కొడవండ్లు నెడ్లును - గోనెలుం దాటి
గుడమును సున్నంబు సం-కులుఁ గావిరాళ్లు
పంచవర్ణ ద్రవ్య - భాండములొనీరు

మంచముల్ నిచ్చెనల్ - మ్రాకుల బండ్లు
చించపు రేకులు - చింతయంబళ్ళు
పెంచులు నిటికలుఁ - బేర్పులు నూనె
లగపలు కణికలు - నావులు రెట్లు
నగరి బొక్కిసము గు-న్నాపట్టి కరక
కాయలు పంచాణి -కపుఁబనిముట్లు
చాయల వస్తువుల్ - జల్లులు మేలు
కట్టులు శుకశారి-కా పంజరములు
పట్టెమంచంబులు - పఱుపులు దివియ
గంబముల్ వెండి - బంగారు కొప్పెరలును
కంబళ్ళు మెఱుఁగులు - గాజుఁ గుండలును
మొదలైన సాధనం-బులు బరువులును
నదలంబు ముందర -సాగించు నపుడు"[33]

భరతునికి వనమార్గాన్ని ఏర్పరచడానికి వెళ్ళిన పనివాళ్లు పారలు, ఉప్పరపారలు, గడ్డపారలు, చెక్కుడు పారలు, మడుపుకత్తులు, గొడ్డండ్లు, కర్రెలు, కొలిమి తిత్తులు, తన్నీరు తిత్తులు, కరకు కొడవండ్లు, తాటి గుడము, సున్నము, సంకులు, కావిరాళ్ళు, పంచద్రవ్య భాండాలు, నీరుమంచాలు, నిచ్చెనలు, మ్రాకులబండ్లు, చించపురేకులు, చింత అంబళ్లు, పెంచులు, ఇటికలు, నూనెలగపలు, కణికలు, కరకకాయలు, పంచాణికపు పనిముట్లు, చాయల వస్తువులు, మేలుకట్టులు, శుకశారికా పంజరాలు, పట్టెమంచాలు, పరుపులు, దివియగంబాలు, వెండిబంగారు కొప్పెర్లు, కంబళ్లు, గాజుకుండలు - మొదలైన మూలంలో ప్రస్తావించని వస్తువుల్ని తీసుకుపోయినట్లు వరదరాజు రచించాడు.

పైన పేర్కొన్నవన్నీ వరదరాజు కాలంనాటి పనిముట్లే. ఏదైనా ఒకమార్గాన్ని వేయడానికి గాని మరి దేనికైనాగాని ఆ కాలంవారు ఉపయోగించే పనిముట్లనన్నిటినీ పై ద్విపద పంక్తుల్లో ఈ కవిరాజు తెలియబరచాడు. ఆ కాలంనాటి రాజులు వనవిహారంకోసంగాని, వేటకుగాని వెళ్లినప్పుడు వారు పఱుపులు, పట్టెమంచాలు, కప్పుకోవడానికి కంబళ్లు, నీళ్లుతాగడానికి గాజుకుండలు మున్నగువాటిని తమవెంట పట్టించుకొని వెళ్లేవారని పై వర్ణనవల్ల విదితమౌతున్నది.

3) రాముని పట్టాభిషిక్తుణ్ణి చేయడానికి శీఘ్రంగా ఆజ్ఞాపించమని సుమంత్రుడు దశరథుని కోరడం మూలంలో

"శ్లో|| క్షిప్రమాజ్ఞాప్యతాం రాజ ! న్రాఘవ స్యాభిషేచనమ్ |,
యథా హ్యపాలాః పశవో యథా సేనా హ్యనాయకా ||
యథా చన్ద్రం వినా రాత్రి ర్యథా గావో వినా వృషమ్ |,
ఏవం హి భవితా రాష్ట్రం యత్ర రాజా || న దృశ్యతే "[34]

అని రెండు శ్లోకాల్లో వుంది వీటిభావాన్ని వరదరాజు పదునొక్క పంక్తుల్లో పెంచి రచించాడు.

"రవిలేని దినము సా-రధి లేనిరథము
కవిలేని కీర్తి యం-కము లేనిపోటు
ప్రతిలేని వాదు తీ-ర్పరి లేనిసేన
ధృతిలేని తెగువ కూ-రిమిలేని చెలిమి
దొరలేని సీమ చం-ద్రుఁడు లేనిరాత్రి
తరిలేని సంధ్యమం-త్రము లేని జపము
సతిలేని గృహము వా-సనలేని పువ్వు
ఋతిలేని కొలువు కో-యిలలేని వనము
శ్రుతిలేని పాట శూ-రులులేని కోట
కతలేని రచన ని-ల్కడలేని మాట
యెల్లెడ వృథయైన - యెన్నికగాక"[35]

'గొల్లవాడులేని పశువులు, నాయకుడు లేని సేన, చంద్రుడు లేనిరాత్రి, ఆబోతులేని ఆవులమందవలె రాజులేని రాజ్యం కాంతిచెడి వుంటుం'దని సుమంత్రుడు దశరథునకు తెలిపినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు ఇక్కడ మూలశ్లోకాల్లోని భావాన్ని చక్కగా పెంచిరచించాడు. 'రవిలేని దినం, సారథిలేని రథం, కవిలేని కీర్తి, అంకంలేని పోటు, ప్రతిలేని వాదు, తీర్పరిలేని సేన, ధృతిలేని తెగువ, కూరిమిలేని చెలిమి, దొరలేని సీమ, చంద్రుడులేని రాత్రి, తరిలేని సంధ్య, మంత్రంలేని జపం, సతిలేని గృహం, వాసనలేని పువ్వు, ఋతిలేని కొలువు, కోయిలలేని వనం, శ్రుతిలేని పాట, శూరులులేని కోట, కతలేని రచన, నిల్కడలేని మాట, రాజులేని రాజ్యంవలె ఉంటుందని సుమంత్రుడు దశరథునితో అన్నట్లు వరదరాజు విశదీకరించాడు.

మూలానికి కావించిన ఈ పెంపువల్ల వరదరాజు గొప్పలోకజ్ఞుడనే విషయమేగాక జాతీయాలపట్ల మిగుల అభిరుచిగల వాడనికూడా వెల్లడౌతున్నది.

4) సుమంత్రుడు చంద్రునివలె ప్రకాశిస్తున్న శ్రీ రాముని చూశాడని మూలంలో-

"శ్లో|| తం వైశ్రవణ సంకాశ ముపవిష్టం స్వలఙ్కృతమ్ |,
దదర్శ సూతః పర్య ఙ్కే సౌవర్ణే సోత్తరచ్ఛదే ||
వరాహరుధిరాభేణ శుచినాచ సుగన్ధినా |,
అనులిప్తం పరార్థ్యేన చన్దనేన పరన్తపమ్ ||
స్థితయా పార్శ్వతశ్చాపి వాలవ్యజనహస్తయా |,
ఉపేతం సీతయా భూయశ్చిత్రయా శశినం యథా || "[36]

అని మూడు శ్లోకాల్లో వుంది. దీన్ని వరదరాజు పెంచి ఇరువది యెనిమిది పంక్తుల్లో రచించాడు.

"రావణ హరణ కా-రణమైన వాని
జాతినసిక మీఁది - సంపఁగి సరులు
సూరెల వలపు లె-చ్చుగ నిచ్చువాని
లక్క-జంబగుచు ఘు-మ్మని తావు లీను
చెక్కు-లు జవ్వాది - చిన్నెలవాని
సీతకౌఁగిట నంటి - చెదఱు నెమ్మేనఁ
జాతిన కుంకుమ - సవరణవాని
నున్నని విడెంపు-నును గెంపుమోవి
నెన్ను మీఁటినయట్టి - చిఱునవ్వు వాని
సడలని కరుణార-స ప్రవాహములఁ
కడవోని నెత్తమ్మి - కన్గవవాని
మగువల హస్త చా-మర మారుతములఁ
దగ నసియాడు కుం-తలముల వాని
ధరణి తనూజ యం-దములైన తొడలఁ
జరణ పద్మంబులు - చాఁచినవాని
బంగరు మంచము - పై తలగడను
శృంగారముగ మేనుఁ - జేర్చినవాని
నుడిగపుఁ జెలియిచ్చు - నొసపరియాకు

మడుపున్కై కేలు-మలచిన వాని
వెలఁది యొక్క తె వంతు - విధమునఁ బాడు
జిలిబిలి పాటలు - చెవినాను వాని
వలనొప్పు సుఖపార - వశ్యత నిదుర
మెలఁకువ నటమున్న - మేల్కాను వాని
చిత్రాసమేతుఁడై - చెలువొందు కుముద
మిత్రు తేజంబున - మించినవాని
శ్రీ రామచంద్రు నీ-క్షించి రమ్మనఁగ"[37]

'శ్రీ రాముడు కుబేరునితో సమానుడై చక్కగా అలంకారాలు ధరించి బంగారు పాన్పుపై కుర్చొనివున్నాడు. సీతాదేవి ఆయనకు చామరాన్ని వీస్తూవుండినది. అప్పుడు ఆయన చిత్రా నక్షత్రంతో ప్రకాశించే చంద్రుడు లాగా ప్రకాశిస్తున్నాడు. అలాంటి శ్రీ రాముణ్ణి సుమంత్రుడు చూచి'నట్లు మూలకర్త తెలిపాడు మూలంలో సుమంత్రుడు చూచిన శ్రీరాముని స్వరూపాన్ని వరదరాజు విస్తారంగా పెంచి మురిపెంగా శ్రీరాముని వర్ణన చేశాడు వరదరాజు సుమంత్రుడు 'రావణ హరణ కారణమైన వానిని, జాతినసిక మీది సంపెంగసరులు నూరెల వలపు లెచ్చుగ నిచ్చువానిని, ఘుమ్మని తావులీను చెక్కులు జవ్వాది చిన్నెల వానిని, సీత కౌగిట అంటి చెదరునెమ్మేన జాతిన కుంకుమ సవరణ వానిని, నున్నని వీడెంపు నునుగెంపు మోవి జెన్ను మీరినట్టి చిఱునవ్వు వానిని, సడలని కరుణారస ప్రవాహముల కడవోని నెత్తమ్మి కన్గవ వానిని, మగువల హస్తచామర మారుతముల దగనసియాడు కుంతలముల వానిని, ధరణి తనూజ అందములైన తొడలమీద జరణ పద్మంబులు చాచినవానిని, బంగారు మంచంపై తలగడను శృంగారముగామేను జేర్చినవానిని, ఊడిగపు చెలియిచ్చు ఒసపరియాకు మడుపున్కై కేలుమలచిన వానిని, వెలదియొక్క తెవంతు విధమున పాడు జిలిబిలి పాటలు చెవినాను వానిని, వలనొప్పు సుఖ పారవశ్యత నిదుర మెలకువనటమున్న మేల్కాను వానిని, చిత్రా సమేతుడై చెలువొందుకుముదమిత్రు తేజంబున మించిన వా'డైన శ్రీరాముని దర్శించాడు

మూలంలో శ్రీ రాముని స్వరూప వర్ణనను వరదరాజు విస్తరణల ద్వారా 'శ్రీ రామాయణానికి' కొత్తమెరుగులు దిద్దినట్లైంది. పాఠకునికి శ్రీరాముని మీద భక్తిభావం పెరగడానికి కూడా పై మూల విస్తరణ మిగుల దోహదం చేస్తున్నది.

5) కైక శ్రీరాముని అడవికి పంపినందువల్ల భరతుడు ఆమెను దూషించిన విషయం మూలంలో ఒక శ్లోకంలో వుంది.

"శ్లో|| సాత్వ మగ్నిం ప్రవిశ వా స్వయం వా దణ్డకాన్ విశ్వ |,
రజ్జుం బధాన వా కణ్ఠే నహి తేఽన్యత్పరాయణమ్ || "[38]

ఈ శ్లోకభావాన్ని వరదరాజు పదిపంక్తుల్లో విస్తరించి రచించాడు.

"ఎల్లరు రోసిన - యీ బ్రదుకేల ?
చెల్లదు నీకు నీ-క్షితిమేనుం దాల్ప ?
నడవికి జనుము కా-రగ్గిలోఁ బనుము
జడనిధింబడుము వి-షంబైనఁ గొనుము
నురిబెట్టుకొను మాయు-ధోరు ఘాతమునఁ
దెరలుము నూతిలోఁ - ద్రెళ్లుము నాల్క
వెఱకు కొమ్మిఁక గొంతు - విసుకుక చావు
మురక కూడును నీరు - మడిగి నశింపు
పడుముర్విని మేడ-పై మాడు వెక్కి
గడియలోన నపకీర్తి - గడ తేర్చుకొనుము"[39]

భరతుడు కైకను 'అగ్నిహోత్రంలో నైనాపడు, దండకారణ్యానికైనావెళ్లు, రజ్జువును కంఠానికి కట్టుకుని ఉరిపోసుకునైనా ప్రాణాలు విడువు' అని తూలనాడినట్లు మూలంలోవుంది.

వరదరాజు ఈ భావాన్ని విస్తరించి రచించాడు. 'అందరూ ఈ సడించిన నీ బ్రతుకు ఎందుకు ? నీవు ఈ భూమిపై బ్రతుకదగవు. అడవికి వెళ్ళిపొమ్ము, అగ్గిలో పడుము జలనిధిలో పడుము. విషం తీసుకొనుము. ఉరిబెట్టుకుని మృతిచెందుము. నూతిలోపడుము. నాలుక పెరుకుకొమ్ము. గొంతు పిసుక్కొని చావుము. మేడమీద నుంచి పడుము ' అని భరతుడు తన తల్లిని తీవ్రంగా దూషించనట్లు కవి తెల్పాడు.

కైక దుష్ట ప్రవర్తనాన్ని లోకుల కళ్ళకు కట్టినట్లు తెల్పాలనే ఉద్ధేశ్యంతో వరదరాజు ఇక్కడ మూలాన్ని పెంచాడని భావించవచ్చు. కవి ఇక్కడ, పామరజనులు సాధారణంగా వాడే పదాల్నే వాడాడు. ఈ రీతిగా ప్రధానపాత్రల స్వరూపాల గుణగణాల ప్రస్తావన మూలంలో ఎక్కడవచ్చినా వరదరాజు వాటిని తన అనువాదంలో విస్తరించి రచించాడు ఈ పాత్రల స్వరూపాల పట్ల, గుణగణాలయెడల పాఠకులకు స్పష్టమైన

అవగాహన వుండాలనే దృష్టితోడనే ఈ రాజకవి ఇలాంటి మూల విస్తరణల్ని చేసివుంటాడని నిశ్చయింపవచ్చు.

6) 'ఈ గొప్ప పాన్పుపై బంగారు పొడి అంటుకుని వుండడంవల్ల సీతాదేవి మార్గశ్రమంబున ఆభరణాలతోనే పరుండిందని భావించెద' నని భరతుడు తన మంత్రులకు తెలిపాడు. ఈ విషయం మూలంలో ఒకశ్లోకంలో వుంది.

"శ్లో|| మన్యే సాభరణా సుప్తా సీతాఽస్మిన్ శయనోత్తమే|,

తత్ర తత్ర హి దృశ్యన్తే సక్తాః కనకబిన్దవః || [40]

[illegible] తొమ్మిది పంక్తుల్లో వ్రాశాడు.

"జనకనందన బురు - సాచీర చెఱగు

బంగరు పొళ్లును - పైరాని రవికె

కంగుల నూలంటు - కఱకు పచ్చికలు

గమగమ జవ్వాది - కమ్మ నెత్తావి

గమిచన నివ్వది - కసువుతలాడ

యెండఁబారిన పువ్వు - టెత్తులుం గెలన

నిండిన వీటికా - నిబిడ రసంబు

త్రొక్కురాలంటు ల - త్తుకయు నాశయ్య

చక్కఁదింజూచి మూ - ర్ఛ మునింగి లేచి" [41]

జనకనందన బురుసాచీర చెఱగు, బంగారుపొళ్లు, పైరానిరవికె కంగుల నూలంటు కఱకు పచ్చికలు, గమ గమ జవ్వాది కమ్మనెత్తావి, ఎండబారిన పువ్వు టెత్తులు, గెలలో నిండిన వీటికా నిబిడరసాన్ని, ఆశయ్య చక్కదనాన్ని భరతుఁడు చూచి మూర్ఛలో మునిగి లేచినట్లు వరదరాజు రచించాడు.

మూలకర్త బంగారు పొళ్లు కనపడడంచేతనే, అక్కడ పరుండింది సీత అనే కారణాన్ని చెప్పడం విడ్డూరమని తలంచి సందువల్లకాబోలు ఆపాన్పుపై పరుండింది సీత అని రుజువు చేయడానికి వరదరాజకవి కొన్ని ఆధారాల్ని తనరచనలో చేర్చి వివరించాడు.

7) భరద్వాజ మహాముని భరతునికి అతని సేనకు ఆతిథ్య మివ్వడానికి ఉద్యుక్తుడయ్యాడు. అందుకోసం 'కొన్ని నదులు నీటికి బదులు ఖర్జూరాలతో చేసిన మైరేయంబను మద్యంబు ఒసంగుగాక, కొన్నినదులు మంచి సురను ఒసంగుగాక, మరికొన్ని నదులు చెఱకు రసంబు వంటి చల్లని జలాన్ని

ఒసంగుగాక' అని భరద్వాజుడు నదుల్నికోరినట్లు మూలకర్త ఒకశ్లోకంలో పేర్కొన్నాడు.

"శ్లో|| అన్యా స్రవన్తు మైరేయం సురా మన్యా స్సునిష్ఠితామ్|,
అపరా శ్చోదకం శీత మిక్షుకాణ్డరసోపమమ్"|| [42]

ఈ విషయాన్ని వరదరాజు పెంచి పదునాలుగు పంక్తుల్లో రచించాడు.

"సారాయి నొకయేఱు - చురుచుక పారెఁ
బారెఁగల్లున నొక్క - పావన తటిని
తేనియ వెల్లినే - తెంచె నందొకటి
యాని యాజ్య ప్రవా-హము చూపెనొకటి
పాలచే నొక్కటి - ప్రవహించెఁ జెఱకుఁ
బాలచే నొకటిని-బ్బరముగా వచ్చె
ఫలరసంబులు నించి -పారెనందొకటి
కళకు లేఁబెరుగు ము-ద్దల వచ్చె నొకటి
పాయ సమయముగాఁ - బ్రవహించె నొకటి
ఆయెను సూపమ - యంబుగా నొకటి
యెలనీరుతోఁబ్రవ-హించె నందొకటి
చలువ మజ్జిగ నిండఁ-జనుదెంచె నొకటి
పానకంబుల చేతఁ-బ్రవహించె నొకటి
నానారసముల ను-న్నతి గాంచె నొకటి"[43]

'సారాయితో ఒకయేఱు, తేనెతో ఒకయేఱు, నేతి ప్రవాహంతో ఒకయేఱు, పాలచే ఒకటి, చెఱకు పాలచే ఒకటి, ఫలరాసాల్తో ఒకటి, లేతపెరుగు ముద్దలచే ఒకటి, పాయసమయంగా ఒకటి, సూపమయంగా ఒకటి, ఎళనీరుతో ఒకటి, చలువ మజ్జిగతో ఒకటి, పానకముల్తో ఒకటి, నానారసాల్తో ఒకనది ప్రవహించా' యని వరదరాజు వ్రాశాడు

ఖర్జూరంతో చేసిన మద్యంతోను, సురతోను మాత్రమే ఒకపెద్దరాజ కుటుంబీకుడైన భరతునికి ఆతిథ్యం ఇవ్వడం సమంజసంకాదని కవి భావించాడు. అందుకే వరదరాజు మూలాన్ని పెంచి, తన సమాజంలో దొరికే అనేక రకాలైన ఆహారాల్తో భరతునికి విందుభోజనం పెట్టించాడు.

### 4.2.2 మూల సంక్షేపాలు

అయోధ్యాకాండలో కవితనకు ఉచితమని తోచిన అనేక చోట్ల మూలాన్ని సంక్షేపించి అనువదించి యున్నాడు.

1) రాముడు అడవికి పోవాలని, భరతుడు రాజ్యాన్ని పొందాలని కైకేయి దశరథుణ్ణి కోరింది. ఆమె కోరికల్ని విన్న దశరథుని మానసిక వ్యథను గురించి మూలంలో -

"శ్లో|| శ్రుత్వా తు రాజా కైకేయ్యా వ్రతం వర మశోభనమ్|,

.. .... ..... ................... .......

....... ............................... .

హృతతేజా యథా సర్పో బభూవ జగతీపతిః" || [44]

అని ఐదుశ్లోకాల్లో వుంది. దీన్ని వరదరాజు సంక్షేపించి ఐదు ద్విపద పంక్తుల్లో వ్రాశాడు

"తన ప్రాణ సదృశుండౌ - తనయుని మీద
నాననెత్తిన వజ్ర - హతిచేబలె మేను
వ్రాను పడంగ సొ-మ్మసిలి మూర్ఛిల్లి
యవనిపైబడి మాట-లాడక యుండి
యవనీశ్వరుండు ధై-ర్య సహాయుండగుచు" [45]

కైకేయి కోర్కెల్ని విన్న దశరథునకు' ఇంద్రియాలు స్వాధీనంతప్పి కైకెయితో ఏమీపలుకలేదు. ఆయన అప్రియాలు పలుకుచుండే కైకేయిని కోపంతో చూశాడు. వజ్రంవలె కఠినమై, మనస్సుకు అప్రియమైన కైకేయి కోర్కెల్నివిని దశరథుడు ఎంతమాత్రం సహించలేక పోయాడు ఆయన కైకేయి నిశ్చయాన్ని తానుచేసిన ప్రతిజ్ఞను తలచుకుని మొదలు నరికిన వృక్షంలాగా నేలపై పడ్డాడు. అప్పుడు దశరథ మహారాజు, ' మనస్సు నశించిన వానివలె, పిచ్చి పట్టిన వాని విధంగా సన్నిపాతంచే భేదించిన ప్రకృతి గలవానివలె, వ్యాధితునిలాగా, మంత్రబలంవల్ల నిర్వీర్యమైన సర్పంవలె కనపడుతుండె' నని మూలకర్త వ్రాశాడు

ఈ విషయాన్ని వరదరాజు సంక్షేపించాడు. రాముణ్ణి అడవికి పంపాలని కైకకోరడంతో దశరథుడు 'వజ్రహతునివలె మేను వ్రానుపడగా సొమ్మసిల్లి, మూర్ఛిల్లి, అవనిపైబడి, మాటలాడకయుండి కోరలూడ్చినఋసకొట్టు సర్పంబులాగ వుండెన' ని వరదరాజు తెల్పాడు

దశరథుని విషాదాన్ని వరదరాజు సంక్షేపించాడు. విషాదాన్ని విపులీకరించి చెప్పడం వరదరాజుకు అంతగా రుచించినట్లులేదు. కాని ఇక్కడ దశరథుని పరిస్థితిని విపులీకరించి చెప్పుటయే సమంజమనిపిస్తుంది. కాని క్లుప్తీకరణలో కూడా వరదరాజు కొంత స్పష్టతను చూపి పాఠకునికి దశరథుని ఆవేదనను నిరూపించాడు.

2) రాముడు అడవులకుపోతూ, తనతల్లి కౌసల్యను బాగా చూచుకొమ్మని తండ్రికి చెప్పే విషయం మూలంలో

"శ్లో|| ఇయం ధార్మిక! కౌసల్య మమ మాతా యశస్వినీ |
వృద్ధాచాక్షుద్రశీలా చన చ త్వాం దేవ! గర్హతే ||
మయా విహీనాం వరద! ప్రపన్నాం శోకసాగరమ్|,
అదృష్ట పూర్వవ్యసనాం భూయ స్సమ్మన్తు మర్హసి||,
పుత్ర శోకం యథా నర్చే త్త్వయాపూజ్యేన పూజితా|,
...... .. . ...... . ........ ........ ....
నజీవితం న్యస్యయమక్షయం వ్రజేత్" || [46]

నాలుగు శ్లోకాల్లోవుంది. దీన్ని వరదరాజుకవి తగ్గించి వ్రాశాడు.

"ఓదేవ! మాతల్లి - యున్నది నీదు
పాద పద్మంబులు - భక్తిఁ గొల్చుచును
ఏను వనంబుల - కేఁగిన వెనుక
దీనయై మిగుల నా-ర్తి వహింపనీక
కైకేయిఁ జూపకఁ - గరుణనొఁగాము
లేకడం జూడక - యేవచ్చు దనుక
ప్రాణముల్ మేనిలోఁ - బట్టుకయుండఁ
త్రాణదానముచేసి - పనుపుమునన్ను
అభయ హస్తమొసంగుఁ-డ. ........."[47]

'ధార్మికుడవైన దశరథమహారాజా! నాతల్లి కౌసల్య కీర్తిమంతురాలు, వయస్సుమళ్ళింది ఉత్తమ స్వభావంగలది నీవు నన్ను అడవులకు పంపుచున్నా ఆమె నిన్ను నిందింపకుండావుంది నీవు వరాలిచ్చు వాడవు నేను పోయినపిదప, దుఃఖసముద్రంలో పడివున్నట్టిదీ, మునుపెన్నడూ దుఃఖాన్ని అనుభవించి యెరుగనిదీ అయిన నాతల్లి కౌసల్యను నీవు గౌరవించాలి. పూజ్యుడైన నీవు ఆమె పుత్ర దుఃఖాన్ని పొందకుండా చూచుకోవాలి. ఆమె నన్ను తలచుకొని నీ ప్రాపున బ్రతకాలి

దేవేంద్రునికి సాటియైనవాడా! నేను అరణ్యానికి పోయిన పిమ్మట కౌసల్య దుఃఖంతో కృశించి ప్రాణాలు విడువ కుండునట్లు నీవు ఆమె యందు ఆదరాన్ని చూపుతుండాలి' అని రాముడు దశరథునితో చెప్పినట్లు మూలకర్త తెల్పాడు.

ఈ విషయాన్ని వరదరాజు సంక్షేపించి రచించాడు. 'ఓదేవా! మాతల్లి నీపాద పద్మాల్ని భక్తితో కొలుస్తూ వుంది. నేను అడవులకు పోయిన పిమ్మట ఆమె దుఃఖంతో కృశించకుండా నేను తిరిగి వచ్చినంతవరకు ఆమె ప్రాణాల్తో బ్రతికి వుండునట్లు ప్రాణదానంచేసి, అభయహస్త మొసంగి తనను పంపు' మని రాముడు దశరథుణ్ణి కోరినట్లు ఆయన రచించాడు.

మూలంలో ఈ విషయానికి సంబంధించి పునరుక్తులు వున్నాయి. వరదరాజకవి ఈపునరుక్తుల్ని పరిహరించి ఇక్కడ మూలాన్ని సంక్షేపించాడు. ఇందువల్ల విషయానికి స్పష్టత చేకూరడమేకాక కావ్యస్థాయి పెరిగింది.

3) రాముని పట్టాభిషేకానికి అలంకరింపబడిన రాజమార్గాల్ని గురించిన వర్ణన మూలంలో ఆరు శ్లోకాల్లో వుంది.

" శ్లో|| బృన్దబృన్దై రయోధ్యాయాం రాజ మార్గా స్సమన్తతః

. ..... ... .. ... . ................. .

. .... .... .... ..... . ..... .. ... ......

వ్యూహన్నివ జనౌఘం తం శనై రాజకులం యయౌ" 48

దీనిని వరదరాజు కుదించి పది ద్విపద పంక్తుల్లో తెనిగించాడు.

" వచ్చుచోఁ బురినెల్ల - వారు వీథులను
పచ్చలతోరణ - పంక్తులు గట్టి
చెఱకుఁగోలలు పోఁక - చెట్లును పండ్ల
యరఁటి మ్రాఁకులును ద్వా-రావళింగట్టి
మేరువుల్కుఁరుజులు -మిన్నంటు పువ్వుఁ
దేరులు మేల్కట్టుఁ -దెరలు నమర్చి
కెలకులఁ గలయపె-క్కెంబు లెత్తించి
కలయంపి చల్లి శృం-గారించు జనుల
కోలా హలంబుచే - ఘోషించు జలధి
పోలికె రామవా - భ్యుదయంబు కొఱకు" 19

రామాభిషేకం చూడాలని వచ్చిన జనం అయోధ్యలోని రాజమార్గాల్లో గుంపులు గుంపులుగా చేరి వుండటం వల్ల ఆమార్గాలు ఇరుకైనాయి. ఆజన సమూహం యొక్క ఒరయికవల్ల, వారి సంతోషంవల్ల కలిగిన ధ్వని సముద్రంలోని ధ్వని వలె వుంది. ఆ పట్టణంలోని రాజ మార్గాల్లో అక్కడక్కడ అరటిచెట్లు, పోకచెట్లు అలంకారార్థంగా కట్టబడ్డాయి. ప్రతి గృహంలో ధ్వజాలు ఎత్తబడినాయి. అయోధ్యలోని ప్రజలందరు తమ కార్యకలాపాల్ని వదలి, రామాభిషేకం చూడాలని సూర్యోదయం ఎప్పుడవుతుందా? అని ఎదురు చూశారు. ప్రజలకు అలంకారం కల్గించేది, జనులకు సంతోషం కలిగించేది అయిన అయోధ్యలో జరగబోయే రామాభిషేకం చూడాలని జనులందరు ఇష్టపడ్డారు. వసిష్ఠుడు జనులచే నిండివుండే రాజమార్గాల్ని చూస్తూ, ఆజన సమూహాన్ని అక్కడక్కడ వ్యూహాలుగా పన్నువానివలె మెల్లగా రాజగృహానికి పోయె' నని మూలకర్త తెల్పాడు.

వరదరాజు ఈ విషయాన్ని సంక్షేపించి రచించాడు. 'అయోధ్యాపురంలోని వీథుల్లో పచ్చలతోరణ పంక్తులు కట్టి, చెఱకుగోలలు, పోకచెట్లను, పండ్లుగల అరటి మ్రాకుల్ని ద్వారాలుగా కట్టి, మేరువులుకురుజులు, మిన్నంటే పువ్వుదేరులు, మేల్కట్టు తెరలు అమర్చి, కెలంకుల గలయ కెక్కంబు లెత్తించి, కలయంపి చల్లి శృంగారించే జనుల కోలాహలం ఘోషించే సముద్రం వలె వుంద' ని వరదరాజు వ్రాశాడు.

మూలంలో కనిపించే అయోధ్యానగర జనుల ఆనంద కోలాహలం అనువాదంలో మరుగైంది. మూలంకన్నా అనువాదంలో అయోధ్యానగర అలంకంణ విస్తృతమైంది. ఆకుదింపు, ఈ విస్తరణ అనువాదానికి కొంత లోపమనే చెప్పవచ్చు. నగరాలంకరణ దశరథుని దర్పానికి నిదర్శనం కావచ్చు. రామపట్టాభిషేకానికి కావలసింది అదికాదు రాముడు రాజైతే ప్రజలు పొందే ఆనందాన్ని చెప్పడం ఇక్కడ ముఖ్యం. అది మూలంలో తగిన స్థానంలో ఉండగా ఎందుకో అనువాదంలో కొంత సంక్షిప్తత చోటుచేసికొనింది.

4) అడవుల్లో వుండే నదులు, పర్వతాలు, వృక్షాలు రాముణ్ణి సంతోష పెడ్తూ వుంటాయని మూలకర్త ఆరు శ్లోకాల్లో రచించాడు.

" శ్లో|| ఆపగాః కృతపుణ్యాస్తాః పద్మిన్యశ్చ సరాంసిచ |,

...... .......... ......... ........ ..

........ .... ... .. . . .... . .. .

విదర్శయన్తో వివిధా న్భూయ శ్చిత్రాం శ్చ నిర్ఘరాన్" || [50]

వరదరాజు ఈ విషయాన్ని తగ్గించి ఎనిమిది పంక్తుల్లో వ్రాశాడు.

" శ్రీరాము పదపద్మ - చిహ్నాంకితంబు
లైరాజిలంగ మ-హానదీ వనులు
ఇంత పుణ్యము సేయు-నే యవియెల్ల
సంతతంబతనిఁ బూ-జలు సేయకున్నె
కమనీయ గంధోద-కముల సంపుల్ల
సుమములఁ దమతమ-సౌమ్ములుగాన
వరకందర ఝరీ ని-వాసంబులైన
గిరులమ్మహాత్ముండు - గ్రీడించు కతన"[51]

అరణ్యానికి వెళ్లిన రామునికి నదులు, పర్వతాలు, కొండలు, గుహలు సమస్త ప్రకృతి సంతోషంతో ఆహ్వానాన్ని పలికినాయి. రాముడు స్నానంచేసిన నదులు పవిత్రతను చేకూర్చుకొన్నాయి. అక్కడి పర్వతాలు, ఆపర్వతాల యందలి వృక్షాలు రామునికి సంతోషాన్ని పంచి పెట్టాయి. రాముడు అడుగిడిన ప్రదేశమంతా ప్రకృతి తనకు ప్రియమైన అతిథి వచ్చినట్లుగా రాముణ్ణి ఆరాధించింది. అకాలంలో కూడా రామునకు ఆనందాన్ని కలిగించడానికి నానావిధ పుష్పాలు చిగురించాయి ఆశ్రీరామచంద్రునికి ఆహారంగా అనేక ఫలాలు అకాలంలో పండినాయి. సెలయేళ్ళు స్వచ్ఛమైన జలాన్ని అందించాయి. ఇది రాముడు వనానికి వెళ్లగానే ప్రకృతిలో వచ్చినమార్పుగా వాల్మీకి భావించాడు.

మూలంలో నదులు, సెలయేళ్లు, పర్వతాలు, అడవులు, వృక్షాలు ఈ మొదలగు ప్రకృతి మొత్తం రాముని రాకతో పరవశించినట్లు చెప్పబడింది కానివరదరాజు నదుల పారవశ్యానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చినట్లు కనిపిస్తుంది. మహానదులు శ్రీరాముని పాదపద్మ చిహ్నాంకితాలై విలసిల్లడం వల్ల అవి ఎంతో పుణ్యం చేశాయని విపులీకరించిన వరదరాజు తక్కిన ప్రకృతి యొక్క ఆనందాన్ని సంక్షేపించాడు. నదుల విషయంలో ఒక్క శ్లోకానికి మూడు పంక్తులు వ్రాసిన వరదరాజు తక్కిన ప్రకృతి విషయంలో మూడు శ్లోకాలకు మూడు పంక్తులే వ్రాశాడు. సంక్షిప్తతదృష్ట్యా ఇది మెచ్చుకో దగ్గ విషయమే అయినా వర్ణనా నైపుణ్యం దృష్ట్యా కవిత రమణీయకం దృష్ట్యా మూలమే మెరుగనక తప్పదు.

5) దశరథుడు, రామలక్ష్మణులు, కౌసల్య, సుమిత్రల క్షేమసమాచారాన్ని గురించి భరతుడు అయోధ్యనుంచి వచ్చిన దూతల్ని అడిగినట్లు మూలంలో నాలుగు శ్లోకాల్లో వుంది.

"శ్లో|| కచ్చి త్సుకుశలీ రాజా పితా దశరథో మమ!
కచ్చిచ్చా రోగతా రామే లక్ష్మణే చ మహాత్మని||
ఆర్యా చ ధర్మనిరతా ధర్మజ్ఞా ధర్మదర్శినీ,|
అరోగా చాపి కౌసల్యా మాతా రామస్య ధీమతః||
కచ్చి త్సుమిత్రా ధర్మజ్ఞా జననీ లక్ష్మణస్య యా,|
శత్రుఘ్నస్య చ వీరస్య సా౽రోగా చాపి మధ్యమా||
ఆత్మకామా సదా చణ్ణి క్రోధనా ప్రాజ్ఞ మానినీ,|
అరోగా చాపి మేమాతా కైకేయీకి ముహాచహ"|| [52]

ఈ విషయాన్ని వరదరాజు సంక్షేపించి నాలుగు ద్విపద పంక్తుల్లో రచించాడు.

"మనరాజు రామల-లక్ష్మణులుఁ గౌసల్య
యును సుమిత్రయు లెస్స - యున్నారెపురిని?
చలము రోషమును మ-చ్చరము నోర్వమియుఁ
గలుగు నాతల్లికిం-గైకకు సుఖమె?"[53]

భరతుడు తనవద్దకు వచ్చిన దూతలను ఉద్దేశించి తన వారి క్షేమ సమాచారాల్ని అడిగాడు. ఈ అడుగుట మూలంకన్నా అనువాదంలో కొంత భిన్నంగా కనిపిస్తుంది. మూలంలోను అనువాదంలోను కూడ దశరథ రామలక్ష్మణుల ప్రసక్తి ఒకటిగానే వుంది.

కౌసల్య, సుమిత్ర, కైకేయీల విషయంలో మూలానికి అనువాదానికి వ్యత్యాసం కనిపిస్తుంది. మూలంలో కౌసల్యకు పూజ్యురాలు, ధర్మమునందు ఆసక్తి గలది, ప్రజల్లోని మంచిగుణాన్ని మాత్రమే గ్రహించే గుణవతి - అనే విశేషణాలుకలవు. అట్లే సుమిత్రకు ధర్మజ్ఞురాలు - అనే విశేషణంవేయబడింది. అట్లే కైక స్వప్రయోజన పరురాలు, కోపిష్ఠిది - అనే విశేషణాలు జోడించబడ్డాయి. అనువాదంలో కౌసల్యా సుమిత్రలకు విశేషణాలు లేవు. కాని కైకకు చలము, రోషము, మచ్చరము, ఓర్వలేమి - అని నాలుగు విశేషణాలు వేయబడినాయి.

మూలంలోని భరతుని కంటె అనువాదంలోని భరతునకు కైకపట్ల విముఖత ఎక్కువగా కనిపిస్తుంది. మూలంలో నాలుగు శ్లోకాల్లోని ఈ వివరణ అనువాదంలో నాలుగు పంక్తుల్లో సంక్షేపించబడి వుండటం గమనార్హం.

## 2.2.3 మూలానుసరణలు

1) రాముని గుణగణ వర్ణన మూలంలో -

"శ్లో|| సహి రూపో పపన్నశ్చ వీర్య వానన సూయకః,

................. .................

............ ............ ............

దీనాను కమ్పా ధర్మజ్ఞో నిత్యం ప్రగ్రహవాంశ్శుచి"[54]

అని ఏడుశ్లోకాల్లో వుంది దీన్నియథాతథంగా వరదరాజు ద్విపదీ కరించాడు.

"విలసిల్లె రాముండు - వీర్యానమెత్స
కలసల దశరదు-ఁ గుతిఁ జూడమించి
అతి శాంతి మృదు బాష-ణా వలిఁగలిగి
హితబుద్ధిఁ బరుషోక్తు-లెవ్వ రాడినను
మాఱుపల్కక యంత-మాత్రమో మేలు
చేరి చేసిన వారిఁ- జేపట్టి యపుడు
మఱవక నేరముల్- మఱుచు నెల్ల
పరిజనుల నుఁబ్రోచి - బాణాసనాది
సాధన క్రియలందు - సహవాసులైన
యోధులందగు వేళ-ను పచరింపుచును
మంచి మాటలు బుద్ధి-మగఁటిమి తానె
కాంచితి ననియెంచి - గరువంబులేక
కల్లలాడక వృద్ధ - గణముఁ బూజింప
నెల్లరుం దనయందు - నెల్లర మీఁద
తాను నత్యనురక్తిఁ- దగిలి సమస్త
దీనుల యందు నెం-తే దయఁగలిగి
క్రోధంబు లేక ధ-ర్మ్మండునై పరమ
సాధుల్లె బ్రాహ్మణ - సంతర్పణమున
నియమ వంతుఁడయి - నిత్య శుద్ధుండు
నియతాత్ముఁ డిక్ష్వాకు - నృపనీతిధనుఁడు"[55]

'రాముడు సౌందర్యంగలవాడు, పరాక్రమశాలి. అసూయలేనివాడు గుణాల్లో దశరథుని పోలినవాడు. సమస్త సుగుణాలు కలిగినవాడై, ఇలాంటి కొడుకు ఎవ్వరికి లేడనే ఏధంగా ఉండినాడు.

రాముడు తనతో ఎవరైనా పరుషంగా మాట్లాడినా, తాను కోపంలేనివాడు కావున వారితో శాంతంగానే సంభాషిస్తాడు. రాముడు తనకు ఎవ్వరేని ఒకసారి ఉపకారంచేస్తే ఎప్పుడూ వారి ఉపకారంమరువడు. తనకు ఎవ్వడైనా ఎన్ని అపకారాలు చేసినా మంచి మనస్సు కలవాడు కాబట్టి వాటిని స్మరింపడు.

ఆయన అస్త్రాభ్యాసంచేయు సమయంలో కూడ సజ్జనులైన సదాచార సంపన్నులు, మోక్షంకోరేవారు, ముదుసలులతో సదాచారాల్ని గురించి, వేదాంత రహస్యాల్ని గురించి, సంప్రదాయాల్ని గురించి మాట్లాడుతూ వుంటాడు. రాముడు మంచి బుద్ధిగలిగి మధురంగా మాట్లాడేవాడై, ఎలాంటి నీచునితో అయినా తానే ముందుగా మాట్లాడును. పరులకు ఆశ్చర్యాన్ని కలిగించే పరాక్రమంకలవాడైనా, తన పరాక్రమానికి గర్వించడు.

రాముడు దబ్బరలాడడు. మంచిపండితుడు. వృద్ధులను బ్రాహ్మణులను పూజించువాడు. ప్రజలు ఆతనిమీద ప్రేమకలవారై వుండినారు. అతడుకూడ ప్రజలమీద అనురాగం కలవాడై వుండేవాడు.

రాముడు దయగలవాడు. కోపాన్ని జయించినవాడు. బ్రాహ్మణుల్ని చూసిన మాత్రాన వారిని పూజించేవాడు. దరిద్రుల్ని చూసినప్పుడు వారిని దానమానాదుల్తో ఆదరించేవాడు. ధర్మాల్ని తెలిసినవాడు. ఎప్పుడు చలనంలేని నియమంకలవాడు. పరధనాన్ని కోరనివాడు - అని మూలకర్త వ్రాశాడు.

రాముడు కథానాయకుడు కాబట్టి ఆయన గుణగణాల్ని గురించి మూలంలోని వర్ణనను యథాతథంగా అనువదిస్తేనే కావ్యసౌందర్యం ఒకగూడుతుందని వరదరాజు భావించాడు. రాముని గుణగణాలు జనులకు ఆదర్శ ప్రాయంకావాలనే వుద్దేశ్యంతో కూడ కవి ఇక్కడ మూలాన్ని మార్చకుండా రచించివుంటాడని భావించవచ్చు.

2) రాముడు అడవులకు పోయిన తర్వాత అయోధ్యాపురంలోని స్త్రీలు రోదన చేసిన విషయం మూలంలో

"శ్లో|| అనాథస్య జనస్యాస్య దుర్బలస్య తపస్వినః|,
యోగతి శ్శరణం చాసీత్స నాథః క్వనుగచ్ఛతి||
న క్రుధ్య త్యభిశప్తోఽపి క్రోధనీయాని వర్జయన్|,
క్రుద్ధా న్ప్రసాదయ న్సర్వాన్సమదుఃఖః క్వ గచ్ఛతి||

> కౌసల్యాయాం మహాతేజా యథా మాతరి వర్తతే,|
> తథా యో వర్తతేऽస్మాసు మహాత్మా క్వను గచ్ఛతి||
> కైకేయ్యా క్లిశ్యమానేన రాజ్ఞా సంచోదితో వనమ్,|
> పరిత్రాతా జన స్యాస్య జగతః క్వను గచ్ఛతి."|| 56

అని నాలుగు శ్లోకాల్లో వుంది. పైశ్లోకాల్లోని భావాన్ని వరదరాజు యథాతథంగా అంగీకరించాడు.

> "ఓయమ్మలారా! యిట్టింటి రాఘవుండు
> కాయంబు గంప నెక్కడికిఁ బోయెడును?
> తనకోరు బలిగినఁ దానొక్కరందుఁ
> గినిసినవారి మిక్కిలి పూన్కి చాల
> నుపలాలనము సేయు - నోర్పరి వీత
> కపటుఁడౌ రాముఁడెక్కడికి నేఁగెడును?
> తనలోఁ బ్రభేద హోదంబు లొక్కటిగ
> గనుచుండు రాముఁడెక్కడికి నేఁగెడును?
> కన్నతల్లియె కాఁగఁ గనుచుండు మనలఁ
> గన్నట్టి తండ్రి యెక్కడికి నేఁగెడును?
> కైకేయి బాధపడఁగాక రాజసుప
> కాకుత్స్థతిలకుఁడెక్కడికి నేఁగెడును?
> తనబుద్ధి వలియించి - తండ్రి పొమ్మనిన
> కనలేక రాముఁడెక్కడికి నేఁగెడును? '57

'అనాథలను, అశక్తులను రాముడు రక్షకుడుగా వున్నాడు. తనపై ఇతరులు లేనిదోషం ఆరోపించినా కోపంచెందేవాడుకాడు. కోపంచెందినవారిని సహితం పూరడించేవాడు. ఇతరుల దుఃఖానికి తాను ఆవేదన చెందేవాడు. రాముడు తన తల్లి కౌసల్యను ప్రేమించినట్లె సవతితల్లుల్ని కూడ ప్రేమించేవాడు. అలాంటి రాముడు ఇప్పుడు దశరథుడు, కైక, అడవులకు పొమ్మని ఆజ్ఞాపించగా దానికి లోబడి ఎక్కడికి పోతున్నా'డని అయోధ్యలోని అంతఃపుర స్త్రీలు రోదనం చేశారని మూలకర్త వ్రాశాడు.

వాల్మీకి చెప్పిన ఈ విషయాన్ని వరదరాజు యథాతథంగా అనువదించాడు

రాముడు కన్నతల్లిలాగానే సవతితల్లులందరినే చూసేవాడని మూలకర్త వ్రాయగా, వరదరాజు 'ఆయన మనల్నందరినీ కన్నతల్లినిలాగా చూచేవా'డని

అంతఃపుర స్త్రీలు రోదించినట్లు రచించాడు. దీనినిబట్టి రాముడు అంతఃపుర స్త్రీలందరికీ తన తల్లికి ఇచ్చే గౌరవాన్ని ఇచ్చేవాడని అవగతమవుతుంది. ఇది రాముని గుణగణాలకు సంబంధించిన విషయమైనందువల్ల కావ్యంస్థాయి పెరుగుతుందనే ఉద్దేశంతో వరదరాజు ఇక్కడ మూలాన్ని యథాతథంగా అనువదించి వుండవచ్చు.

### 2.2.4 కల్పనలు

1) కైక దశరథుని, 'తనకిస్తానన్న వరాల్ని ఎందుకివ్వ'వని ప్రశ్నించగా, ఆయన కైకను దూషించిన విషయం మూలంలో

"శ్లో॥ మృతే మయి గతే రామే వనం మనుజపుఙ్గవే,|
హ న్తానార్యే! మమామిత్రే! సకామా సుఖినీ భవ" ॥ [58]

అని వుంది.

'ఆశ్చర్యం! ఇలాంటి క్రౌర్యం నేను ఎక్కడా చూడలేదు! దుష్టురాలా! నాకు శత్రువైనదానా! నేను మరణం పొంది రాముడు వనానికి పోయిన పిమ్మట నీవునీకోర్కెల్ని తీర్చుకొని సుఖంగా వుండు' మని దశరథుడు కైకను దూషించినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు ఇక్కడ మూల భావానికి బదులు స్వతంత్ర కల్పన చేశాడు.

"సుందరి! యొక రాక్ష-సుండు మీ తల్లిఁ
బొందు నప్పుడు నీవు-పుట్టితిగాన
నిజము కైకయ విభు-నికిఁ బుట్టి నీవు
సుజనుఁడాతఁడు నిన్ను-చూడంగ రాదు"[59]

అనువాదంలో వరదరాజు యొక్క స్వతంత్రత స్పష్టమవుతుంది. వరదరాజు దశరథుడు కైకకోర్కెల్నివిని ఆవేదనను పొందాడు. ఆఆవేదనలో ఆరాజు ఒక సామాన్యుడైనాడు. కైకపుట్టుకను గూర్చి నిందించాడు. 'ఒకరాక్షసుడు నీతల్లిని కూడగా నీవు జన్మించి వుంటా'వని అతి సామాన్యునివలె కైకను నిందించాడు. ఇది సహజం. ఎంతో ప్రేమాను రాగాల్తో చూడాల్సిన శ్రీరాముణ్ణి 'అరణ్యానికి వెళ్ళ'మని కైక కోరినప్పుడు, తండ్రిగా దశరథుడు ఇలామాట్లాడడం సహజ సిద్ధం.

మూల దశరథుడు నిర్వీర్యుడై 'నేను మరణించిన పిమ్మట రాముడు వనవాసానికి వెళ్ళాగా, సుఖాలు పొందు'మని కైకను నిందించాడు. ఇందులో దశరథుని అసమర్థత, నిర్వీర్యం వ్యక్తమవుతుంది. తెలుగు దశరథుడు మానవసహజమైన కోపానికిలోనై కైకను తిట్టాడు. అనువాదంలో వరదరాజు యొక్క స్వతంత్రత సువ్యక్తమవుతుంది.

2) అరణ్యంలో క్రూరమృగాలవల్ల, రాక్షసుల వల్ల కలిగే బాధల్ని గురించి మునులు రామలక్ష్మణులకు తెలినట్లు మూలంలో మూడు శ్లోకాల్లో వుంది.

"శ్లో|| రక్షాంసి పురుషాదాని నానా రూపాణి రాఘవ|
వస న్త్యస్మి న్మహారణ్యే వ్యాళాశ్చ రుధిరాశనాః||
ఉచ్ఛిష్టం వా ప్రమత్తం వా తాపసం ధర్మచారిణమ్|,
అద న్త్యస్మి న్మహారణ్యే తాన్ని వారయ రాఘవ||
ఏష పన్థా మహర్షీణాం ఫలాన్యాహరతాం వనే,|
అనేనతు వనం దుర్గం గన్తుం రాఘవ! తేక్షమమ్ "||[60]

'తాము నివసిస్తున్న మహారణ్యంలో నరభక్షకులైన అనేక రకాలైన రాక్షసులున్నారు. రక్తమే ఆహారంగా గల క్రూర మృగాలు అనేకం వున్నాయి. మునులు ఉచ్ఛిష్టులుగా వుండేటప్పుడుగాని లేక వారు ఏమారి వుండేటప్పుడు గాని రాక్షసులు వారిని పట్టి భక్షిస్తారు. మునులు ఫలాల్ని తెచ్చుకోవడానికి అడవిలోకి పోయ్యే మార్గంగుండా మీారు కూడ అరణ్యానికి వెళ్లడంయుక్తమని మునులు రామ లక్ష్మణులకు చెప్పినట్లు మూలకర్త రచించాడు

మూలంలోని పై భావానికి వరదరాజు తన స్వతంత్ర కల్పనను జత చేశాడు.

"అనఘ! మా జపతపో-హాని వారించి
యనయంబు కందమూ-లాదులు దేరఁ
జనువారలకు బాధ-సలుపుచుఁగ్రూర
వనమృగంబులు దై-త్య వర్గంబు నిచట
నిలువ యిచ్చుట మాకు-నెగులెల్లఁదీర్చి
శరముల నహితులఁజక్కాడి మునుల
గరుణించి పుణ్యంబు-గట్టుకో వలయు
యిదియె యాతాయాత-ఋషులాశ్రమముల
బ్రతుకులపై యాసఁబాసి నిత్యమును
నడవులకునుఁబోవు-నట్టి మార్గంబు
చెడకుండ యిందరిఁజేపట్టి మీారు
నీత్రోవ నడవుల-కేఁగనిచ్చోటి
దైతేయబాధలు-దలఁగించి ప్రోచి
యభయ దానమొసంగు .............. "[61]

రాక్షసులు, క్రూరమృగాల అకృత్యాలను గూర్చి మూలకర్త వ్రాయగా, వరదరాజు మరింత ముందుకు పోయి మునులు 'తమబాధల్ని మాన్పు'మని రామలక్ష్మణుల్ని శరణు కోరినట్లు రచించాడు.

'తమశత్రువుల్ని సంహరించి తమను కాపాడి పుణ్యంకట్టుకోవలెన'ని 'దైతేయబాధలు తొలగించి అభయ దానం చేయాల'ని మునులు రామలక్ష్మణుల్ని వేడుకొన్నట్లు వరదరాజు వ్రాశాడు.

వాల్మీకి మునులు చాలా హుందాగా తమబాధల్ని గురించి రామ లక్ష్మణులకు తెలిపారు. వరదరాజు మునులు రామలక్ష్మణుల అభయ దానాన్ని కోరారు.

**2.2.5** పరిహరించుటలు :

1) మంధర చూచిన అయోధ్యానగర అలంకరణను గురించిన వర్ణన మూలంలో -

"శ్లో|| సిక్త రాజపథాం కృత్స్నాం ప్రకీర్ణ కుసుమోత్కరామ్,|
అయోధ్యాం మన్థరా తస్మాత్ప్రాసాదా దన్వవైక్షత||
పతాకాభి ర్వరార్హాభిర్ధ్వజై శ్చ సమలఙ్కృతామ్,|
వృతాం ఛన్నపథై శ్చాపి శిరస్స్నాతజనై ర్వృతామ్||
మాల్యమోదకహస్తైశ్చ ద్విజేంద్రై రభినాదితామ్|,
శుక్ల దేవగృహద్వారాం సర్వవాదిత్ర నిస్వనామ్||
సమ్ప్రహృష్ట జనాకీర్ణాం బ్రహ్మఘోషాభి నాదితామ్|
ప్రహృష్ట వరహ స్త్యశ్వాం సమ్ప్రణర్దిత గోవృషామ్||
ప్రహృష్ట ముదితైః పౌరై రుచ్ఛ్రితధ్వజమాలినీమ్|
అయోధ్యాం మన్థరా దృష్ట్వా పరం విస్మయ మాగతా"||[62]

అని ఐదుశ్లోకాల్లో వుంది

'రాజమార్గాల్లో పూలుచల్లడంవల్ల వాసనలు గుబాళిస్తూవుండే అయోధ్యా పట్టణాన్ని మందర మేడపైనుంచి చూసింది. అప్పుడు అయోధ్యాపురం రాజచిహ్నాలు వ్రాసిన టెక్కములు, సాధారణ ధ్వజాలచేత అలంకరింపబడి వుంది జనులు యథేచ్ఛగా సంచరించడానికి రాజమార్గాలు అడ్డత్రోవల్తో నిర్మింపబడ్డాయి. రామునికి కానుకలు సమర్పించడానికి బ్రాహ్మణులు తలస్నానాలు చేసి పరిశుద్ధులైన జనుల్తో గూడి పుష్పమాలికలు, కుడుములు చేతుల్లో పెట్టుకుని తిరుగుతూవుండినారు వారి సంతోషధ్వనులు ఆపురంలో మారుమ్రోగసాగాయి. ఆపురంలోని దేవాలయద్వారాలకు సున్నంపూయడంవల్ల తెల్లగా ఒప్పుతూవుండినాయి వాయిద్యాలన్నింటినీ

వాయించడం వల్ల వాటిధ్వనుల్తో జనులు మిక్కిలి సంతోషం చెందిరి. అక్కడక్కడ బ్రాహ్మణులుచేసే వేదపారాయణ ధ్వనుల వల్ల (రాముని అభిషేకం గురించి) మృగాలుకూడ సంతోషించాయి. రామాభిషేకోత్సవంతో పౌరజనులు ధ్వజాల్ని ఎత్తికట్టారు. ఈ విధంగా అలరారే అయోధ్యా పట్టణాన్ని మంథర చూసిం'దని మూలకర్త తెలిపాడు.

మూలంలో పై భావాన్ని వరదరాజు పరిహరించి నాలుగు పంక్తుల్లో వ్రాశాడు.

"మందర విని పైఁడి - మచ్చుపైనెక్కి
సుందరాలంకార - శోభితంబయిన
సాకేత నగరంబు - చందంబు చూచి
లోకీఁడుదాబయ - లు పడంగనీక"[63]

'మంథర ఆవాయిద్యాల చప్పుడువిని మచ్చుపైఎక్కి శోభాయమానంగా సుందరంగా అలంకరించబడిన సాకేత నగరాన్ని తనదుష్టబుద్ధి బయట పడనీయకుండా చూసిం'దని వరదరాజు రచించి మూలంలోని అయోధ్యాపుర వర్ణనను పరిహరించాడు.

అయోధ్యాపురంలోని రాజమార్గాల అలంకరణ గురించి ఇదేకాండలో తెలిపినందువల్ల ఈ వర్ణన పునరుక్తి అవుతుందని కవిభావించి పరిహరించి వుండవచ్చు

2) 'సత్యాన్ని' గురించి కొన్ని ఉదాహరణల్తో సహా కైక దశరథునికి తెలపడం మూలంలో నాలుగుశ్లోకాల్లో వుంది.

"శ్లో|| సంశ్రుత్య శైబ్య శ్శ్యేనాయ స్వాం తనుం జగతీపతిః,|
ప్రదాయ పక్షిణే రాజన్! జగామ గతి ముత్తమామ్||
తథా హ్యలర్క స్తేజస్వీ బ్రాహ్మణే వేదపారగే,|
యాచమానే స్వకే నేత్రే ఉద్ధృత్య సుమనా దదౌ||
సరితాం తు పతి స్స్వల్పాం మర్యాదాం సత్యమన్వితః,|
సత్యానురోధా త్సమయే స్వాం వేలాం నాతివర్తతే||
సత్య మేకపదం బ్రహ్మ సత్యే ధర్మః ప్రతిష్ఠితః,|
సత్యమేవాక్షయా వేదా స్సత్యేనైవాప్యతే పరమ్"||[64]

'దశరథ మహారాజా! మునుపు శైబ్యుడనే రాజు ప్రతిజ్ఞచేసి దాని ప్రకారం పక్షిఅయిన డేగకోసం తనదేహాన్ని కోసిఇచ్చి ఉత్తమలోకం పొందాడు.

మహాప్రభావుడైన అల్కారుడు తననేత్రాల్ని వేద పారంగుడైన ఒక బ్రాహ్మణుడు యాచింపగా ఎంతమాత్రం దుఃఖం చెందకుండా తననేత్రాల్ని పెరికి ఆ బ్రాహ్మణునికి ఇచ్చాడు.

నదులన్నింటికి ప్రభువైన సముద్రుడు సత్యాన్ని అనుసరించి తనకు వృద్ధికలుగు కాలంలో కూడ మిక్కిలి చిన్నదైన చెలియలికట్టను దాటకుండా వున్నాడు

సత్యమే పరమ ప్రాప్యము. ఓంకార రూపమైన బ్రహ్మం. సత్యంలోనే ధర్మమంతా ప్రతిష్టింపబడివుంది వేదాలన్నీ సత్యమే ప్రధానమని చెప్పుతూ వున్నాయి. సత్యముంటే పరమపురుషార్థమైన మోక్షం పొందవచ్చు'నని కైక దశరథునితో అన్నట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పై భావాన్ని చాలావరకు పరిహరించి నాలుగు పంక్తుల్లో రచించాడు.

"ఏల తప్పెదు? సత్య-మే ముఖ్యధర్మ
మాలింపవే పెద్ద-లాడు కొనంగ
సత్యంబె బ్రహ్మంబు-సత్యంబె శ్రుతులు
సత్యంబులో నిల్చె-సకల ధర్మములు "[65]

వరదరాజు మొదటి మూడు శ్లోకాల్లోని భావాన్ని పూర్తిగా పరిహరించాడు. నాల్గవ శ్లోకంభావాన్ని నాలుగు పంక్తుల్లో రచించాడు.

'సత్యాన్ని తప్పకూడదు. అదే ముఖ్య ధర్మం. సత్యమే బ్రహ్మం సత్యమే శ్రుతులు. సత్యములోనే సకల ధర్మాలు వున్నాయి' - అని కైక దశరథునికి చెప్పినట్లు వరదరాజు తెల్పాడు.

మూలకర్తకైక దశరథునికి అనేక ఉపాఖ్యానాలు తెలిపి, సత్యం ప్రాముఖ్యాన్ని విశదీకరించింది. కాని ప్రభువైన దశరథునికి ఆ ఉపాఖ్యానాలు తెలియనివి కావు. ఆదృష్టితోనే వరదరాజు వాటిని పరిహరించి వుండవచ్చు. మరియు పాత్రౌచిత్యం దృష్ట్యా ఈ పరిహరణ ఎంతైనా సమంజసం. కైకవంటినీచ పాత్ర దశరథుని వంటి ఉత్తమ పాత్రకు హితోపదేశం చేయడం, చక్కని ఉపాఖ్యానాల్ని చెప్పడం సమంజసంకాదని వరదరాజు భావించివుండవచ్చు. పాఠకునికి హితోపదేశాన్ని చేసే ఈ ఉపాఖ్యానాల్ని పాత్రౌచిత్యం దృష్ట్యానే వరదరాజు వదిలి ఉండునని దృఢంగా నిశ్చయింపవచ్చు

### 2.3.1 మూలవిస్తరణ (అరణ్య కాండము)

1) రాముని బలపరాక్రమాలను గూర్చి అకంపనుడు రావణునికి చెప్పిన విషయం మూలంలో నాలుగుశ్లోకాల్లో వుంది.

"శ్లో॥ అసాధ్యః కుపితో రామో విక్రమేణ మహాయశాః,|
ఆపగాయా స్సుపూర్ణాయా వేగం పరిహరేచ్ఛరైః॥
సతారగ్రహనక్షత్రం నభ శ్చా ప్యవసాదయేత్,|
అసౌ రామస్తు మజ్జన్తీం శ్రీమా నభ్యుద్ధరే న్మహీమ్॥
భిత్త్వా వేలాం సముద్రస్య లో కా నాప్లావయే ద్విభుః,|
వేగం వాపి సముద్రస్య వాయుం వా విధమే చ్ఛరైః.॥
సంహృత్య వా పున ర్లోకా న్విక్రమేణ మహాయశాః.|
శక్తస్స పురుషవ్యాఘ్రః స్రష్టుం పునరపి ప్రజాః.॥"[66]

'మహాయశుడైన రాముణ్ణి జయించడానికి ఎవ్వరికీ అలవికాదు. అతడు కోపిస్తే నిండిన నదీప్రవాహ వేగాన్ని కూడా బాణాల్తో నిలపగలడు. ఆ రాముడు నక్షత్ర గ్రహాల్తో సహా ఆకాశాన్నంతా నశింపచేయగలడు శ్రీమంతుడైన రాముడు మునిగిపోయే భూమిని లేవనెత్త గలడు. రాముడు సముద్రం యొక్క చెలియలి కట్టను భేదించి లోకాలన్నింటిని సముద్రజలాలచే నింపగలడు తన బాణాల్తో సముద్రవేగాన్ని, వాయువేగాన్ని నిలిపివేయ గలడు. ఆయన తన పరాక్రమంతో లోకాలన్నింటిని సంహరించి మళ్లీ సృష్టించగల సమర్థుడు' - అని అకంపనుడు రావణునికి చెప్పినట్లు మూలకర్త తెల్పాడు.

మూలంలోని పై భావాన్ని వరదరాజు పెంచి పదునెనిమిది పంక్తుల్లో ... డు

"రాముని బలపరా-క్రమ శక్తు లింత
సామాన్యమే! నీవు-శపథముల్ వలుక
శరములచే నదీ-సలిలప్రవాహ
ములనైన నొకక్షణం-బున నిల్పఁగలఁడు!
అవని నక్షత్రగ్ర-హావళినైన
దివియైనఁగినిసి భే-దించు నమ్ములను!
పాతాళమునఁగ్రుంగి-పడిపోవునట్టి
భూతలంబైన ని-ల్పును కరాగ్రమున!
జలములు లేకుండ-జలధు లింకించు

జలములు నించుని-ర్జలవారి నిధుల
నిల మిన్ను గావించు-నిలసేయు మిన్ను
నెల నినునిగజేయు-నెల సేయు నినుని
పగలు రేలును రేలుఁ-బగలును జేయు
జగతిపై నతనిక-సాధ్యముల్ గలవే?
తలఁచిన విశ్వమెం-తయు వినిర్మించి
మలఁగించు విశ్వంబు-మాట మాత్రమున
నరికట్టు వాయువు-నల్లాడకుండ
గురివెట్టు జమునిము-క్కున మషీరేఖ."67

'రాముని బలపరాక్రములు సామాన్య మైనవి కావు. తనబాణాల్తో నదీప్రవాహాలనైనా నిలువరింపగలడు నక్షత్రగహావళిని, ఆకాశాన్ని తన అమ్ములతో ఛేదించగలడు. తనకరాగ్రంతో పాతాళంలోకి క్రుంగి పడిపోయే భూతలాన్ని కూడ నిలపగలడు' - అని మూలంలోని మొదటి రెండు శ్లోకాల భావాన్ని మాత్రం వరదరాజు యథాతథంగా అనువదించి ఆపై అనువాదంలో బాగాపెంచి రచించాడు. 'రాముడు సముద్రాల్లో నీళ్లులేకుండా ఇంకించగలడు. భూమిని ఆకాశంగా, ఆకాశాన్ని భూమిగా చేయగలడు. చంద్రుణ్ణి సూర్యునిగా, సూర్యుణ్ణి చంద్రునిగా మార్చి వేయగలడు. పగలురేయిగా, రేయిని పగలుగా చేయగల'డు. అనే వాక్యాలు అమూలకములు. మూలంలోని నాలుగవశ్లోక భావాన్ని ఇలా 'రాముడు తలచుకుంటే విశ్వాన్ని ఒక్క-క్షణంలో అంతరింపచేసి మళ్లీపునర్మించగలడు తన సామర్థ్యంతో గాలిని కదలకుండా చేయగలడు' అని వరదరాజు పెంచాడు.

వాల్మీకి రాముడు శక్తి సంపన్నుడు. బలపరాక్రమాల్లో ఆతనికతడే సాటియని వాల్మీకి వర్ణించాడు. వరదరాజు ఇంకా కొంత ముందుకు వెళ్ళి రాముడు కేవలం పరాక్రమవంతుడేకాక సృష్టికి ప్రతిసృష్టి చేయగల మంత్రద్రష్ట- అని పేర్కొన్నాడు. పగలును రేయిగా, రేయిని పగలుగా, భూమిని ఆకాశంగా, ఆకాశాన్ని భూమిగా, సూర్యుణ్ణి చంద్రునిగా, చంద్రుణ్ణి సూర్యునిగా మార్చడానికి కావల్సింది బల పరాక్రమమే కాక మంత్ర శక్తి అవసరం.

యుద్ధంలో సామాన్యంగా శస్త్రాల్ని ఉపయోగిస్తుంటారు. శస్త్రంశరీర దార్ఢ్యంతో ప్రయోగించేది. అస్త్రం మంత్ర పూర్వకం. వరదరాజు రాముడు శస్త్రాస్త్ర ప్రయోగాల యందు మిక్కిలి నేర్పరి - అని రావణుడికి అకంపనుడు చెప్పినట్లుగా గ్రహించవచ్చు.

ఈ మూల విస్తరణ వరదరాజు శక్తికి, పాత్ర చిత్రణా కౌశల్యానికి, నాయకుని ధీరోదాత్తతకు చక్కని నిదర్శనంగా గ్రహించవచ్చు.

2) 'సీతా! నీవు నాకు భార్యవైతే సమస్త ఆభరణాల్తో అలంకరింపబడిన ఐదువేలమంది దాసీలు నీకెప్పుడూ పరిచర్య చేస్తుంటారు' - అని రావణుడు సీతతో చెప్పిన విషయం మూలంలో ఇలావుంది.

"శ్లో|| పఞ్చ దాస్య స్సహస్రాణి సర్వాభరణ భూషితాః|
సీతే! పరిచరిష్యన్తి భార్యా భవసి మేయది"||[68]

దీన్ని వరదరాజు పెంచి పదునాలుగు ద్విపదపంక్తుల్లో రచించాడు

"నాయింట దాసీజ-నము లైదువేలు
పాయక మణిమయా-భరణముల్దాల్చి
యచ్చర సతులుగా-నతివ నీసేవ
కిచ్చెద నెమ్మన-మిమ్ము నాకిపుడు
సిరిదోంటలోంగల్ప-వృక్ష పంచకము
తరుణి! నీముడిపుష్ప-దండల కిత్తు!
అమరభూధర రోహ-ణాచల మణులు
రమణి! నీ కిత్తు యా-రతులకే నిత్తు
ఆమీంద కామధే-న్వాది ధేనువులు
భామిని! నీయింటి - పాండికేనిత్తు!
కల్యాణి! నాదు లం-కా రాజ్య మెల్ల
మూల్యంబు వీడియం-బునకు నేనిత్తుం
దరుణులలో నీవె-తరుణివి జగతిం
బురుషులలో నేనె - పురుషుండ నిజము"[69]

'నీ మనస్సు నాకిస్తే నాఇంట్లోవున్న మణిమయాభరణ భూషితలైన ఐదువేల మంది అచ్చరలను నీ సేవకు వినియోగిస్తాను. సిరిదోటలోని కల్పవృక్ష పంచకాన్ని నీ పుష్పదండలకు ఇస్తాను. మేరు పర్వత, రోహణ పర్వతాల్లోని మణులు నీకు ఇస్తాను. నీ యింటి పాడికి కామధేన్వాది ధేనువుల్ని ఇస్తాను. తాంబూలానికిగాను నాలంకారాజ్యాన్ని ఇస్తాను. జగతిలో వున్న తరుణుల్లో నీవే తరుణివి. పురుషుల్లో నేనే పురుషుణ్ణి' - అని రావణుడు సీతతో అన్నట్లు వరదరాజు రచించాడు.

వాల్మీకి రావణుడు సీతను తనకు భార్యగా కోరుకున్నాడు. హుందాగా వరదరాజు రావణుడు ఆమెకు ఎన్నో ఆశలు చూపి తనదానిగా చేసుకోవాలని ప్రయత్నించాడు.

ఇచ్చట వరదరాజు మితభాషిగా కనిపిస్తాడు. వరదరాజు సామాన్య మానవునివలె మరియు అతడు సీతను ఒక సామాన్య స్త్రీగా చూచినట్లు తెలుస్తుంది దాసీజనాన్ని గూర్చి చెప్పుతూ వాల్మీకి, వారు మణిమయ ఆభరణాలు ధరించి వుంటారన్నాడు. ఆ ఒక్క చిన్నమాటే రావణుని ఐశ్వర్యాన్ని తెలుపగలదు. వరదరాజు పెంపులో అతిశయోక్తులు కన్పిస్తాయి.

3) కుపితుడై రావణుడు తన శౌర్యపరాక్రమాల్ని గూర్చి సీతకు తెల్పిన విషయం మూలంలో మూడుశ్లోకాల్లో వుంది.

"శ్లో|| మమ సంజాతరోషస్య ముఖం దృష్ట్వైవ మైథిలి!
విద్రవన్తి పరిత్రస్తా స్సురా శ్శక్రపురోగమాః||
యత్ర తిష్ఠాయహం తత్ర మారుతో వాతి శఙ్కితః,|
తీవ్రాంశు శ్శిశిరాంశు శ్భయా త్సంపద్యతే రవిః||
నిష్కమ్ప పత్రాస్తరవో నద్యశ్చ స్తిమితోదకాః,|
భవన్తి యత్ర యత్రాహం తిష్ఠామి విచరామి చ||"[70]

'నేను ఇంద్రాది దేవతలను కోపంగా చూస్తే భయంతో పరుగెత్తుతారు. నేను ఎక్కడవుంటే అక్కడ వాయువు భయంతో అనుకూలుడై వీస్తాడు. వేడి కిరణాలు గల సూర్యుడు భయంతో చల్లనికిరణాల్ని ప్రసరిస్తాడు. నా ఉనికిని తెలిసికొన్న వృక్షాల పత్రాలు నామాట మీరి చలింపవు. నన్నుకాదని నదులు ప్రవహింపవు' అని రావణుడు సీతను బెదరించినట్లు మూలకర్త వ్రాశాడు.

దీన్ని వరదరాజు పెంచి పందొమ్మిది ద్విపద పంక్తుల్లో వ్రాశాడు.

"ఇందీవరేక్షణ! - యింద్రాది సురలు
నాపేరు వినిననె - న్నఁడుఁదమ యిండ్లఁ
గాఁపురంబులు చేసి - కనుగూర్క రెపుడు!
చల్లగా నారతి - శ్రమ మార్పగాని
వెల్లావిరిగ గాలి - విసరఁగ వెఱచు
మదినాకు హితమైన - మార్గంబెకాని
గదిమి భాస్కరుఁడెండఁ-గాయంగ వెఱచుఁ

గలగంగ స్వాదూద-కములచేఁగాని
బలువిడి వాహినుల్-ప్రవహింప వెఱుు
నేనాజ్ఞ సేయక - యెవ్వారికైనఁ
బూని యయ్యముడు చం-పుక బోవ వెఱుు
నెచ్చోట నాయిచ్ఛ-నేకాని తాను
విచ్చలవిడి నగ్ని-వెలుఁగఁగ వెఱుుఁ
బూయని తరువులఁ - బువ్వుల నిత్తు
కాయని వృక్షముల్- కాయఁజేయుదును
కురియింతు వానలు - కోరినయపుడు
భరియింతు సకలభూ-భారంబు నేను!
నావీడు జలధికి-నడుచక్కి లంక
రావణుఁడందురు - రామ! నాపేరు"[71]

వరదరాజు రావణుడు మూలరావణుడి కన్నా ఎక్కువగా వాచాలతను చూపాడు.

'ఇందీవరేక్షణా! ఇంద్రాది సురలు నాపేరు వింటే తమ ఇండ్లలో కాపురాలు చేయరు. గాలి వీయడానికి భయపడుతుంది. నాకు ఇష్టమైన రీతిలో కాకుండా వేరేవిధంగా ఎండకాయడానికి సూర్యుడు భయపడతాడు. నదులు ప్రవహించడానికి వెరుస్తాయి. నా ఆజ్ఞలేందే ఎవ్వరినైనా చంపడానికి యముడు భయపడ్తాడు. ఎక్కడైనాసరే నాయిష్ట ప్రకారమేకాని తన యిష్ట ప్రకారం అగ్నివెలగడానికి వెరుస్తుంది. పూయని చెట్లను పూయించగలను. కాయనిచెట్లను కాయించగలను. కోరినప్పుడు వర్షాలు కురిపించగలను. సకల భూభారాన్ని నేను భరిస్తాను' అని రావణుడు సీతతో అన్నట్లు వరదరాజు రచించాడు.

ఈ సన్నివేశంలో మూలానికి వరదరాజు కావించిన పెంపు రావణునిపాత్ర యొక్క ప్రత్యేకతను పెంచడానికి దోహదంచేస్తున్నది. ఈరీతిగా పాత్రల స్వభావాన్ని వ్యక్తం చేయడంలో వరదరాజు మంచి నేర్పరి. పై విధంగా ఆభిజాత్యంతో పలికిన పలుకుల ద్వారా ఈ రాజకవి రావణుని యొక్క అహంకారాన్ని పాఠకులకు సుస్పష్టం చేశాడు.

**2.3.2** మూలసంక్షేపాలు

1) అరణ్యవాసంలో రాముడు, ఖరుడుపంపిన పద్నాలుగు వేలమంది రాక్షసుల్ని హతమార్చాడు. ఈ విషయం శూర్పణఖ ఖరునకు తెలిపింది. అంత

కుపితుడైన ఖరుడు శూర్పణఖను ఓదారుస్తూ తన రాక్షసుల్ని గూర్చి తెలిపిన విషయం మూలంలో వాల్మీకి నాలుగు శ్లోకాల్లో వివరించాడు.

"శ్లో|| మయా త్విదానీం శూరాస్తే రాక్షసా రుధిరాశనాః,|
త్వత్ప్రియార్థం వినిర్దిష్టాః కిమర్థం రుద్యతే పునః||
కి మేత చ్ఛ్రోతు మిచ్ఛామి కారణం యత్కృతే పునః,|
హా నాథేతి వినర్దన్తీ సర్పవల్లురసి క్షితౌ.||
అనాథవ ద్విలపసి నాథే తు మయి సంస్థితే,|
ఉత్తి ష్ఠోత్తిష్ఠ మాభైషీ ర్వైక్లబ్యం త్యజ్యతా మిహ.||"[72]

'నేను ఇప్పుడే నీకోసం శూరులు, రుధిరాహారులు అయిన రాక్షసుల్ని పంపాను. నీ వెందుకు రోదనం చేస్తావు? ఆరాక్షసులు ఎల్లప్పుడు నాకుభక్తులై నామీద అనురాగంకలిగి నాకుమేలు చేస్తుంటారు. వారు ఎలాంటి శత్రువులనైనా ఎదిరించగలరు వారిని ఎవ్వరూజయించలేరు. వారు నా ఆజ్ఞమీరరు నీవు ఇప్పుడు వచ్చి దిక్కులేని దానివలె రోదనంచేస్తూ సర్పంవలె ఎందుకు నేలపై పొరలు తున్నావు? నీకు రక్షకుడుగా నేనుండగా నీవు అనాథవలె ఎందుకు రోదనం చేస్తావు? పైకిలెమ్ము. భయపడవద్దు. దుఃఖంవిడువు' మని ఖరుడు శూర్పణఖతో చెప్పినట్లు మూలకర్త వ్రాశాడు

వరదరాజకవి పై భావాన్ని కుదించి ఆరుద్విపద పంక్తుల్లో రచించాడు

"నామాట వినక యో - యక్క! యేమిటికి
భూమిపై మాటికిఁ-బొరలి యేడ్చెదవు?
నీ నిమిత్తంబుగా - నేవేనవేలు
దానవులనుఁ బంపఁ-దాళు కోరాదె?
వారిదే గెలుపుతో - వత్తురు చింత
వారింపు మనుడు భా - వమున నెగ్గించి"[73]

ఈ విషయాన్ని విస్తారంగా రచించడం ఉచితం కాదని వరదరాజు భావించి మూలాన్నికుదించి రచించాడు.

'నాఅక్క అయిన శూర్పణఖా! నామాట వినకుండా మాటి మాటికి భూమిపై పొరలి ఎందుకు ఏడుస్తావు? నీ కోసమే వేలాదిమంది రాక్షసుల్ని పంపాను నీవు ఓర్పు వహించలేవా? వారు విజయంతో వస్తారు నీ వు చింత చాలించు'మని ఖరుడు శూర్పణఖతో అన్నట్లు వరదరాజు వ్రాశాడు.

మూలంలోని ఖరుడు 'నేనువుండగా నీవు అనాథవలె ఎందుకురోదనం చేస్తావు? దుఃఖాన్ని విడువు'- అని శూర్పణఖను సముదాయించాడు. వరదరాజు ఖరుడు 'వేనవేలు రాక్షసుల్ని పంపాను చింత చాలించ'మని శూర్పణఖను ఆదేశించినట్లు రచించాడు

2) మారీచుడు మాయామృగవేషంలో చాలామంది మునుల్ని చంపినందువల్ల అతణ్ణి వధించాలని రాముడు లక్ష్మణునితో చెపుతూ తెలిపిన విషయం మూలంలో ఐదు శ్లోకాల్లోవుంది.

"శ్లో|| పురుస్తాదిహ వాతాపిః పరిభూయ తపస్వినః,|
ఉదరస్థో ద్విజా న్హన్తి స్వగర్భో ఽశ్వతరీ మివ.||
సకదాచి చ్చిరా ల్లోభా దాససాద మహామునిమ్,|
అగస్త్యం తేజసా యుక్తం భక్ష స్తస్య బభూవ హ.||
సముత్థానే చ తద్రూపం కర్తుకామం సమీక్ష్యతమ్|
ఉత్స్మయిత్వా తు భగవా న్వాతాపి మిద మబ్రవీత్||
త్వయా విగణ్య వాతపే! పరిభూతా స్స్వతేజసా,|
జీవలోకే ద్విజశ్రేష్ఠ స్తస్మాదపి జరాం గతః||
తదేవం న భవే ద్రక్షో వాతాపి రివ లక్ష్మణ,!
మద్విధం యోఽతిమన్యేత ధర్మనిత్యం జితేన్ద్రియమ్.||"[74]

మునుపు ఈ దండకారణ్యంలో వాతాపి అనే రాక్షసుడు ఋషుల్ని మోసం చేసేవాడు. అతడు మేక రూపం ఎత్తి మునులకు ఆహారమై వారి కడుపుల్లోకి ప్రవేశించేవాడు. అశ్వతరి ఈనేటప్పుడు దూడ గర్భాన్ని చీల్చుకొనివచ్చి తల్లిని చంపేవిధంగా, అతడు ఋషుల కడుపుల్ని చించుకొనివచ్చి వారిని వధించేవాడు.

ఆవాతాపి ఒకప్పుడు ప్రభావ సంపన్నుడైన అగస్త్య మహామునికి ఆహారమై ఆయన ఉదరంలో ప్రవేశించాడు. అగస్త్యుడు వాతాపినిజస్వరూపం తెలిసికుని 'నీవు నాఉదరంలో జీర్ణమైపోతా'వని తెలిపాడు లక్ష్మణుడా! ధర్మంలో చలనం లేనివాడును, జితేంద్రియుడును అయిన నాలాంటివాణ్ణి అతిక్రమిస్తే ఆమారీచుడు వాతాపివలె మృతిచెందుతాడు' అని రాముడు లక్ష్మణునికి తెలిపినట్లు మూలకర్త వ్రాశాడు.

దీన్ని వరదరాజు తగ్గించి తొమ్మిది ద్విపద పంక్తుల్లో ఇలా వ్రాశాడు.

"వాతాపి ఋషులకు - వంటయై వారి
నేతరి తాఁ బొలి-యించి మించుటయుఁ
దాను గర్భంబు వి-దారించినట్లు

మును హింస నొనరింప-మొనసి యగస్త్య
మునివానిఁదన తేజ-మునఁజంపినట్లు
మనము లీఁజెనఁటిని - మారీచు నీచుఁ
దునుముదు సీతనా - తోనేమి వల్కు
నట్టి గార్యము సేయు-నదియ నాపూన్కి"[75]

'వాతాపి ఋషులకు ఆహారమై వారిని మోసంచేసే వాడని, అశ్వతరి (ఆడుకంచర గాడిద) ఈనేటప్పుడు, దూడ గర్భాన్ని చీల్చుకొని వచ్చి, తల్లిని చంపేవిధంగా వాతాపి మునుపు హింస చేసేవాడు' అని కవి వ్రాశాడు.

'వాతాపిలాగ నీచుడైన ఈమారీచుణ్ణి సంహరిస్తాను. సీతచేయుమన్న పని చేయడం నాకర్తవ్య'మని రాముడు లక్ష్మణునితో అన్నట్లు వరదరాజు తెలిపాడు.

వాతాపిని అగస్త్యుడు సంహరించడంగురించి మూలంలో విపులంగా వుండగా, వరదరాజు హింసను చేసే వాతాపిని అగస్త్యుడు సంహరించాడని మాత్రమే వ్రాశాడు. మూలంలో కొంతపునరుక్తి వుందని భావించి వరదరాజు ఇక్కడ మూలాన్ని సంక్షేపించాడు ఇలాంటి మూలసంక్షేపాలు కావ్య విస్తృతిని పరిమితం చేయడానికి తోడ్పడతాయి అంతేగాక వాల్మీకి రాముడు మాటల్లో కొంతతన్ను తాను పొగడు కొన్నట్లు ఆయన పల్కుల్లో తెలుస్తున్నది. ఉత్తమ నాయకుని లక్షణానికి భిన్నమైన ఈ విషయాన్ని పరిహరించి, నాయకుని పాత్ర పోషణలో వరదరాజు కొంత మెలకవను చూపాడు.

## 2.3 3 మూలానుసరణలు

1) విరాధుడు తపస్సుచేసి వరాన్ని పొందియుండుటచే సంహరించడానికి వీలులేదు కాబట్టి అతణ్ణి నేలలో పాతిపెట్టమని రాముడు లక్ష్మణునితో చెప్పాడు. రాముడి మాటలు విన్న విరాధుడు అతనితో చెప్పిన వృత్తాంతం మూలంలో ఆరుశ్లోకాల్లో వుంది.

"శ్లో|| హతో9స్మి పురుషవ్యాఘ్ర! శక్రతుల్య బలేన వై|

..... ......... .. ..... ........... ...

..... ...............................

భువనం స్వం గమిష్యామి స్వస్తి వో9స్తు పరన్తప!"[76]

'నాయనా! నీవు సాక్షాన్నారాయణుడవు. కౌసల్యా పుత్రుడవని నాకు ఇప్పుడు తెలిసింది. మహాభాగయైన సీతాదేవిని, మహాకీర్తిశాలియైన లక్ష్మణుణ్ణి చూశాను. నేను

తుంబురుడనే గంధర్వుణ్ణి. నేను మునుపు రంభాసక్తుడనై కొలువుకు పోనందువల్ల కుబేరుడు కోపించి నాకుశాపం పెట్టాడు. కుబేరుని శాపంతో భయంకరమైన రాక్షసదేహాన్నిపొందాను. శాపవిముక్తుణ్ణి చేయమని నేనుకుబేరుణ్ణి వేడుకోగా, దశరథ పుత్రుడైన రాముడు నిన్ను యుద్ధంలో సంహరించినప్పుడు నీవు శాపవిముక్తుడవవుతావని తెలిపాడు. శత్రువుల్ని తపింపజేయగల రామా! నీ అనుగ్రహం వల్లనాకు ఈ భయంకర రూపం పోయింది. ఇకనాస్థానానికి వెళ్తాను. మీకు మంగళమగుగాక' అని విరాధుడు రామునితో అన్నట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పైభావాన్ని యథాతథంగా అనువదించాడు.

"స్వామి! నీచరణముల్ - శరణంబు నాకు
ఈమానినియె సీత - యీవు రాముఁడవు
ఇతఁడు లక్ష్మణుఁడని - యెఱిఁగితి నిపుడు
మతిమిమ్ముఁ గనలేక-మార్కొంటి నేను
బాధింపకుము దీన - బాంధవ! సకల
సాధు రక్షణ విచ - క్షణుఁడవు నీవు
వినుము నా తెఱఁగు నే-విబుధేంద్రు చెంతఁ
జనుమానమున నుండు - సంగీత నిధిని
తుంబురుండనుచు నం-దురు పేరు, రాజ
సంబున గంధర్వ-జాతి నుత్తముఁడఁ
గామాంధకారంబు - కనులఁదొట్టి
కామించి రంభతోఁ-గలసి క్రీడింపఁ
దన కొల్వునకు నీ-తఁడు వేళఁగాచి
కనుఁగల్గి యుండఁడు-గర్వించి యనుచు
దనుజుఁడవై నీవు - ధరణిపైఁబుట్టు
మనుచుఁ గుబేరుఁడ-త్యాగ్రహ వృత్తి
శపియింప వెఱచి యం-జలిచేసి చాల
కృపణత్వమున నుండఁ-గృప యుంచి యతఁడు
పోరాకయును నాకు-మీతోడి రణము
కారణంబున ముక్తి-గలుగు చందంబు
వివరింపఁగిన్నర-విభుని శాపమున
నవనిపై నిట్టి ఘో-రాకృతిఁబుట్టి

సరిసూచితిని నాఁటి-శాపంబునకును
దరియౌట యభయపు-దానంబుఁజేసి
రక్షింపుఁడిక సంగ-రంబునం బడిన
రాక్షసులను మహిఁ-ద్రవ్వి పూడ్చుట యె
ధర్మంబుగా నటు-దలఁచిన యట్టి
కర్మంబు సేయుఁడేఁ-గనియెద ముక్తి"[77]

మూలంలోని విరాధుడు కుబేరుని వల్ల శాపం పొందిన తెరగును, రాముని ద్వారా శాపవిముక్తుడయ్యే విధానాన్ని తెలిపాడు. వరదరాజు విరాధుడు, 'మీరు రామలక్ష్మణులని తెలియక మీతో యుద్ధం చేశాను నీవు సకల సాదురక్షణ విచక్షణుడవు కాబట్టి నన్ను బాధించవద్దు. అభయ ప్రదానంచేసి రక్షింపు'మని ప్రాధేయపడ్డాడు. అలాగే తాను గంధర్వ జాతిలో ఉత్తముణ్ణి అని కూడ వరదరాజు విరాధుడు మరోవైపు తనను గూర్చి చెప్పుకొన్నాడు.

2) శరభంగమహాముని బ్రహ్మలోకానికి తీసికొని పోవడానికి దేవేంద్రుడు ఆయన వద్దకు వచ్చాడు. ఆసమయంలో అక్కడేవున్న రాముడు దేవేంద్రుడు వచ్చిన సంగతిని గూర్చి శరభంగ మహామునిని అడిగాడు. అప్పుడు శరభంగుడు ఆసంగతిని రామునికి తెలపడం మూలంలో రెండు శ్లోకాల్లో వుంది.

"శ్లో|| శరభంగ శ్చ తత్సర్వం రాఘవాయ న్యవేదయత్,|
మా మేష వరదో రామ! బ్రహ్మలోకం నినీషతి||
జిత ముగ్రేణ తపసా దుష్ప్రాప మకృతాత్మభిః,|
అహం జ్ఞాత్వా నరవ్యాఘ్ర! వర్తమాన మదూరతః||[78]

'రాముడా! నేను చేసిన ఉగ్రతపస్సు ఫలితంగా ఆత్మవేత్తలు కాని వారు పొందడానికి అలవికానిది అయిన బ్రహ్మలోకానికి నన్ను తీసికొని పోవడానికి వరాలుఇచ్చే దేవేంద్రుడు వచ్చాడు. నీవు ఇక్కడ దగ్గరనేవున్నావనితెలిసి ప్రియాతిథివైన నిన్నుచూడకుండా బ్రహ్మలోకానికి పోకూడదని ఆగి పోయాను'- అని శరభంగమహాముని రామునికి తెలిపినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పై భావాన్ని యథాతథంగా తెనిగించాడు.

"శ్రీరామ! యెవ్వరి-చేత సాధింపఁ
గారాని సత్యలో-కము నాతపమున
సాధించుటనుఁ జేసి-జలజ సంభవుఁడు

బోధింప నింద్రుఁడి-ప్పుడు వచ్చి నన్నుఁ
బిలిచిన తోడనేఁ-బ్రియహితాలాప
ములు వల్కి నినుఁజూచి-ముచ్చట దీరి
మఱిపోవువాఁడనై-మదినీదు రాక
యరసి జంభారిఁబో-మ్మని పనిచితిని
యిదినిమిత్తంబుగా - నింద్రుఁడు వచ్చె
నదినీకుఁదెల్పితి-నవనిజా రమణ!"[79]

'ఆత్మవేత్తలు కానివారు సాధించలేని బ్రహ్మలోకాన్ని సాధించాన'ని మూలంలోని శరభంగుడు తెలుపగా, 'ఎవ్వరూ సాధించలేని సత్యలోకాన్ని సాధించాన'ని వరదరాజు శరభంగుడు చెప్పాడు. మూలంలోని ఇంద్రుడు తనంతటతానే శరభంగుణ్ణి బ్రహ్మలోకానికి తీసికొని పోవడానికి రాగా, వరదరాజు ఇంద్రుడు జలజసంభవుడు పంపగా వచ్చాడు. శరభంగుణ్ణి బ్రహ్మలోకానికి తీసికొని పోవడానికి బ్రహ్మఅనుమతి కావాలని వరదరాజు ఊహించాడు.

**2.3 4** కల్పనలు

1) దండకారణ్యంలో ఉండే ఋషుల్ని రక్షించే నిమిత్తం రాక్షసులనందర్నీ యుద్ధంలో వధిస్తానని రాముడు ప్రతిజ్ఞచేశాడు రాక్షసుల్ని సంహరించడం యుక్తంకాదని సీతాదేవి రామునికి హితవు చెపుతూ క్రింది విషయాన్ని తెలిపినట్లు వాల్మీకి రచించాడు.

"శ్లో|| తవ వశ్యేన్ద్రియత్వం చ జానామి శుభదర్శన,|
తృతీయం యదిదం రౌద్రం పరప్రాణాభిహింసనమ్."||[80]

'అజ్ఞానులు వైరంలేకుండానే రౌద్రవ్యసనంతో ప్రాణిహింస చేస్తారు అదినీకిప్పుడు తటస్థించిం'దని సీతరామునితో అన్నట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పైభావం స్థానంలో స్వతంత్ర కల్పన చేశాడు.

"పుడమి యొక్కరికిచ్చి - పొమ్మన్న నరికె
యడవులఁబట్టి యి-ట్టున దలమగుచు
నుండు వారము మన-మొక్కరి కొఱకు
దండకాటవిలోన - దైత్యుల తోడఁ
బోరాడనేఁటికి? - భుజముల ఎండ్లు

మీరలెక్కడఁ జూచి - మేనిలో నాకుఁ
ప్రాణముల్ నిలువకఁ-బల్లటిల్లెడును"[81]

- అని తెనిగించాడు.

'వైరంలేకుండానే అజ్ఞానివలె ప్రాణిహింసకు పాల్పడుతున్నా'వని మూలంలోని సీత రాముణ్ణి నిందించింది. శ్రీరామాయణంలోని సీత ఒకసామాన్య మహిళలాగా, 'రాజ్యం ఒక్కరికి ఇచ్చి దండకారణ్యాల్లో అనాథల్లా తిరుగుతున్నాం. మనం ఒక్కరి కోసం రాక్షసుల్తో యుద్ధం చేయడమెందుకు'? అని బాధపడుతూ రామునకు హితవు చెప్పింది. అలాగే 'మీరు విల్లుఎక్కుపెట్టడం చూచి నా ప్రాణాలు తల్లడిల్లి పోతున్నాయి' - అని ఆమె స్త్రీ సహజమైన కాతరత్వంతో పలికింది.

2) మారీచుడు మాయలేడి రూపంతో రాముణ్ణి అరణ్యంలో బహుదూరం తీసికొని పోయాడు. రాముడు దానిని రాక్షసమాయగా భావించి ఆలేడిని బాణంతో కొట్టాడు. రామబాణం దెబ్బతిన్న (మాయ లేడిరూపంలో ఉన్న) మారీచుడు 'అయ్యోలక్ష్మణా!' అని కేక వేసి మృతి చెందాడు. సీతదానిని రామునికేకగా భావించి, లక్ష్మణుణ్ణి రాముని వద్దకు పంపుతుంది తనవద్దకు వచ్చిన లక్ష్మణుణ్ణి చూచిన రాముడు 'సీతెమయ్యిందో'నని ఆందోళన చెందడాన్ని మూలకర్త ఈ విధంగా వ్రాశాడు.

"శ్లో|| సర్వథా రక్షసా తేన జిహ్మేన సుదురాత్మనా,|
వదతా లక్ష్మణేత్యుచ్చై స్తవాపి జనితం భయమ్ ||
శ్రుతస్తు శఙ్కే వైదేహ్యా స స్వర స్సదృశో మమ,|
త్రస్తయా ప్రేషితస్త్వం చ ద్రష్టుం మాం శీఘ్ర మాగతః||
సర్వథా తు కృతం కష్టం సీతా ముత్సృజతా వనే,|
ప్రతికర్తుం నృశంసానం రక్షసాం దత్త మన్తరమ్"||[82]

'కపటి, దురాత్ముడు అయిన రాక్షసుడు 'లక్ష్మణుడా'! అని గట్టిగా నాకంఠధ్వనివలె అరవడం వల్ల సీత, నీవు భయపడినారు సీతనిన్ను పంపగా నీవు శీఘ్రంగా నావద్దకు వచ్చావు. అడవిలో సీతను ఒంటరిగా వదలి రావడంవల్లనీవు చాలా పొరపాటు చేశావు. క్రూరులైన రాక్షసులకు మనపై కక్ష తీర్చుకోడానికి ఇంతవరకు లేని అవకాశాన్ని ఇప్పుడు నీవు కల్పించావు' - అని రాముడు లక్ష్మణునితో అన్నట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పై భావానికి స్వతంత్ర కల్పన చేశాడు

" మత్తుఁడవై నీవు - మదిఁగ్రొవ్వి యొంటి
నుత్తమగుణవతి - నుర్వీజనుంచి
వచ్చిన వాఁడవు - వా కొనరాదె
చచ్చెనో బ్రదికెనో - జానకివార్త!
సుకుమారగాత్రి మం-జుల వాణిసీత
నొకనిచేఁదగిలి కు-య్యో యంచుఁబోవ
ఈమేనితో నుండి - యిట్టి నీకతన
యేమేమి దుఃఖంబు - లేనందఁగలనొ!
ఆదురాత్ముని మాట - యాలించి సెవికి
వేదు ఋట్టఁగనిట్టు - వెడలి వచ్చితివి
వత్తురే యెటులైన - వనితను డించి
కత్తుల బోనైన - గహనంబులోన
అక్కటా! పరులకు - నవకాశమిచ్చి
యొక్కింతయైనమో - మోటవో విడిచి
నామాటయును మీఱి-నా వట్టి నిన్ను
యేమని యందు నిం-కేమి సేయుదును?"[83]

వాల్మీకి రాముడు లక్ష్మణుణ్ణి 'అడవిలో సీతను ఒంటరిగా విడిచివచ్చి నీవు చాలా పొరపాటు చేశావని, క్రూరులైన రాక్షసులు మనపై కక్షసాధించడానికి అవకాశం కల్పించా'వని మందలించాడు.

వరద రాజు రాముడు లక్ష్మణుణ్ణి, 'మత్తుడవై మదిక్రొవ్వి సీతను ఒక్కదానినే అరణ్యంలో వదలివచ్చా'వని దూషించాడు. 'ఆమె చచ్చిందో బ్రతికిందో తెలియదు సీతను రాక్షసుడెవ్వడైనా తీసికొని పోయివుంటే నేను శరీరంతో వుండి నీవల్ల ఎన్ని కష్టాలు పడవలెనో' అని వరదరాజు రాముడు అతిసామాన్యునివలె లక్ష్మణునితో బాధపడ్డాడు 'నామాట మీరి వచ్చిన నిన్ను ఏమనగలను? ఇంకేమి చేయగలను?' అని రాముడు నిట్టూర్చినట్లు కవి తెనిగించాడు. ఇది రాముని ఉదాత్తతకు కొంత లోపమని చెప్పవచ్చు

### 2.4.1 మూల విస్తరణ (కిష్కింధా కాండము)

1) శ్రీరాముడు, తనబాణానికి క్రిందపడి మరణావస్థలోనున్న వాలితో 'వానరనాథుడవైన ఓవాలీ! మునుపు నీవు, నీకుమారుడు అంగదుని మీద ఎలాంటి పుత్ర వాత్సల్యాన్ని ప్రదర్శిస్తూ వుంటివో అదేవిధంగా నేను,

సుగ్రీవుడు, అతణ్ణి ప్రేమిస్తా'మని శ్రీరాముడన్నాడు. దానికి వాలి రామునితో బదులు పలికిన విషయం మూలంలో ఒకశ్లోకంలో వుంది.

"శ్లో|| శరాభితప్తేన విచేతసా మయా
ప్రదూషిత స్త్వం యదజానతా ప్రభో!
ఇదం మహేన్ద్రో పమ భీమవిక్రమ!|
ప్రసాదిత స్త్వం క్షమ మే నరేశ్వర! ||"[84]

'మనుష్యనాథుడవైన రాముడా! నీవు దేవేంద్ర సమానుడవు. మహాపరాక్రమ శాలివి నేనునీ బాణంతో పీడింపబడి, తెలియక నిన్ను నిందించాను అందులకు నేను చింతిస్తున్నాను. నన్ను మన్నించ'మని వాలి రామునితో చెప్పినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పైభావాన్ని పెంచిరచించాడు

"జానకీ రమణ! ని-శాతసాయకము
చేనేసితివి రొమ్ము-చినిఁగి కూలంగ
నానొవ్వి యదియంత-యనరానిమాట
లేనిన్నుఁ బలికి నా-హృదయంబులోన
మిగులఁ దపించెద-మీ రవి మణివి
పగమాని నన్నుఁజే-పట్టుఁడుల్లమున
నాపట్టి బాలుఁడై-నను రవి తనయ
ప్రాపున మేనుడాఁ-పడ సంగరముల
మీపని పాటల-మెలగఁగ నేర్చు
నోపు నెంతటికైన-నోడఁడెవ్వరికి
వానికేమి గొఱంత-వాఁడు నీవాఁడు
జానకీరమణ! వి-చారమేమిటికి?
ఏ నెవ్వఁడను విశ్వ-మెల్ల రక్షింపఁ
బూనిన మీతోడఁ-బొసఁగఁ బల్కుటకు?"[85]

రామ బాణపీడితుడైన మూలంలోని వాలి తన కుమారుడైన అంగదుని భవిష్యత్తును గురించి ఆందోళన చెందలేదు. వరదరాజు వాలి తనకుమారుని భవిష్యత్తును గూర్చి రామునితో ప్రస్తావించాడు. 'నాకుమారుడు నీ వాడు అయినందువల్ల విచారించాల్సిన అవసరంలే'దని రామునితో తన కుమారుని భవిష్యత్తు పట్ల సంతృప్తిని వ్యక్తంచేశాడు.

2) 'సౌమ్యుడా! వానర రాజ్యంలో పట్టాభిషేకం చేసికొని నీహితులకు సంతోషం కలుగజేయు'మని రాముడు సుగ్రీవునితో చెప్పాడు. అప్పుడు సుగ్రీవుడు రాముని అనుమతినిపొంది రమణీయమైన కిష్కింధాపురిలో ప్రవేశించినట్లు మూలకర్త ఒకశ్లోకంలో వ్రాశాడు.

"శ్లో|| ఇతి రామాభ్యనుజ్ఞాత స్సుగ్రీవో వానరాధిపః|
ప్రవివేశ పురీం రమ్యాం కిష్కిన్ధాం వాలిపాలితామ్. "||[86]

వరదరాజు మూలంలోని పై శ్లోక భావాన్ని విస్తరించాడు.

"పొమ్మని పలుకున-ప్పుడు పైఁడికట్ల
కొమ్ముమనుఁ బవడపుఁ-గోళ్ల దంతములు
పలకతాపనలచేఁ-బసిఁడి మెఱుంగు
ములుకుల బలుచీర్ణ-ముల హరువైన
రథగజ సుభట తు-రంగ మావళులు
పృథుతరలతిక లు-బిసరుహంబులును
మదవతీకాముక-మహనీయమదన
కదననానావిధ-కరణ వైఖరులు
ముత్తేల కుచ్చును-ముదరు బల్కెంపు
కత్తెరలును బూర్త-కాళి మెత్తలును
బురుసామెఱుఁగు పికిల్-పూవు దస్తులను
పరపైన కుంకుమ-పరపు కురంగి
బటువులు తాపితాఁ-బన్నాగ మెచ్చు
దిటమైన యపరంజి-దిండును కెంపు
బోడిగ కోలలు-పుత్తడి యునుసు
జోడును గలిగి రా-జుల కెందులేని
పల్లకిఁగడు జోక-పఱచి తారుండు
బొల్లు మోములు గల్గు-బోయీల తోడ
తెచ్చిన రాముని-దెసఁ జూడనతఁడు
నిచ్చె ననుజ్ఞ యం-దెక్కి పొమ్మనుచు.
ఆపల్లకీ మీఁద-నర్క నందనుఁడు
చూపట్టెఁ దపన తే-జోరాశి యగుచు

ఖేరీమృదంగాది-బిరుద వాద్యములు
భోరుకలంగ నా-ప్తులు చేరి కొలువ
నావెన్క నంగదుఁ-డందలంబెక్కి
తావాలిహితులు చెం-తలఁ గొల్చి రాఁగ
చెంగట దిడ్డు వై-చిన పల్లకీల
సంగడిఁ దారాది-సతులఁ దోకొనుచు
వానరసైన్య రా-వము నింగి ముట్టఁ"[87]

మూలంలోని సుగ్రీవుడు సాధారణంగా కిష్కింధాపురంలోకి ప్రవేశించి నట్లు వాల్మీకి తెలిపాడు. వరదరాజు, తనను గ్రీవుడు 'అలంకరింపబడిన పల్లకీని బోయీలు తెచ్చివుంచగా, రాముని అనుమతిని పొంది అందులో ఎక్కి కిష్కంధకు పోయి'నట్లు వ్రాశాడు అలాగే సుగ్రీవుడు కిష్కింధకు బయలు దేరినప్పుడు ఖేరీ మృదంగాది బిరుదవాద్యాల శబ్దం బోరుకలగింది. అతణ్ణి ఆప్తులు, తారాది సతులు కొలుస్తూరాగా సుగ్రీవుడు ఒక శుభముహూర్తాన కిష్కింధలో ప్రవేశించాడని వరదరాజు వ్రాశాడు. ఇది మూలంలోలేదు.

సుగ్రీవుడు కిష్కింధాపురానికి రాజు కాబట్టి రాజ్యంలోకి ప్రవేశించేటప్పుడు అతనికి హంగు ఆర్భాటం కల్పించడం యుక్తమని ఇక్కడ వరదరాజు భావించాడు.

### 2.4.2 మూలసంక్షేపాలు

1) వాలిదుందుభిని సంహరించి, అతనికళేబరాన్ని మతంగాశ్రమంలో పడవేయడంవల్ల మతంగ మహాముని వాలిని శపించడాన్ని గూర్చి సుగ్రీవుడు రామునికి తెలిపాడు. ఈ విషయం మూలంలో ఏడుశ్లోకాల్లో వుంది.

"శ్లో|| తం తోలయిత్వా బాహుభ్యాం గతసత్త్వ మచేతనమ్|,

................................ ....... .......

........................................ ... ..

వనం మత్సంశ్రయం యేన దూషితం రుధిరస్రవైః||"[88]

బలవంతుడైనవాలి, మృతి చెందిన దుందుభి కళేబరాన్ని ఒక్క ఆమడ దూరంలో పడేటట్లు విసిరి వేశాడు. అట్లు విసిరి వేయడంవల్ల ఆదుందుభి నోటి నుండి వెలువడిన రక్తబిందువులు మతంగమహాముని ఆశ్రమంలో పడ్డాయి. దానితో కోపోద్రిక్తుడైన మతంగ మహాముని, తనపై నెత్తురు బిందువులు పడేవిధంగా చేసిన దురాత్ముడు, దుర్బుద్ధి, మూఢుడు, మూర్ఖుడెవ్వడు? - అని దూషించాడు. ఆయన ఆశ్రమం

బయటకు వచ్చి అక్కడ పడివున్న దుందుభిమృత కళేబరాన్ని చూశాడు. ఆదుష్కార్యాన్ని చేసింది వాలి-అని మతంగ మహాముని తన యోగ దృష్టితో తెలిసి కొన్నాడు. వాలి తానువున్న వనానికి రాకూడదని, వస్తే మరణిస్తాడని మతంగ మహాముని వాలిని శపించాడని సుగ్రీవుడు రామునికి తెలిపినట్లు వాల్మీకి వ్రాశాడు.

మూలంలోని పైఖావాన్ని వరదరాజు సంక్షేపించి తొమ్మిది ద్విపద పంక్తుల్లో తెనిగించాడు.

"తో నుద్ధియైన యా-దుందుభిమేను
విసరి యామడఁ బడ-వేసిన వాని
యసలు నెత్తురు మతం-గాశ్రమభూమి
మునులపైఁ దొరుగన న-మ్మునిరాజుఁ గినిసి
తనయోగ దృష్టి నిం-తయు విచారించి
వాలి కృతంబుగా - వగచి యాలోనఁ
గాలాగ్నియును బోలి-గ్రక్కున మండి
యెప్పుడు వాలి దా-నిచటికి వచ్చె
నప్పుడే పొలియుఁగా-కని శపియించి"[89]

వాల్మీకి మతంగ మహాముని సామాన్య మానవునివలె వాలిని దురాత్ముడు, దుర్బుద్ధి, మూఢుడు, మూర్ఖుడు - అని దూషించాడు వరదరాజు మంతగ మహాముని వాలిని దూషించలేదు. అతనిపట్ల ఆయన 'కాలాగ్నివలె గ్రక్కున మండిపడి' శపించాడు. ఇక్కడ వరదరాజు మూలాన్ని కుదించి ఋషియైన మతంగ మహాముని పాత్రకు పుష్టిని చేకూర్చాడు.

2) 'సమస్త భూమండలం నీకెట్లు తెలియును' నని రాముడు సుగ్రీవుని అడిగాడు. అప్పుడు సుగ్రీవుడు రామునికి తెలిపిన విషయం మూలంలో పదిశ్లోకాల్లో వుంది.

"శ్లో|| సమాం జిఘాంసు ర్దుష్టాత్మా వాలీ ప్రవ్యథి తేన్ద్రియః

............................ ...............

....................................... ....

హిమ వన్తం చ మేరుం చ సముద్రం చ తథోత్తరమ్"[90]

దురాత్ముడైన వాలి నన్ను వధించడానికి ప్రయత్నించగా, నేను మంత్రులతోపాటు అరణ్యాలకు పరిగెత్తాను అతడు మమ్మల్ని తరుముతూ మావెంటనే

వచ్చాడు. అంతవాలి వల్ల భయంతో నేను, నామంత్రులు నానావిధాలైన నదులు, వనాలు, పట్టణాల్ని చూస్తూ పరుగెత్తాము అప్పుడునేను భూమిని గోష్పదమంతటిదిగా భావించి అద్దంవలె, కొరవిచక్రంవలె స్పష్టంగా చూశాను. దాంతో తూర్పు దిక్కుకుపోయి నానావిధ-వృక్షాల్ని, పర్వతాల్ని, రమణీయమైన నదుల్నీ, సరస్సుల్నీచూశాను. అక్కడ క్షీరసాగరాన్ని దర్శించాను. నేను ఆవిధంగా పరుగెత్తుతూ వుండగా వాలి తరుముకొని వస్తుండడంవల్ల దక్షిణము, పడమర, ఉత్తర దిక్కులకు పరుగెత్తి ఆదిక్కులలోని వృక్షాలు, నదులు, పర్వతాలు చూశాను' - అని సుగ్రీవుడు రామునికి తెలిపినట్లు మూలకర్త రచించాడు.

వరదరాజు మూలంలోని పై భావాన్ని సంక్షేపించి అనువదించాడు.

"నన్ను మా వాలి మి-న్నక యాగ్రహించి
తరిమిన నతనిచేఁ-దాడికిఁ గాక
కొఱవి ద్రిప్పిన యట్లు-కుంభిని యెల్ల
దిక్కులు సాగర-ద్వీపముల్ దాఁటి
యక్కడక్కడ తమం-బవధిగా మఱలి"[91]

వాలిచేత తరుమబడిన సుగ్రీవుడు భూమండలం అంతా తిరిగి, తాను చూచిన నదులు, వృక్షాలు, పర్వతాల గురించి రామునికి తెలిపినట్లు మూలకర్త విపులంగా వ్రాశాడు. అయితేవరదరాజు, సుగ్రీవుడు కొఱవి త్రిప్పినట్లు భూమండలంలోని దిక్కుల్ని సాగరద్వీపాల్ని చుట్టాడని రెండు ద్విపదల్లో మూలసంక్షేపంచేశాడు.

### 2.4.3 మూలానుసరణలు

1) శ్రీరాముడు వసంతాగమశోభితమైన పంపాసరోవర తీరాన్ని చూచి సీతా వియోగభారాన్ని భరింపలేక విరహవేదన చెందాడు. అప్పుడు ఆసరస్తీర సౌందర్యాన్ని గురించి ఆయన లక్ష్మణునితో తెలపడాన్ని మూలకర్త ఐదు శ్లోకాల్లో వ్రాశాడు

"శ్లో॥ సతాం పుష్కరణీం గత్వా పద్మోత్పలఝషాకులామ్.|,
రామ సౌమిత్రి సహితో విలలా పాకులే న్ద్రియః॥
తస్య దృష్ట్వైవ తాం హర్షా దిన్ద్రియాణి చకమ్పిరే|
సకామవశ మాపన్న స్సౌమిత్రి మిదమ బ్రవీత్॥
సౌమిత్రే! శోభతే పమ్పా వైడూర్యవిమలోదకా|,
ఫుల్లపద్మోత్పలవతీ శోభితా వివిధైర్ద్రుమైః॥

సౌమిత్రే! పశ్య పమ్పాయాః కాననం శుభదర్శనమ్।
యత్ర రాజ న్తి శైలాభా ద్రుమా స్సశిఖరా ఇవ॥
మాం తు శోకాభిసంతప్తం మాధవః పీడయ న్నివ।
భరతస్యచ దుఃఖేన వైదేహ్యా హరణేన చ॥"[92]

తామరాకులతో, చేపలతో నిండి వుండే పంపాసరస్సును రాముడు లక్ష్మణ హితంగా చూచి మొదట సంతుష్టుడై తర్వాత సీతను తలుచుకొని కామవివశుడైనాడు. ప్పుడు రాముడు లక్ష్మణుని చూచి ఈ విధంగా చెప్పాడు. 'లక్ష్మణా! పంపాసరస్సు వైడూర్యమణులవంటి స్వచ్ఛమైన జలం కలదై వికసించి వున్న కమలాలు, నల్లకలువలు బడై, తీరంలో వుండే నానావిధ ఫలవృక్షాలతో ఎంతో ప్రకాశిస్తున్నది. లక్ష్మణా! ంపాతీరంలో వుండే అరణ్యం సుందరంగా వుంది. దానిలో వృక్షాలు ర్వతాకారంగాను, కొమ్మలు శిఖరాలుగాను వుండి అలరిస్తున్నాయి చూడు భరతుడు ునివేషం దాల్చి కష్టపడుతుండటంవల్ల, సీతాపహరణంవల్ల నేను చాలా దుః స్తున్నాను' - అని రాముడు లక్ష్మణునితో తెలిపినట్లు మూలకర్త రచించాడు.

వరదరాజు మూలంలోని పై భావాన్ని యథాతథంగా తెనింగించాడు

'ఆ రాఘవుండు పంప-నందముల్ నింప
చేరిజన్ గాని తన-సీతావియోగ
విరహ వేదనలచే-వేగి యా సరసిఁ
దరిసి యా దరిసీమఁ - దమ్ముని జూచి
యచటి వినోదంబు-లాత్మకింపొసఁగ
నుచితవైఖరి తోడ-నొక మాట వల్కె
వైడూర్య నిర్మల - వారి పూరంబు
చూడఁ జూడంగ మె-చ్చులు పొదు కొల్పె!
చేతోవికాస ల-క్ష్మీ నిధానంబు
లీతీరవనభూము-లీక్షింపు మిపుడు!
ఒక కొన్ని శిఖరస-మున్నతశైల
నికరంబులనఁగ వ-న్నియఁ గాంచె తరులు!
భరత వియోగంబు - భామావియోగ
మిరువాగు జతఁ గూడి - యేకీభవించి
మన నిచ్చునే యీ ద్రు - మచ్ఛాయలందు?"[93]

'భరతుడు మనివేషం తాల్చి కష్టపడు తున్నందు వల్ల కలిగిన దుఃఖం, సీతాపహరణంవల్ల కలిగిన దుఃఖం ఈ రెండు తనను పీడుస్తూన్నా'యని వాల్మీకి రాముడు తెలిపాడు. వరదరాజు రాముడు 'భరతవియోగం, భామావియోగం కలసి తనను మననిస్తాయా?' అని దిగాలు పడ్డాడు.

2) రామబాణం చేత హతుడైన తనభర్తయగు వాలికి నమస్కరించమని తారకుమారుడైన అంగదునికి చెప్పింది. తనతల్లి సూచన మేరకు అంగదుడు వాలికి నమస్కరించాడు. ఈ విషయంమూలంలో నాలుగు శ్లోకాల్లో వుంది.

"శ్లో|| బాల సూర్యోదయ తనుం ప్రయాన్తం యమసాదనమ్|,
అభివాదయ రాజానం పితరం పుత్ర! మానదమ్||
ఏవ ముక్త స్సముత్థాయ జగ్రాహచరణౌ పితుః|
భుజాభ్యాం పీనవృత్తాభ్యా మంగదోఽహ మితి బ్రువన్||
అభివాదయ మానం త్వామంగదం త్వం యథా పురా|
దీర్ఘాయుర్భవ పుత్రేతి కిమర్థం నాభిభాషసే||
అహం పుత్ర సహాయా త్వా ముపాసే గత చేతసమ్|
సింహేన నిహతం సద్యో గౌస్సవత్సేవ గోవృషమ్||"[94]

'కుమారుడా! యమ మందిరానికి పోతూ, ఉదయ సూర్యునిలాగా, అరుణగాత్రుడై ఉన్న వానరేశ్వరునికి నమస్కరించ'మని తార అంగదునితో చెప్పింది. అంగదుడు తనతల్లి మాటప్రకారం వాలికి తన పేరును తెలిపి అతని పాదాల్ని పట్టుకుని నమస్కారం చేశాడు. తారవాలిని వుద్దేశించి, 'అంగదుడు నీకు నమస్కారం చేయగా మునుపటిరీతిగా కుమారుడా! చిరాయువగుము. అని నీవు అతణ్ణి ఎందుకు ఆశీర్వదించలే'దని అడిగింది 'సింహముచేత ఆక్షణమేహతమైన ఆ బోతును ఆవు, దూడ వదలకుండా సేవించినట్లు మృతిచెందుతున్న నిన్ను నేను, నాకొడుకు సేవిస్తున్నా'మని తారఅన్నట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పై భావాన్ని యథాతథంగా అనువదించాడు.

"అదెకంటె! మీతండ్రి-యంతి మావస్థ
కనుఁగొంటివే వాలి-గాత్రంబు వెడలి
దినకర ప్రభనొక్క-దివ్యతేజంబు
చను చున్నయది నమ-స్కారంబు సేయు
మన విని యంగదుం-డతుల మ్రొక్కుటయు

తార యా ప్రాణేశుఁ-దరిసి 'యో స్వామి!
ఊరకయుందురే - యొల్లకమమ్మ?
వీ7డె యంగదుడు దీ-వెనలిమ్మ కొడుకు
గాఁడె యిట్టిటికిఁ-గరుణింప విపుడు?
సింగంబుచేతఁ జ-చ్చిన వృషభంబు
సంగిడి నావు వ-త్సంబుతోఁ గదియు
కైవడి నీచెంతఁ-గాచి కొల్చెదము"[95]

మూలంలోని తార వాలిని, 'అంగదుడు నీ కు నమస్కారంచేయుగా మునుపటిలాగా కుమారుడా! చిరాయువగుమని అతన్ని ఎందుకు ఆశీర్వదించలే'దని ప్రశ్నించింది. తెలుగులో తార వాలిని 'ఓస్వామి! మాతో మాట్లాడకుండా వూరకేవుంటారా? అంగదుడైన ఇతడు నీ కొడుకు. ఇప్పుడెందుకు అతణ్ణి దీవించకుండా వున్నా'రని అడిగింది

వరదరాజు రచనలోని తారపల్కిన పైపలుకులను బట్టి భర్తయెడల ఆమెకు గల ఆప్యాయత స్పష్టమగు చున్నది

3) సుగ్రీవుడు సీతజాడను కనుగొనడం తద్వారా రావణుని సంహరించే కార్యక్రమాన్ని విడనాడి కామాతురుడై కిష్కింధాపురంలో సౌఖ్యాన్ని అనుభవిస్తున్నాడు. రాముడు పంపగా కిష్కింధాపురికి వచ్చిన లక్ష్మణుడు, రావణ సంహారార్థమై చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చమని సుగ్రీవుణ్ణి దూషించాడు. ఈ విషయం మూలకర్త ఐదుశ్లోకాల్లో వ్రాశాడు.

"శ్లో|| అనార్య స్త్వం కృతఘ్న శ్చ మిథ్యావాదీ చ వానర|
పూర్వం కృతార్థో రామస్య నతత్ప్రతికరోషియత్||
నను నామ కృతార్థేన త్వయ రామస్య వానర|
సీతాయా మార్గణే యత్నః కర్తవ్యః కృత మిచ్ఛతా||
సత్వం గ్రామ్యేషు భోగేషు సక్తో మిథ్యాప్రతిశ్రవః|,
నత్వాం రామో విజానీతే సర్పం మణ్డూకరావిణమ్||
మహాభాగేన రామేణ పాపః కరుణవేదినా|
హరీణాం ప్రాపితో రాజ్యం త్వం దురాత్మా మహాత్మనా||
కృతం చే న్నాభిజానీషే రామ స్యాక్లిష్ట కర్మణః|
సద్య స్త్వం నిశితై ర్బాణైర్హతో ద్రక్ష్యసి వాలినమ్||"[96]

'సుగ్రీవుడా! నీవు ముందుగా రాముని సహకారంతో నీకార్యాన్ని నెరవేర్చుకొని కృతార్థుడవయ్యావు. అటుపిమ్మట నీవు పల్కిన మాటప్రకారం రాముని కార్యం చెయ్యకుండా మాటతప్పావు. కాబట్టి నీవు దుర్మార్గుడవు. కృతఘ్నుడవైతివి. రాముడు నీకు చేసిన ఉపకారాన్ని నీవు మరవకుండావుంటే తగిన ప్రయత్నంచేసి సీతను వెదికింపవలెగదా!

కప్పలను మ్రింగడానికి సర్పం కప్పవలె అరచునట్లు, నీవు మొదట కార్యార్థమై సత్యవంతుడవుగా అభినయించి ఇప్పుడు గ్రామ్యములైన విషయ సుఖాలకు లొంగి ప్రతిజ్ఞ తప్పావు. నీవు దురాత్ముడవు, పాపిష్ఠుడవునని తెలియక రాముడు నీకు వానరరాజ్యాన్ని ఇచ్చాడు. రాముడు చేసిన ఉపకారాన్ని నీవు మరచినట్లైతే నిన్ను ఇప్పుడే వధించి వాలి వద్దకు పంపుతాను' - అని లక్ష్మణుడు సుగ్రీవుని దూషించినట్లు మూలకర్త రచించాడు

వరదరాజు మూలంలోని పైభావాన్ని యథాతథంగా ద్విపదీకరించాడు.

"నిందకోరిచి రాము-నికి రెండు దలఁచి
కల్లలాడిన నీకుఁ-గమల సంభవుడు
చెల్లరె! యెట్లుని-ష్కృతి విధియించు
సీతను వెదకింపఁ-జేపట్టెఁగాక
నీతోడు శ్రీరాము-నికి నేమిపనికిఁ
గప్ప పల్కినయట్లు-కాలాహి వల్కి
కప్ప నమ్మికఁ జేరఁ-గని మ్రింగినట్లు
నీకార్యమునకునై-నెయ్యంబు జేసి
వాకొంటి వప్పుడు-వలసిన యట్ల
వాలినిఁ జంపి నీ-వారమై రాజ్య
మేలించి నినుఁదెచ్చి-యింటిలోనునిచి
యిన్ని పాటులఁబడు-టెల్లను నీవుఁ
గన్నెలు నేవేళఁ-గలుద్రావి చొక్కి
కామాతురుండవై-కడపటు మమ్ము
నేమియుఁ దలఁపక-యిట్లుండు కొఁజె?
ఓరి! రామద్రోహి!- యొకతూపుఁ దొడిగి
నీరొమ్ము నాటించి-నేఁడె కూల్చెదను!"[97]

మూలంలోని లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి, 'రామకార్యం నెరవేర్చనందుకు దుర్మార్గుడు, కృతఘ్నుడు, పాపిష్ఠుడు, అసత్యం పలికే వాడు' - అని దూషించాడు. వరదరాజు లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి 'వాలిని హతమార్చి నీకు వానర రాజ్యపట్టాభిషేకం చేస్తే నీవు రాముని కార్యంగురించి పట్టించుకోకుండా వుంటావా'? - అని ప్రశ్నించాడు. అలాగే, 'రావణుని సంహరిస్తానని అబద్ధాలు పలికిన నీకు కమల సంభవుడు ఎలాంటి నిష్కృతి విధించునో' అని పలికాడు.

వాల్మీకి లక్ష్మణుడు, సుగ్రీవుడు బాధపడే విధంగా అతణ్ణి దూషించాడు. వరదరాజు లక్ష్మణుడు సుగ్రీవుడు ఆత్మవిమర్శ చేసికొనే విధంగా అతని తప్పును అతనికి చాలా సున్నితంగా తెలియజేశాడు.

**2.4.4** కల్పనలు

1) సీతాన్వేషణకు సహకరించె దనన్న సుగ్రీవుడు తారాదులతో కలిసి యుండి కార్యోన్ముఖుడు కాలేదు. అంతరాముడు సుగ్రీవుని కొరకు లక్ష్మణుణ్ణి పంపాడు. ఆవార్త విన్న సుగ్రీవుడు తారాదులను దూరంగా పంపినట్లు మూలంలో ఒక శ్లోకంలో వుంది.

"శ్లో॥ తమేవ ముక్త్వా సుగ్రీవో లక్ష్మణం శుభలక్షణమ్।
విసర్జయామాస తదా తారా మన్యాశ్చ యోషితః॥"[98]

వరదరాజు మూలంలోని పైభావానికే స్వతంత్ర కల్పన చేశాడు.

"ఏగతి నేయింట-నెవ్వార లుండ
నియమింప వలయు న-న్నింటికిఁ దగిన
నియతి మనోవర్తి-నిత్యకృత్యములు
నడిపింపఁదగు వారి-నగరి వాకిటను
బడగరంబులకును-ప్రహరి చుట్టుటకుఁ
బట్టణ రక్షకా-ప్తత గలవారిఁ
గట్టడ చేసి యే-కార్యంబులకును
తార చెప్పినయట్ల-తనయాజ్ఞ నడవ
నేరు పాటుగఁజేసి-యిచ్చె నుంగరము
ఆముద్రఁగైకొని-యలివేణి తార
రాముని కార్య ని-ర్వాహంబులకును
దగిన యాలోచనల్-తన తోడ నడుప

నగునని యన్నియు-నంగీకరించి
యమ్మానవతి వెంట-నతివల నాద
రమ్మున నంతః పు-రమ్మున కనిచి"[99]

'నగరంవాకిటు, బడగరంబులకు, ప్రహరీచుట్టడానికి, పట్టణ రక్షణకు మొదలైన పనులకు ఎవరెవ్వరిని ఎక్కడెక్కడ వుంచాల్నో అక్కడక్కడ తారచెప్పినట్లు తన ఆజ్ఞనడిచే విధంగా సుగ్రీవుడు నియమించా'డని వరదరాజు కల్పించి రచించాడు. వరదరాజు రాజుకాబట్టి, రాజధాని రక్షణ విషయాలు ఆయానకు బాగా తెలిసినందువల్ల పై విధంగా తనకాలంనాటి రక్షణ విషయాలను జోడించి వ్రాశాడని భావించవచ్చు.

సుగ్రీవుణ్ణి రాముని వద్దకు రమ్మని లక్ష్మణుడు వచ్చిపిలవగానే అతడు తనవద్దనుంచి తారాది స్త్రీలను పంపేశాడు. ఆయన వారిని ఎక్కడికి పంపిందీ మూలంలోలేదు. అయితే వరదరాజు, సుగ్రీవుడు వారిని అంతఃపురానికి పంపించినట్లు విశదపరచాడు.

2)' రావణాసురుణ్ణి భ్రాతృ పుత్రాది బంధుసహితంగా యుద్ధంలో వధించి సీతాదేవిని తెచ్చి నీకు సమర్పించగల మహావీరులైన వానరులు నీసన్నిధానానికి వస్తున్నా'రని సుగ్రీవుడు రామునితో చెప్పినట్లు మూలకర్త ఒక శ్లోకంలో వ్రాశాడు.

"శ్లో|| తే త్వా మభిగమిష్యన్తి రాక్షసంయే సబాన్ధవమ్|
నిహత్య రావణం సంఖ్యే హ్యానయిష్యన్తిమైథిలీమ్||"[100]

మూలంలోని పై శ్లోకభావానికి వరదరాజు స్వతంత్ర కల్పన చేశాడు.

"సీతను దెచ్చెద-సెలవిమ్ము తనకు
నీతతీననియుత్స-హించిన వారు
'ఏమెఱుఁగని యట్టి-యిర వులు గలవె?
భూమిజ నిపుడె చూ-పుదు' మనువారు
'ఈపాటిపనికైన-నేను రానేల?
నాపంపునకుఁ జాలు-నా? యనువారు
రావణుఁ దెచ్చి యీ-రాముని యెదుర
నీవేళ నేనుంతు-నే!' యనువారు
నయ్యున్న యీ వాన-రావళిఁజూడు
మయ్య! నీమదిలోని -'యలమటల్ దీఱు'?"[101]

వాల్మీకి సుగ్రీవునకు తనసైనికుల శౌర్యపరాక్రమాలపై అంతటి నమ్మకం వున్నందువల్లనే వారు రావణుణ్ణి భ్రాతృ పుత్రాగి బంధుసహితంగా యుద్ధంలో సంహరించగలరని రామునకు తెలిపాడు. 'సీతను తెస్తాను-సెలవి'మ్మనే వారిని 'భూమిజను ఇప్పుడే తెస్తాను' - అనే వారిని, 'సీతను తీసుకురావడమనే ఈ చిన్నపనికి నేను రావలెనా' - అనేవారిని, రావణునితెచ్చి ఈ 'రాముని ఎదుట ఈ వేళవుంచుతా'ననే వారిని, 'చూడుము. నీ మనస్సులోని బాధ తొలగిపోతుం'దని వరదరాజు సుగ్రీవుడు రామునికి తెలిపాడు.

రావణాసురుని చంపటం పెద్దపనికాదని వాల్మీకి సుగ్రీవుడు చెప్పాడు. కాని, రామునికి కావలసినది, అంతకన్నను ముఖ్యమైంది సీతాదేవిని తెచ్చుట. ఆ విషయానికే ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇచ్చాడు, తెలుగు రామాయణంలోని సుగ్రీవుడు. సీతాదేవిని తెచ్చిన రాముని మనస్సులోని బాధపోతుంది. ఆవిషయాన్ని నొక్కిచెప్పి నీ బాధను మరచి పొమ్మన్నాడు వరదరాజు సుగ్రీవుడు. వరదరాజ కవి ఇక్కడ పాత్రస్వభావచిత్రణను చక్కగా ప్రదర్శించినాడు. సుగ్రీవుడు ఆలస్యంచేసినందుకు కోపంగావున్న రాముని మనస్సును సంతోషపెట్టే మాటలు తెలుగు సుగ్రీవుని నోట వరదరాజు సమయస్ఫూర్తితో పలికించాడు.

### 2.5.1 మూలవిస్తరణ (సుందరకాండము)

1) రావణుని భర్తగా స్వీకరింపవలసినదని రాక్షసస్త్రీలు సీతను ఒత్తిడిచేశారు అందులో బాగంగా దుర్ముఖిఅనే రక్కసి రావణుని గొప్పతనాన్ని గురించి సీతకు తెలిపి ఆమెను రావణుని భర్తగా అంగీకరించమనికోరింది. ఈవిషయంమూలంలో రెండుశ్లోకాల్లోవుంది

"శ్లో|| తతస్తు దుర్ముఖీనామ రాక్షసీ వాక్య మబ్రవీత్|
యస్య సూర్యోన తపతి భీతో యస్య చ మారుతః||
నవాతి స్మాయతాపాంగే కిం త్వం తస్య నతిష్ఠసి|
పుష్పవృష్టిం చ తరవో ముముచు ర్యస్య వై భయాత్||"[102]

దుర్ముఖి అనే రాక్షసి సీతను చూచి 'విశాలమైన కన్నులుగలసీతా! రావణునికి భయపడి సూర్యుడు తపింపజేయకుండా వున్నాడు. వాయుదేవుడు అధికంగా గాలిని వీచకుండా వున్నాడు. రావణునికి భయపడి వృక్షాలు పూలవానను కురిపిస్తున్నాయి. అతుడు కోరినప్పుడల్లా మేఘాలు వర్షిస్తున్నాయి. అలాంటి మహత్తర శక్తి సంపన్నుడైన రావణునకు భార్యగా వుండడానికి నీవు ఎందుకు ఇష్టపడకుండావున్నా'వని ప్రశ్నించినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పైభావాన్ని ఇలా విస్తరించాడు.

"ఇందీవరేక్షణ! - యిదియేటి మతము?
మందెమేలము లేల-మానవు నీవు?
రావణు నాజ్ఞ మీా-ఱఁగ నీవెకాదు
దేవతలకునైనఁ -దీఱునే చెలియ?
తనయింత మెలఁగునో-దక్షిణానిలము
ఇనుఁడు కాయునొ-వెండి యెండలీవీట
కురియునో వానలు - కొలఁదికి మీాఱ!
చరియింప వచ్చునొ - శమనుని కిచట?
వెలుఁగునో సెలవీక- వీతిహోత్రుండు?
కలఁగునొ వారధి-కడలుబ్బి యొరసి?
ఉరుమునొ మేఘంబు - లురువడి గాగ?
శిరములెత్తునొ మ్రోల-శేషాహియైన?
యే ఋతువుల ఫలి-యించు వృక్షంబు
లేరు చాల్సేకక-యిల పంట పండు
వాడనేరవు చుట్టి-వైచిన పువ్వు
లీడెవ్వరీ రాక్ష-సేంద్రున కబల!"[103]

రావణాసురుడు భయంకరమైన రాక్షసరాజని తెలుపడానికే వరదరాజు ఇక్కడ మూలాన్ని విస్తరించాడు. రావణాసురుని శౌర్యపరాక్రమాల్ని గురించి మూలంలో కంటే వరదరాజే ఎక్కువగా తెల్పాడు. 'రావణుని ఆజ్ఞమీారడానికి నీకేకాదు, దేవతల వల్ల కూడాకా'దని వరదరాజు రావణాసురుని గొప్పతనాన్ని గురించి రాక్షసస్త్రీలచే సీతకు చెప్పించాడు.

2) హనుమంతుడు లంకాపురి యందలి రావణుని గృహంలో ప్రవేశించి, సకల భూషణాల్తో అలంకరించుకొని యౌవన సౌందర్యాల్తోకూడి పవ్వళించి వున్న మండోదరిని చూచి సీతగాభ్రమ చెందినాడు. ఈ విషయం మూలంలో ఒక శ్లోకంలో వుంది.

"శ్లో|| సతాం దృష్ట్వా మహాబాహుర్భూషితాం మారుతాత్మజః|
తర్కయామాస సీతేతి రూపయౌవన సంపదామ్"[104]

వరదరాజు మూలంలోని పైశ్లోకభావాన్ని పెంచాడు.

"లంకామహారాజ్య-లక్ష్మియుంబోలి
పంకజాస్త్రనిపూజ-బాణమోయనంగ
రావణు పట్టపు-రాణి వాసంబు
దేవి మండోదరి-దృష్టి యానంగఁ
గనిపించుటయుఁ "గంటి! - కంటి! జానకిని!
మనంగంటి!" నను చు సు-మాళించి యెగసి
గంతులువైచి తోఁ-క ధరిత్రినార్చి
దంతెల కెగఁబ్రాకి-దాఁటి యట్టిట్టు
లానంద పారవ-శ్యము చేతఁదనదు
వానరత్వంబు స-ర్వముఁ దేటపఱచి"[105]

భూషణాల్తో అలంకరించుకొని వెలుగొందుచు యౌవనపుచక్కదనంతో ఒప్పే మండోదరిని, వాల్మీకి హనుమంతుడు సీతగా భావించాడు. అయితే వరదరాజు హనుమంతుడు లంకా మహారాజ్యలక్ష్మిని పోలిన మండోదరిని సీతగాతలపోశాడు వాల్మీకి హనుమంతుడు యౌవనంలో చక్కదనంతో ఉన్న మండోదరిని సీతగాభ్రమించాడు తెలుగున హనుమంతుడు నిండుగా, గంభీరంగా లక్ష్మీదేవితో పోలియున్న మండోదరిని' సీతగా భ్రమించాడు. భ్రమసహజం. కాని భ్రమించుటకు గల కారణంలో మూలంలోని హనుమంతునకు అనువాదంలోని హనుమంతునకు వ్యత్యాసం ఉంది. ఆ వ్యత్యాసమే అనువాదంలోని హనుమంతుణ్ణి మూలంలోకన్నా ఉన్నతునిగా చేసింది.

3) లంకలో సీత జాడను తెలిసికొని వచ్చిన హనుమంతుణ్ణి శ్రీరాముడు ఆమె సమాచారాన్ని గూర్చి ప్రశ్నించాడు. ఈ విషయం మూలంలో రెండు శ్లోకాల్లో వుంది.

"శ్లో|| కిమాహ సీతా హనుమాం స్తత్త్వతః కథ యాద్యమే।
ఏతేన ఖలు జీవిష్యే భేషజే నాతురో యథా||
మధురామధురాలాపా కి మాహ మమ భామినీ|
మద్విహీనా వరారోహా హనుమాన్ కథయస్వమే||"[106]

'హనుమంతుడా! సీత ఏమి చెప్పిందో యథార్థంగా చెప్పు. రోగిమందు వల్ల జీవించేటట్లు నేను సీత చెప్పిన మాటల్ని నీవు చెప్పగా విని జీవిస్తాను. మధురమైన

మాటలు పల్కునది, సుందరమైనదియగు నాభార్య సీత నన్నువిడిచి పరమదుఃఖితయై నీతో ఏమిచెప్పింది - అని శ్రీరాముడు హనుమంతుని అడిగినట్లు మూలకర్త వ్రాశాడు

వరదరాజు మూలంలోని పై విషయాన్ని సొంపుగా విస్తరించాడు.

"అన్న! వాయుకుమార! - యాపన్ను నన్ను
మన్నించి ప్రాణముల్- మఱలింపు మీవు!
నన్ను నెత్తుకపోయి - నలినాక్షి సీత
యున్న వనంబులో - నునిచి రమ్మిపుడు!
ఏల చెప్పితి "సీతఁ" - నేఁ గంటిననుచు?
తేలేవె మూపుపైఁ? - దేవలెనన్నఁ
జూచియు డించి వ-చ్చునె నిన్నువంటి
ధీ చతురుండు నా-తెఱఁగెఱిఁగియును?
ఏమి వల్కెను సీత? - యెటులోర్చె దనుజ
భామలచేతి ని-ర్బంధంబునకును?
నీవేమి యంటివి? - నిమిషమాత్రంబు
నీవలఁ దాళలే - నెగిరి పోఁజాల
నెట్టులున్నది సీత? - యేమని మాట
పట్టి లిచ్చితి వింకఁ - బ్రదుకునేనెలయు?
తెలియఁబల్కుము వెతఁ - దీఱి కొన్నాళ్లు
నిలువరించెద' నంచు-నిలువోపలేక"[107]

'రోగి మందు వల్ల జీవించివుండునట్లు నేను సీత చెప్పిన మాటల్ని నీద్వారావిని బ్రతికివుంటా'నని మూలంలోని రాముడు హనుమంతునితో అన్నాడు. వరదరాజురాముడు హనుమంతునితో, 'వాయుకుమారా! నాప్రాణాల్ని నీవేకాపాడవలెను. కావున నన్నుతీసికొనిపోయి సీత వున్న వనంలో వదిలిర'మ్మని మొదట కోరాడు. తర్వాత' సీత ఏమిచెప్పిందో నీవు నాకు తెలుపుము. దాంతో నా బాధతీరి కొన్నాళ్ళు బ్రతికి వుంటా'నని హనుమంతుణ్ణి అడిగాడు. దీన్నిబట్టి మూలరామునిలో కనిపించు స్థిర చిత్తము వరదరాజు రామునిలో కొరవడినట్లు పైకిగోచరించినా, ప్రియా విరహితుడై ఉన్న శ్రీరాముని పాత్రకు ఆపల్కులు మానవ స్వాభావికంగానే ఉన్నాయని సమర్థించ వీలుకలదు.

2.5.2 మూల సంక్షేపాలు

1) హనుమంతుడు సీతజాడను తెలిసికోవడానికి లంకకు ఆకాశమార్గంలో పయనిస్తూ వుంటాడు. అప్పుడు దేవతలు హనుమంతుని శక్తిని పరీక్షించడానికి సురసను పంపారు. సురస హనుమంతుని మార్గానికి అడ్డంగా నిలిచి, అతణ్ణి మ్రింగివేస్తానని బెదిరించింది. హనుమంతుడు భయపడకుండా ఆసురసకు చెప్పిన సమాధానం మూలంలో నాల్గుశ్లోకాల్లో వుంది.

శ్లో|| రామో దాశరథి ర్నామ ప్రవిష్టో దండకావనమ్|
లక్ష్మణేన సహ భ్రాత్రావై దేవ్యాచాపి భార్యయా||
అన్యకార్యవిషక్తస్య బద్ధవైరస్య రాక్షసైః|
తస్య సీతా హృతా భార్యా రావణేన యాశస్వినీ||
తస్యా స్సకాశం దూతోఒహం గమిష్యే రామశాసనాత్|
కర్తు మర్హసి రామస్య సాహ్యాం విషయ వాసిని||
అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్|
ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమితే||"[108]

హనుమంతుడు సురసనుచూచి 'దశరథ పుత్రుడైన రాముడు తన తమ్ముడు లక్ష్మణునితో, భార్యసీతతో కలిసి దండకారణ్యం ప్రవేశించాడు. ఆ రాముడు రాక్షసుల్తో బద్ధవైరంకలిగి వుండి, ఒకప్పుడు వేరేపని మీదవుండగా రావణుడు ఆయన భార్యను ఎత్తుకొని పోయాడు. నేను రాముని పంపున దూతగా సీత వద్దకు పోతున్నాను. నీవు రాముని రాజ్యంలో వుంటున్నావు కాబట్టి ఆయనకు సహాయంచేయుము. అలాకాకుంటే నేను సీతను చూచి రాముని సందర్శించి నీవద్ధకువస్తా'నని హనుమంతుడు సురసకు చెప్పినట్లు మూలకర్తవ్రాశాడు

వరదరాజు మూలంలోని పైశ్లోకభావాన్ని నాల్గు ద్విపద పంక్తుల్లోకి కుదించాడు.

"శ్రీరాము నానతి-సేయంగఁ బూని
యో రామ! నేనేఁగు - చున్నాఁడ నిపుడు
మఱలి వచ్చిన నీదు - మాటచే పట్టి
తెఱచిన నీదు వా-తికి నగ్గమౌదు"[109]

మూలంలోని హనుమంతుడు సురసమనసును మార్చడానికి ప్రయత్నం చేసిన తెలివైన వాడుగా కనబడతాడు. అందుకే సీతారామ లక్ష్మణులు అడవులకు వచ్చిన విషయం, సీతాపహరణ విషయం సురసకు తెలిపి, ఆమెను కూడా రామునికి సహాయం

చెయ్యమన్నాడు. వరదరాజు హనుమంతుడు అలాంటి ప్రయత్నంచెయ్యకపోగా తాను తిరిగి వచ్చిన తర్వాత సురసకు ఆహారమవుతానని తెలిపాడు.

వరదరాజు ఇక్కడ మొదటి రెండుశ్లోకాల్ని పునరుక్తులుగా భావించి పరిహరించినా, మూడవశ్లోకాన్ని పరిహరించకుండా వుండి వుంటే రచనకు మరింత పుష్టి చేకూరేది.

2) తనకు భార్యగా వుండడానికి అంగీకరించమని రావణుడు సీతను కోరడంగురించి మూలకర్త ఏడు శ్లోకాల్లో తెలిపాడు.

"శ్లో|| మనో హరసి మే భీరు సుపర్ణః పన్నగం యథా|

..................................

. ................................

విహర మయాసహ భీరు కాననాని"[110]

రావణుడు సీతతో ఈ విధంగా చెప్పాడు. 'నీవు నలిగిన పట్టుబట్టకట్టుకొని కృశించి అలంకరించుకోకుండా వుండేటప్పుడే నిన్నుచూచి నాభార్యల మీద ఇష్టంలేనివాడనయ్యాను. నీవు చక్కగా అలంకరించుకొని సంతోషంగా వుండే సమయంలో నిన్ను చూస్తే నామనస్సు ఏవిధంగా వుంటుందో చెప్పనలవికాదు. నాఅంతఃపురంలో సమస్త శుభలక్షణాల్తో కూడిన ఉత్తమస్త్రీ లెందరో వున్నారు. వారికందరికీ నీవు ఈశ్వరిగా ఉండుము. లక్ష్మీదేవికి అప్సరసలు పరిచర్య చేయునట్లు నీకు పరిచర్య చేస్తారు.

సుందరమైన కనుబొమ్మలు, పిఱుదులుగల దానవైన సీతా! కుబేరుని వద్ద ఉన్న రత్నాల్ని, నేను జయించినలోకాల్ని నీ విగాచేసుకుని సుఖాన్ని అనుభవించు. నన్నునీ పతిగా స్వీకరించు. రాముడు తపస్సులోగాని, బలపరాక్రమాల్లోగాని నాకుసరికాడు.

విలపిస్తూవుండుసీతా! నీవు యథాప్రకారం మద్యంత్రావు. కావలసిన భోగాల్ని అనుభవించు నామీద మోహంతో సుఖంగా రమిస్తూ ఉండు. నీవు ఈవిదంగా సంతోషంతో వుంటే నీబంధువులందరు నిన్నుచేరి సంతోషాన్ని అనుభవిస్తారు. నీవు స్వచ్ఛమైన బంగారు హారంతాల్చి, పుష్పించిన చెట్లతోకూడి తుమ్మెదలు మధురంగాగానం చేస్తూవుండగా రమణీయాలైన సముద్ర తీరంలోనివనాల్లో నాతోగూడ క్రీడిస్తూవుండు', అని రావణుడు సీతను కోరినట్లు మూలకర్తవ్రాశాడు

వరదరాజు మూలంలోని పై శ్లోకాల భావాన్ని కుదించాడు.

"నలఁకువతోడ సు-న్నను నిన్నుఁజూచి
తలఁపుఁ ద్రిప్పఁగనేరఁ - దరుణుల యందు
హరిరాణిఁ గొల్చిన - యచ్చరలట్ల
తరుణి! నీసేవ నా-తరుణులుండుదురు.
బలపరాక్రమధైర్య -పదవులఁ దనకుఁ
దులవచ్చు రాఁడని -తోఁ చదుగాక
రాముని దలఁచిక - రంగుమేకాక
యేమిసేయుదువేల - యేలవు నన్ను?"[111]

మూలరావణుడు సీతకు, 'నేను జయించిన లోకాలన్నింటిని నీవిగా చేసికొని సుఖాన్ని అనుభవించమని, ఇష్టప్రకారం మద్యం త్రాగమని, కావల్సిన భోగాల్ని అనుభవించమని, నీవు సంతోషంగావుంటే నీ బంధువులందురు నిన్ను చేరి సంతోషంగా వుంటా'రని ఆశచూపాడు. వరదరాజు రావణుడు సీతకు, 'లక్ష్మీదేవిని అప్సరసలు కొల్చేవిధంగా తన భార్యలందరిని ఆమె సేవకు వినియోగిస్తా'నని మాత్రమే చెప్పాడు.

**2.5.3** మూలానుసరణలు

1) రావణుని భర్తగా అంగీకరించమని సీతను రాక్షసస్త్రీలు కోరారు. అందుకు తిరస్కరిస్తూ సీత వారికి చెప్పిన సమాధానాన్ని మూలకర్త ఆరుశ్లోకాల్లో వ్రాశాడు.

"శ్లో|| యదిదం లోకవిద్విష్ట ముదాహరథ సంగతాః|
నై తన్మనసి వాక్యం మే కిల్బిషం ప్రతిభాతి వః||
న మానుషీ రాక్షసస్య భార్యా భవితు మర్హతి|
కామం ఖాదత మాం సర్వా న కరిష్యామి వో వచః||
దీనో వా రాజ్యహీనో వా యోమే భర్తా సమే గురుః|
తం నిత్య మనురక్తాఽస్మి యథా సూర్యం సువర్చలా||
యథా శచీ మహాభాగా శక్రం సముపతిష్ఠతి|
అరుంధతీ వసిష్ఠంచ రోహిణీ శశినం యథా||
లోపాముద్రా యథాఽగస్త్యం సుకన్యా చ్యవనం యథా|
సావిత్రీ సత్యవంతంచ కపిలం శ్రీమతీ యథా||
సౌదాసం మదయంతీవ కేశినీ సగరం యథా|
నైషధం దమయంతీవ భైమీపతి మనువ్రతా||"[112]

రాక్షసస్త్రీలతో సీత ఈ విధంగా చెప్పింది. 'రావణునికి భార్యగా వుండమని చెప్పడంపాపమని మీమనస్సుకు తోచలేదా? మానవజాతిస్త్రీ ఎప్పటికిని రాక్షసునికి భార్యకాజాలదు. మీరందరూచేరి నన్నుభక్షించినచో భక్షింపుడు కానీ నేను మీరు చెప్పినట్లు చేయను.

నాభర్త రాముడు దీనుడైనా, రాజ్యంలేనివాడైనా అతడేనాకు అధికుడు. సువర్చల సూర్యునిమీద ఏవిధంగా అనురాగాన్ని కలిగి వుంటుందో ఆవిధంగానేను రాముని మీద అనురాగాన్ని కలిగి వుంటాను. శచీదేవి దేవేంద్రుని, అరుంధతివసిష్ఠుని, రోహిణీదేవి చంద్రుని, లోపాముద్ర అగస్త్యుని, సుకన్య చ్యవనుని, సావిత్రి సత్యవంతుని, శ్రీమతి కపిలుని, మదయంతి సౌదాసుని, కేశిని సగర చక్రవర్తిని, దమయంతి నలచక్రవర్తిని అనుసరించివుండునట్లు నేను ఇక్ష్వాకు వంశంలోని ఉత్తముడైన రాముణ్ణి అనుసరించి వుంటాను - అని సీత రాక్షసస్త్రీలతో చెప్పినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పైభావాన్ని యథాతథంగా అనువదించాడు

"దనుజుల దనుజకాం-తలు మనుజులను
మనుజాంగనలు కోరు-మాట నిక్కువము
ఇలయెల్ల నేలిన-నిడుమలఁ బడిన
పొలఁతు లకును దైవ-ములు ప్రాణ విభులు
రాముని చరణసా-రసములు గాక
నామది నేల య-న్యంబులు దలఁతు?
ఛాయకు సూర్యుఁడు-శచికి నింద్రుండు
నాయరుంధతికి జో-డై వసిష్ఠుండు
రోహిణీసతికిఁ జం-ద్రుఁడు సుకన్యకు
నూహింపఁ జ్యవనుఁడు-నుర్వి శ్రీమతికి
కపిలమౌనియును స-గరుఁడు కేసినికి
కృపనేల దమయంతి-కిని నైషధుండు
జతగ సావిత్రికి-సత్యవంతుండు
శ్రిత చంద్రమతికి హ-రిశ్చంద్ర విభుఁడు
భామ కుంభజునిలో-పాముద్ర కెట్టు
కామింపఁ దగును నా-కైవడి జూవె
రామచంద్రుండె నా-రమణుఁడుగాక
కామింప నేర్తునే-కడ వాని నేను?"[113]

రాముడు దీనుడైనా, 'రాజ్యంలేని వాడైనా ఆతడేతనకు అధికుడు' - అని మూలంలోని సీత తెలిపింది. వరదరాజు పై భావానికి సార్వజనీనతను చేకూర్చాడు. 'రాజ్యాలు ఏలేటప్పుడుకాని, కష్టాల్లో ఉన్నప్పుడుకాని స్త్రీలకు తమ పతులే దైవము'లని అనువాదంలోని సీత తెలిపింది.

2) లంకలో రావణుని బందీగా వున్న సీతను రాముని వద్దకు తీసికొని పోతానని హనుమంతుడు ఆమెకు విన్నవించడం మూలంలో మూడుశ్లోకాల్లో వుంది.

"శ్లో|| అథవా మోచయిష్యామి త్వా మద్యైవ వరాననే|,
అస్మాద్దుఃఖా దుపారోహ మమ పృష్ఠ మనిందితే||
త్వాం హి పృష్ఠగతాం కృత్వా సంతరిష్యామి సాగరమ్|,
శక్తి రస్తి హి మే వోఢుం లంకా మపి స రావణామ్||
అహం ప్రస్రవణస్థాయ రాఘవా యాద్య మైథిలి|,
ప్రాపయిష్యామి శక్రాయ హవ్యం హుత మివానలః||"[114]

హనుమంతుడు సీతాదేవితో ఈవిధంగా చెప్పాడు. 'సుందరమైన ముఖంకలిగి నిందింపబడని దానవైన సీతాదేవి! నీ దుఃఖాన్ని ఇప్పుడే పోగొట్టెదను. నీవు నావీపుపైనెక్కితే నిన్నిప్పుడే రాముని వద్దకు తీసికొని పోతాను నిన్ను మోసికొని పోవడానికి నాశక్తి వుందోలేదోనని శంకించవద్దు. రావణునితో సహా ఈలంకనుకూడా మోసికొని పోగలను వ్రేల్చబడినహవిస్సును అగ్నిహోత్రుడు దేవేంద్రునికి ఒసగినట్లు నిన్నుతీసికొని పోయి రామునికర్పించగల'నని హనుమంతుడు సీతకు తెలిపినట్లు మూలకర్త వ్రాశాడు

వరదరాజు మూలంలోని పై భావానికి యథాతథ అనువాదం చేశాడు.

"నిన్ను వీపునం దాల్చి-నిమిషంబులోన
మున్నీరు దాఁటి రాముని-చెంత నునుతు!
కొనిపోవఁ జాలఁ డో-కోయను శంక
మనసులోపల నీవు-మాను మీలంక
యీ రాక్షసాళితో-నేఁ బెల్లగించి
కోరకైవడి కేలఁ-గొని మింట నేఁగ
సత్తువ కలదు వి-చారమేమిటికి?
ఉత్తము గుణవతి!-యొకసెలవిమ్ము
హుతవహుఁడందు నా-హుతులు తాఁదెచ్చి
శతమఖునకు నిచ్చు-చందంబుఁ దోఁపఁ
గానుక సేతు రా-ఘవునకు నిన్ను"[115]

2.5.4 కల్పనలు

1) హనుమంతుడు సముద్రముపై ఆకాశమార్గంలో పయనిస్తూవుండగా మైనాకుడనే పర్వతం ఆసముద్రంనుంచి పైకివచ్చి ఆతని మార్గానికి అడ్డుపడింది. అప్పుడు మైనాకుడు హనుమంతునితో క్రింది విధంగా తెలిపినట్లు మూలకర్త వ్రాశాడు.

"శ్లో|| సమాముపాగతః క్రుద్ధో వజ్రముద్యమ్య దేవరాట్|,
తతో9హం సహసా క్షిప్తశ్శ్వ ససేన మహాత్మనా||
అస్మిన్లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ|,
గుప్తపక్షసమగ్రశ్చ తవ పిత్రాఽభిరక్షితః||
తతోఽహం యానయామి త్వాం మాన్యోహి మమమార్గతః
త్వయామే హ్యేష సంబంధః కపిముఖ్య మహాగుణః||
అస్మిన్నేవం గతే కార్యే సాగరస్య మమైవ చ|,
ప్రీతిం ప్రీతమనాః కర్తుం త్వమర్హసి మహాకపే||"[116]

'దేవేంద్రుడు కోపంతో వజ్రాయుధంఎత్తుకొని నారెక్కల్నినరికి వేయడానికి వచ్చాడు. అప్పుడు మహాత్ముడైన వాయుదేవుడు శీఘ్రంగా నన్నుదూరంగా నెట్టుకొని పోయాడు నీతండ్రియైన వాయుదేవుడు నన్నుసముద్రంలో పడద్రోసి నారెక్కలు తెగిపోకుండా కాపాడాడు. అందువల్ల వాయుదేవుడు నాకు పూజనీయుడు అతణ్ణి పూజించిన వాడునగుటకై అతని పుత్రుడవైన నిన్ను పూజిస్తాను. నీ తండ్రి నన్ను రక్షించాడు. కాబట్టి ఆతని పుత్రుడవైన నీతోనాకు సంబంధంవుంది. కావుననేను, సముద్రుడు ఇచ్చే ఆతిథ్యాన్ని నీవుసంతోషంతో స్వీకరించవలెను - అని మైనాకుడు హనుమంతునితో అన్నట్లు మూలకర్త రచించాడు.

వరదరాజు ఇక్కడ మూలంలోని మూడు శ్లోకాలభావాన్ని పూర్తిగా పరిహరించి క్రిందివిధంగా తెనిగించాడు.

"ఓయి! వానరవీర! - యుదధి నాయకుఁడు
నీయత్న మెఱిఁగి మ-న్నించి నాచేత
బహుమాన మొనరింపఁ -బనిచె నిచ్చోట
విహరింపు మాఁకటి-వేళకు వలయు
ఫలములు సేవింపు-బడలిక దీఱ
వలయు తావునకుఁ బో-వఁగ సమ్మతింపు"[117]

వాయుదేవుడు తనను రక్షించాడు కాబట్టి అతని పుత్రుడైన హనుమంతునకు ఆతిథ్యం ఇవ్వడం తన కర్తవ్యంగా మూలంలోని మైనాకుడు భావించాడు. సముద్రుడుపంపగా వచ్చిన వరదరాజు మైనాకుడు తన ఆతిథ్యాన్ని స్వీకరించమని మాత్రమే హనుమంతుణ్ణి కోరాడు.

2) హనుమంతుడు సురసను జయించిన తర్వాత లంకకు పయనించిన ఆకాశమార్గాన్ని గురించిన వర్ణన మూలంలో ఏడుశ్లోకాల్లోవుంది.

"శ్లో|| సేవితే వారిధారాభిః పతగైశ్చనిషేవితే

..............................

..............................

జగామ వాయుమార్గే తు గరుత్మానివ మారుతిః"[118]

'హనుమంతుడు మేఘాలు విడిచే వారిధారలచే ఒప్పుతూ, పక్షులకు ఆటపట్టై తుంబురుడు మొదలగు ఆచార్యులకు సంచారస్థానమై, ఇంద్రధనస్సుకు నెలవై, భూలోకంలో పుణ్యకార్యాలుచేసి స్వర్గలోకంపొంది మహాభాగులై నక్షత్రరూపంలో వెలిగే పుణ్యపురుషులతో కూడి, అగ్నిహోత్రునికి మార్గమై అంగారకాది గ్రహాలు, అశ్విని మొదలైన నక్షత్రాలు, చంద్రుడు సూర్యుడు మున్నగువారు కలదై మహర్షులచేత, గంధర్వులచేత. సర్పములచేత, యక్షుల చేత సంపూర్ణమై పరిశుద్ధమును, స్వచ్ఛమునై అన్నిటావ్యాపించివుండేదై, గంధర్వ రాజగు విశ్వావసువుచే సేవింపబడుతూ, దేవేంద్రుని గజమైన ఐరావతానికి క్రీడాస్థానమై, చంద్రునికి సూర్యునికి మార్గమై, మంగళకరమై, జీవలోకానికి బ్రహ్మదేవునిచే నిర్మింపబడిన విస్తీర్ణమైనమేలు కట్టువంగి, పరాక్రమ[illegible]రు ఉత్తములునైన విద్యాధరులచే సేవింపబడుతూ వుండే ఆకాశమార్గంలో గరుత్మంతుని వలెవెళ్లినా'డని మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పై భావాన్ని ద్విపదీ కరించడం అనావశ్యక విస్తృతిగా భావించాడు. అందుకే ఆయన క్రింది విధంగా ఒక్క ద్విపద పంక్తిలో సంక్షేపించి వ్రాశాడు

"రయమునందు ఖగేశ్వ-రసమానుఁడగుచు"[119]

ఇక్కడ మూలంలోని అప్రధానమైన వర్ణనను పరిహరించడంవల్ల వరదరాజు కావ్యానికి సంక్షిప్తత ఒనగూడింది.

2 6.1. మూలవిస్తరణ (యుద్ధకాండము)

1) హనుమంతుడు లంకలో కావించిన విధ్వంసాన్ని గూర్చి రావణుడు రాక్షసులతో ప్రస్తావించడం మూలంలో మూడుశ్లోకాల్లో వుంది.

"శ్లో|| లఙ్కాయాంతు కృతం కర్మ ఘోరం దృష్ట్వా భయావహమ్|,
రాక్షసేన్ద్రో హనుమతా శక్రేణేవ మహాత్మనా||
అబ్రవీద్రాక్షసాన్ సర్వాన్హ్రియా కించిదవాఙ్ముఖః|,
ధర్షితా చ ప్రవిష్టా చ లఙ్కా దుష్ప్రసహా పురీ||
తేన వానరమాత్రేణ దృష్టా సీతా చ జానకీ|
ప్రాసాదో ధర్షితశ్చైత్యః ప్రవరా రాక్షసా హతాః||"[120]

లంకలో హనుమంతుడు చేసిన మహాభయంకర కార్యాన్ని చూచి రావణుడు సిగ్గుచేత ఇంచుకతలవంచుకొని రాక్షసులతో ఇలాచెప్పాడు. 'శత్రువులకు ప్రవేశింపసాధ్యంకాని లంకాపట్టణంలో హనుమంతుడు నిర్లక్ష్యంగా ప్రవేశించి జనకుని కుమార్తెయైన సీతను చూచిపోయాడు. ఆతడు చైత్యప్రాసాదాన్ని పగులగొట్టి ఉత్తములైన చాలమంది రాక్షసుల్ని చంపాడు అతడు లంకా పట్టణాన్నంతా దహించి వ్యాకులంగావించాడు' - అని రావణుడు వారికి తెలిపినట్లు మూలకర్తవ్రాశాడు

మూలంలోని పైభావాన్ని వరదరాజు ఈక్రింది విదంగా పెంచాడు.

"అపుడు లంకాపురి-నా దశాననుఁడు
కుపితాత్ముఁడై తన-కొలువులో నున్న
యతిశౌర్య నిధులఁ బ్ర-హస్తాదులైన
హితమంత్రులను జూచి-యిట్లని పలికె
'హనుమంతుఁ డొక్కఁడే-యంబుధి దాఁటి
యనిమిషేంద్రుఁడు చూడ-నలవి కానట్టి
తనదు లంకారాజ-ధానిలోఁ జొచ్చి
జనకజతోడ ము-చ్చట మాటలాడి
యూరకే చనక నా-యుద్యాన కనక
భూరుహావళి సర్వ-మును నేలఁగూల్చి
వలదని వారింప-వనపాలకులను
బొలియించి ప్రాసాద-ము దుమారుచేసి

మంత్రి సూనులఁ బట్టి-మహిఁ బడఁగొట్టి
మంత్రుల నేవురి-మర్దించి మించి
యక్షకుమారకు-నాలంబులోన
శిక్షించి దానవ-శ్రేణి నడంచి
తోఁకఁ గాలిచి వెళ్లఁ-ద్రోలుఁడటన్న
కాఁకమై కొనకలం-కాపురం బెల్లఁ
గాలిచిపోయె రా-ఘవు దూతననియు
నేలిక సుగ్రీవుఁ-డిటు పంపెననియుఁ
జేరి చిల్విషమును-జేయుచుఁ గోఁతి
యూరెల్ల గాలిచి-యూరకే చనియె"[121]

హనుమంతుడు లంకలో చేసిన విధ్వంసంపట్ల రావణుడు సిగ్గుతో ఇంచుక తలవంచి ఆవిషయమై రాక్షసులతో ప్రస్తావించినట్లు మూలకర్త వ్రాశాడు. హనుమంతుడు లంకలో కావించిన భయంకరకార్యాన్ని గూర్చి తెలియగానే వరదరాజు రావణుడు కుపితాత్ముడైనాడు. దీనిని బట్టి మూలంలోని రావణుని కంటె వరదరాజు రావణుడు శౌర్యపరాక్రమాలు కలవాడని చెప్పవచ్చు. హనుమంతుడు, ఏడుగురు మంత్రులను, తదితర దానవశ్రేణిని సంహరించాడని, లంకనుంచి హనుమంతుణ్ణి పారద్రోలడానికి రాక్షసులు ఆతనితోకకు అగ్గిపెట్టగా లంకంతాకాల్చి పోయాడని వరదరాజు రావణుడు రాక్షసులకు తెలిపాడు. లంకాపట్టణాన్ని హనుమంతుడు దహించివేసినట్లు మూలం. దహించుటకుగల హేతువును వరదరాజు విశదీకరించినాడు రాక్షసులు హనుమంతుని తోకకు నిప్పంటించుట అనే విషయం తెలుగలో చోటుచేసికొన్నది ఈ వివరణ కావ్యానికి కొంత మెరుగును కల్పించింది.

2) ఇంద్రజిత్తు అంతర్థానుడై రామలక్ష్మణులమీద బాణాల్ని ప్రయోగించాడు. దానితో వారిదేహాలనుంచి నెత్తురు స్రవించింది. అప్పుడు ఇంద్రజిత్తు రామ లక్ష్మణులకు తనశౌర్యపరాక్రమాల్ని గూర్చి తెలుపడాన్ని మూలకర్త ఒకశ్లోకంలో వ్రాశాడు.

"శ్లో|| యుధ్యమాన మనాలక్ష్యం శక్రోఽపి త్రిదశేశ్వరః|
ద్రష్టుమాసాదితుంవాపి న శక్త కింపునర్యువామ్"||[122]

'నేను అంతర్థానమై యుద్ధం చేస్తుండగా దేవనాథుడైన ఇంద్రుడుకూడా నన్నుచూడడానికిగాని, సమీపించడానికిగాని సాహసించలేడు. ఇంక మీారు

నాముందు ఎంతటివారు' - అని ఇంద్రజిత్తు తనపరాక్రమాన్ని గూర్చి రామలక్ష్మణులకు తెలిపినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పైఖావాన్ని ఇలా విస్తరించాడు.

"అని యేల మీాకు రా-ఔధములార!
నను మార్కొనఁగలేఁడు-నాకేశుఁడైన
నింద్రునిఁ జెఱసాల-నిడిన యజేయుఁ
డింద్రజిత్తను మాట-నెఱుఁగరే మీారు
దైవంబు పెడఁబాప-దశకంఠుఁ జెనకి
యీా వానరులఁ గూడి-యిటకుఁ జేరితిరి.
చేఁజేత ననుభవిం-చితిరి తత్ఫలము
మీా జనకజ యిఁక-మీాఁద నెట్లగునొ
యేల వచ్చితిరని-యెకసక్కెమాడి
వోలవేయుదు శర-వ్యూహంబు చేతఁ
దనువులు జర్ఝరి-తములుగాఁజేసి
పెనురక్తధారలు-పృధివీధరముల
ఓలముల ఝరములు-బ్స్రవించు లీల
వెలువడి ప్రవహింప-విబుధులు బెదర"[123]

వరదరాజు ఇంద్రజిత్తు రామలక్ష్మణుల్ని 'రాజధములారా'! అని నీచసంబోధన చేశాడు. 'దైవం పెడరేపగా మీారు దశకంఠుని ఎదుర్కోడానికి వానరులతో ఏహాడి వచ్చా'రని 'చేజేతులారా ఆఫలితాన్ని అనుభవించా'రని, 'ఇకమీాదట మీాసీత ఏమౌతుందో'నని ఇంద్రజిత్తు చాలచులకనగా మాట్లాడాడు. అయితే మూలంలోని ఇంద్రజిత్తు రామలక్ష్మణులతో చాలా హుందాగా వ్యవహరించాడు.

3) రామలక్ష్మణులు మూర్ఛపోవటం చూచిన విభీషణుడు, తనకు లంకా రాజ్యం ప్రాప్తించదని దుఃఖించాడు. అప్పుడు సుగ్రీవుడు విభీషణునికి ధైర్యం చెప్పడం మూలంలో రెండుశ్లోకాల్లోవుంది.

"శ్లో|| రాజ్యం ప్రాప్స్యసి ధర్మజ్ఞ! లఙ్కాయాం నాత్ర సంశయః|,
రావణ స్సహపుత్త్రేణ సకామం నేహ లప్స్యతె||
న రుజాపీడితా వేతా వుభౌ రాఘవలక్ష్మణౌ|,
త్యక్త్వా మోహం వధిష్యేతే సగణం రావణం రణే"||[124]

'ధర్మవేత్తవైన విభీషణుడా! నీవు లంకా రాజ్యాన్ని పొందగలవు. ఇందులో సందేహంలేదు. రావణుడు, ఆతని కుమారుడు యుద్ధంలో విజయాన్ని పొందలేరు. రామలక్ష్మణులు మూర్ఛనుండి తేరుకొని యుద్ధంలో రాక్షస సమేతంగా రావణుణ్ణి వధిస్తారు' - అని సుగ్రీవుడు విభీషణునకు చెప్పినట్లు మూలకర్త వ్రాశాడు.

వరదరాజు మూలంలోని పైభావాన్ని ఇలాపెంచి రచించాడు.

"ఇంతయేఁటికి నీకు-నేమిటఁ గొఱత?
చింతిల్ల మనకేల-శ్రీరాముఁ జూచి
జానకీ రమణుఁడు-సహియించెఁగాక
ఈ నాగపాశంబు-లివియేమి సేయు?
ఇదె సేదఁదేఱెడు-నినుఁ డుదయింపఁ
గదనంబులో దశ-కంధరుఁ దునిమి
యీలంక నీకిచ్చి-యిల పత్నిఁగూడి
యేల నున్నాఁడు మ-హీచక్రమెల్ల
మనవంటి వారల-మనసులఁ జూడఁ
గనుమూసి యున్నాఁడు-గాక రాఘవుఁడు!
దొడిఁగిన యొకకోలఁ-దునుమఁడే యలిగి
గడియలో మూఁడులో-కములు చూర్ణముగ
రాఘవామోఘ నా-రాచ ధారలకు
మేఘంబు లడ్డమే-మేఘముల్ మఱుఁగు
చేసి నిల్చిన యింద్ర-జిత్తునిఁ దునుమఁ
గోసలేంద్రునకు నె-క్కుడు ప్రయోజనమె?
ఏమి చింతించెనో-యిటులున్నవాఁడు
రాముఁ డీమీఁద స-ర్వము నెఱింగెదవు "[125]

సుగ్రీవుడు విభీషణునితో 'మనమనస్తత్వాన్ని తెలిసికొనడానికి రాముడు కన్నుమూసియున్నాడు. ఆయన నిజంగా మూర్ఛపోలే'దని తెలిపాడు. 'రాఘవుడు ఒకఘడియలో మూడులోకాల్ని చూర్ణంచేయగలడు. మేఘాల చాటునవుండే ఇంద్రజిత్తును చంపడానికి రామునికి మేఘాలు అడ్డంకావు' - అని సుగ్రీవుడు రాముని శౌర్యపరాక్రమాల్నిగూర్చి విభీషణునికి తెలిపినట్లు వరదరాజు వ్రాశాడు.

రామలక్ష్మణులు మూర్ఛనుంచి తేరుకొని యుద్ధంలో రాక్షససమేతంగా ప్రతినాయకుడైనరావణుని సంహరించగలరని మూలకర్తతెలిపాడు. అయితే వరదరాజు తన అనువాదంలో రాముని పరాక్రమాన్ని విశదపరుస్తూ ఇంద్రిజిత్తును

సంహరించగలడని, మాయాలోకాల్ని భస్మంచేయగలడని తెలిపాడు. కానిరావణ ప్రశస్తిలేదు.

రామలక్ష్మణుల్ని మూర్ఛపడునట్లు చేసింది ఇంద్రజిత్తు. ఆ ఇంద్రజిత్తును రాముడు సంహరించగలడని విభీషణునకు సుగ్రీవుడు తెలిపాడు. మూడు లోకాలు భస్మంజేయగల రాముని చేతిలో రావణుడు మరణించగలడని సూచన.

ఇంద్రజిత్తు మేఘాల మధ్యవుండి రామలక్ష్మణుల్ని మూర్ఛపోవునట్లు చేసినందువలన విభీషణుడు బాధపడ్డాడు అందువల్ల మేఘాలలోవున్న ఇంద్రిజిత్తును రాముడు జయించగలడని సుగ్రీవుడు విభీషణునికి ధైర్యం చెప్పటం ఎంతైనా సమంజసంగా ఉంది.

4) కుంభకర్ణునివల్ల ప్రాణహానికలుగుతున్నందుచేతతాము యుద్ధరంగంవదలి వెళ్లిపోతున్నట్లు వానరులు అంగదునితో తెలిపారు. ఈ విషయంమూలకర్త ఒక శ్లోకంలో రచించినాడు.

"శ్లో|| కృతం నః కదనం ఘోరం కుమ్భకర్ణేన రక్షసా|,
న స్థానకాలో గచ్ఛామో దయితం జీవితం హి నః"||[126]

౦రదరాజు మూలంలోని పైభావాన్ని విస్తరించాడు

"నిలు నిలు మనిపల్క-నీకేల? మమ్ము
తెలియవే ప్రాణముల్-తీపౌను కాదా!
ఎక్కడి రణము మా-కేఁటికి రాముఁ
డెక్కడ బోయిన-నేమి మాకేల?
దయ్యమువలె వీఁడు-తరుముక మ్రింగ
వెయ్యెన నెదిరింప-వెఱతుము మేము
మాటవాసి యదెల్ల-మంటి పాలయ్యె
చాటి చెప్పెద మింకఁ - జాలు మా కొలువు
మాతండ్రితోడు న-మ్మించకు పాప
జాతి చావొట్టుగా -సములు వెట్టెదవె?
ఇపుడు దప్పినఁజాలు-నిటమీఁదఁ దమకు
నపకీర్తియైన నే-మైన నౌఁగాక
మఱిరామనుమాట - మాత్రమే వాని
తిరిగి చూచిన యంతఁ-దీఱు ప్రాణములు
నీతోడి మొగమాట-నిలువలేమనుచుఁ"[127]

కుంభకర్ణునివల్ల ప్రాణభయంతో వానరులు యుద్ధరంగాన్ని వదిలి వెళ్ళదలచినట్లు మూలకర్తవ్రాశాడు. మూలంలోని వానరులు యుద్ధంకంటే తమ ప్రాణాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. అనువాదంలో వానరులు యుద్ధం కంటే, రామునికంటే, యుద్ధం చేస్తేవచ్చే కీర్తిప్రతిష్ఠలకంటే తమ ప్రాణాలేమిన్న అని అంగదునితో తెలిపారు. దీన్నిబట్టి రామాయణ కాలంనాటి కంటే వరదరాజు రామాయణ కాలంనాటికి మానవుని ఆలోచనావిధానంలో వచ్చినమార్పును మనం గమనించవచ్చు. ప్రాణభీతితో వానరులు రణరంగం నుండి వైదొలగ దలచినట్లు మూలం. కీర్తి, అపకీర్తుల ప్రసక్తి మూలంలోకానరాదు. అనువాదంలో 'మాటతప్పినను, అపకీర్తిచేకూరినను, 'నమ్మినరాముడు' ఏమైనను మాకు చింతలేదు. మేమురణరంగం ఏదలదలచితి'మని అనువాదంలో అంగదునితో వానరులు స్పష్టంచేశారు.

పై విషయాన్ని నిశితంగా పరిశీలిస్తే మనకు కొన్నివిషయాలు అవగాహన కాగలవు. వాల్మీకికాలం నాటికన్న వరదరాజు కాలంనాడు సైన్యాన్ని ఎక్కువ మభ్యపెట్టేవారని గ్రహించవచ్చు యుద్ధంలో మరణించిన వారికి స్వర్గం సంప్రాప్తించునని ఆశపెట్టడం, ఆ ఆశతోవారు యుద్ధోన్ముఖులగుట వరదరాజు కాలంలో కలదని గ్రహించవచ్చు. అట్లే నమ్మినరాజుకోసం ప్రాణత్యాగం చేయడం మొదలగు నీతులతో సైన్యాన్ని వశంలో వుంచుకొనే వారని కూడ గ్రహించవచ్చు.

సమాజంలో నీతి తగ్గిపుడే నీతులు ఎక్కువగా కవులు ప్రబోధించవలసిన ఆవశ్యకత ఏర్పడుతుంటుంది. వరదరాజు కాలంనాటికి ఈ ప్రబోధాలు అధికంగా వున్నట్లు తెలుస్తుంది మొత్తంమీద వాల్మీకి కాలంనాటి కన్నా వరదరాజు కాలంనాటికి మానవునిలో నైతిక విలువలు తగ్గినట్లు వెల్లడౌతున్నది.

### 2.6 2 మూలసంక్షేపాలు

1) లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరింపగా వానరులు, బ్రాహ్మణులు, ఋషులు, ఆకాశంలో దేవతలు, గంధర్వులు, అప్సరసలు సంతోషించిరనే విషయాన్ని మూలకర్త ఆరుశ్లోకాల్లో తెలిపాడు.

"శ్లో|| సఋభూవ మహాతేజా వ్యపా స్తగత జీవితః,

................ ..............

................ ...... ..........

ఊచుశ్చ సహితా స్సర్వే దేవగన్ధర్వదాన వాః"[128]

"కురిసెను పైనుండి-కుసుమ వర్షంబు
మోఱసె వైయచ్చర-మురవ దుందుభులు
ఆడిరి రంభాదు-లైన యచ్చరులు
పాడిరి నారద-ప్రముఖ గాయనులు
పొగడిరి మౌనులు-బ్బుచుఁ జేరవచ్చి
మగిడిరి భీతి స-మస్త దానవులు
చల్లగా వీచెను-చందనానిలము
తల్లడంబులు మాని-ధరణీసురులకుఁ
గపులెల్ల నానంద-కలితులై రపుడు
జపహోమ యోగముల్-జగతిపై మొలచె"[129]

ఈ విషయానికి సంబంధించి మూలంలో పునరుక్తి చోటుచేసికొంది. ఈపునరుక్తి తొలగించడానికే వరదరాజు మూలాన్ని సంక్షేపించాడని భావించవచ్చు. ఇంద్రజిత్తు హతుడుకాగానే దేవతలు సంతోషించిన విషయం మూలంలో పునరుక్తమయినది. ఆవిషయాన్ని వరదరాజు 'పైనుండి కుసుమవర్షం కురిసిం'దని ఒక్కద్విపద పంక్తిలో చెప్పాడు. వరదరాజు మూలసంక్షేపంలో స్పష్టతతోపాటు పునరుక్తిదోషం నివారితమైనందువల్ల ఇదికావ్యరామణీయకానికి ఎంతో దోహదంచేసింది.

2) రావణుడు వెయ్యిబాణాల్తో రాముని నొప్పించాడు. మొదలేకుపితుడైవున్న రాముడు, ముఖంలో బొమముడి యొప్ప కన్నుల్లో ఎఱ్ఱదనంకనపడగా చూపుల్తో ప్రపంచాన్ని దహించేవానివలె అత్యుగ్రుడై మహాకోపాన్ని వహించాడు. అప్పుడు రామునిముఖాన్ని చూసిన చరాచర ప్రకృతి ఏవిధంగాక్షోభ చెందిందో మూలకర్త ఆరుశ్లోకాల్లో వ్రాశాడు.

"శ్లో|| తస్య క్రుద్ధస్య వదనం దృష్ట్వా రామస్య ధీమతః|

..............................................

..............................................

[illegible] ప్రహారక్తై ర్భీమై ర్ఘోరయో స్సంప్రయుధ్యతోః||"[130]

[illegible] క్రుద్ధుడైన ఆరాముని ముఖంచూచి సమస్త భూతాలు [illegible] [illegible] చెందింది. పర్వతాలు, వృక్షాలు చలనంచెందాయి. [illegible] క్షోభచెందాడు. ఆకాశంలో ఘోరమైన ధ్వనిచేసే పక్షులు,

పరుషములైన మేఘాలు మహోత్పాత సూచకములైన ధ్వనుల్ని చేస్తూ అంతటా విహరించాయి. ఈ ఉత్పాతాల్ని చూచిన రావణుడు కూడా భయ పడ్డాడు. అప్పుడు శూరులైన ఆ రామరావణులు నానావిధ భయంకరాయుధాలతో చిత్రంగాపోరాడినారు. లోకప్రళయ భీకరమైన ఆమహాయుద్ధాన్ని దేవతలు, గంధర్వులు, మహర్షులు, దానవులు, దైత్యులు, విమానగతులై ఆకాశంనుంచి చూస్తూ వుండినారు' - అని మూలకర్త రచించాడు.

వరదరాజు మూలంలోని శ్లోకాన్ని సంక్షేపించి ఇలారచించాడు.

[illegible]

[illegible] నక్షత్రముల్ - సింధువులుగలఁచె

భూతకోటి వడంకె-బురుహూత ముఖుల

చేతోవికాసముల్-చేరెఁగ్రమ్మఱను"[131]

అని మూలంలోని ఆరుశ్లోకాల భావాన్ని నాల్గు ద్విపదపంక్తుల్లో రచించాడు.

వరదరాజు ఇక్కడ మూలంలోని నాలుగు, ఐదు శ్లోకాలభావాన్ని పూర్తిగా పరిహరించాడు. మొదటి శ్లోకం యొక్క భావం నాల్గవ శ్లోకంలో పునరుక్తిగా వుందని భావించి ఆయన ఆ శ్లోకాన్ని పరిహరించి వుండవచ్చు. 'రామరావణుల యుద్ధాన్ని దేవతలు, గంధర్వులు, మహర్షులు, దానవులు, విమానగతులై ఆకాశంనుంచి చూస్తూవుండినారు' - అని మూలంలోవున్న ఐదవ శ్లోకాన్ని కూడ వరదరాజు పరిహరించాడు. 'దైవస్వరూపుడైన రాముడు, మహత్తర బలపరాక్రమాలు కలిగిన రావణుడు ఈయిరువురి మధ్య జరిగే యుద్ధాన్ని దేవతలు, గంధర్వులు, మహర్షులు, దానవులు ఆకాసం నుంచి చూశా'రనే విషయం వరదరాజు శ్రీరామాయణంలో అనువదించక పోవడంవల్ల కొంత వెలితిగాతోస్తూవుంది.

### 2.6.3 మూలానుసరణలు

1) ధాన్యమాలికుమారుడైన అతికాయునివృత్తాంతాన్ని గురించి విభీషణుడు శ్రీరామునికి తెలిపాడు. ఈ విషయం మూలంలో ఏడుశ్లోకాల్లోవుంది.

"శ్లో|| యస్య బాహూ సమాశ్రిత్య లఙ్కా వసతి నిర్భయా|,

.........................................

.........................................

పురా వానరసైన్యాని క్షయం నయతి సాయకైః||"[132]

అతికాయుని వృత్తాంతాన్ని గూర్చి విభీషణుడు శ్రీరామునితో, 'ఇతడు ధాన్యమాలి కొడుకైన అతికాయుడు. ఇతని బాహుబలంతోనే లంకాపురి నిర్భయంగా వుంది. ఇతడు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి దివ్యాస్త్రాల్ని పొంది శత్రువుల్ని జయించాడు. ఈ అతికాయుడు దేవాసురుల వల్ల సంహరింపబడకుండా వుండేందుకు ఇతనికి బ్రహ్మదేవుడు దివ్యకవచాన్ని, సూర్య ప్రకాశమైనరథాన్ని అనుగ్రహించాడు. ఇతడు అనేకసార్లు దేవదానవుల్ని జయించాడు. యక్షుల్ని వధించాడు. ఈ అతికాయుడు దేవేంద్రుని వజ్రాయుధాన్ని స్తంభింపజేశాడు. వరుణుని పాశాన్ని ప్రతిహతంగావించాడు. కాబట్టి ఇతని విషయమై శ్రీఘ్రంగా ప్రయత్నంచేయుము. లేకపోతే ఇతడు బాణాల్తో వానరసైన్యాల్ని నశింపచేస్తాడు' - అని చెప్పాడు.

వరదరాజు మూలంలోని పైవిషయాన్ని తన శ్రీరామాయణంలో యథాతథంగా అనువదించాడు.

"ఇతఁడు రావణపుత్రుఁ-డీతనికి నామ
మతికాయుఁడంద్రు వీఁ - డసమాన బలుఁడు
మాయన్నకును ధాన్య-మాలినియందు
నీయన జనియించె-నింద్రాదులకును
వీఁడజేయుఁడు ధాత-వీనికి నిచ్చె
వేఁడి నవరములు-విండ్లు, నమ్ములును
కవచతూణీరముల్-ఖడ్గముల్, రథము
నవనిజా రమణ! వీఁ-డతుల విక్రముఁడు
వరుణ పాశము నింద్రు-వజ్రాయుధంబు
హరునిశూలమునుఁ-గాలాంతకు గదయు
వీనిపైఁ గొఱఁగావు - వీని యస్త్రంబు
లానిలింపులకెల్ల - నాపత్కరములు,
అందఱితోఁ బోరు - నటు గాదు వీని
ముందఱ నెదిరింప-ముక్కాఁక యగును!"[133]

2) రావణుని మరణానికి విభీషణుడు దుఃఖించాడు. అతణ్ణి రాముడు సముదాయించిన విషయం మూలంలో ఆరుశ్లోకాల్లో వుంది.

"శ్లో॥ నాయం వినష్టో నిశ్చేష్ట స్సమరే చణ్డవిక్రమః।

..................................

..................................

యదిహానన్తరం కార్యం కల్ప్యాం తదను చిన్తయ॥"[134]

రాముడు విభీషణునితో, 'ఈ రావణుడు యుద్ధం చేయకుండా పిరికివానివలె నశించలేదు. యుద్ధంలో భయంకరమైన పరాక్రమంతో మహోత్సాహంగా పోరి నిర్భయంగా హతుడయ్యాడు. శూరధర్మాన్ని అవలంబించి యుద్ధంలో నిర్భయంగా హతులైన మహాపురుషుల్ని గూర్చి దుఃఖించరాదు.

యుద్ధంలో దేవేంద్రసహితంగా ముల్లోకాలు ఎవరికి భయపడునో అట్టి మహాపరాక్రమశాలి, యశస్సంపన్నుడునైన రావణుడు కాలధర్మంచెందినపుడు దుః ఖించడం యుక్తంగాదు. శూరుడైనవాడు యుద్ధంలో జయాపజయాల్ని సమానంగా తీసికొంటాడు. యుద్ధంలో హతుడైన శూరుడు వీరస్వర్గం పొందుతాడు. కాబట్టి అతణ్ణి గురించి దుఃఖించరాదని శాస్త్రనిర్ణయం. పుట్టిన వానికి మరణం తప్పదనే పరమార్థాన్ని నీవు తలచుకొని ఇప్పుడు చేయవలసిన కార్యాల్ని గురించి ఆలోచింపు'మని చెప్పాడు.

వరదరాజు మూలంలోని వైభావాన్ని యథాతథంగా ద్విపదీకరించాడు.

"ఏల విభీషణ! - యింత శోకింప
నాలంబులోన మీ-యన్న పాటునకు?
చనునె శక్తిత్రయ - సంపన్నుఁడతుల
ధనురాగమాత్మ ప్ర-తాపవైభవుఁడు
ఇతనికి వగతురె - యితనితో నెదుర
నితరుల తరమె యే-నింతియె కాక?
ఏనైన నెదిరింతు - నేయధర్మంబు
వీనికి లేకున్న-విలుకేల నంది
చంపిన నేమి తాఁ - జచ్చిన నేమి
తెంపున నిటుగడ - తేఱంగ వలదె
ఘనుఁడు క్షత్రాచార-గరిమమంతయును
తనపాల నిడుకొన్న - ధన్యుఁడితండు
మీయన్న బిరుదంబు-మ్రింగి తోఁబొలిసె
నీయన సామాన్యుఁ-డే త్రిలోకములఁ
బోరఁజేతుల కొట్టి-పోరాడి యితఁడు
చూరవట్టెడు స్వర్గ-సుఖములన్నియును
నెన్నాళ్ళు బ్రతికిన - నేమి యన్నిటికి
నున్నవాఁడితఁడన్యు-లుండియు నేల
పరలోకవిధులు దీ-ర్పక చింతఁబొరలు
తరిగాదు నీకు క-ర్తవ్యమై యునికి"[135]

### 2.6.4 కల్పనలు

1) వానరసైన్యం యొక్క రహస్యాల్ని తెలిసికొమ్మని రావణుడు తన మంత్రులైన శుకసారణులను పంపాడు. వారు వానరసైన్యంలో ప్రవేశించి అక్కడి విషయాల్ని తెలిసికొని రావణుని వద్దకువెళ్ళారు. అప్పుడువారు రావణునితో,'రాక్షసనాథుడవైన రావణుడా! మేము వానరసైన్యంలో ప్రవేశించిన పిదప విభీషణుడు మమ్మల్ని పట్టుకొని రాముని వద్దకు తీసికొని పోయాడు. ధర్మాత్ముడు మహానుభావుడైన రాముడు మమ్మల్నిదయతో విడిచి పెట్టాడు' - అని చెప్పినట్లు మూలకర్త ఒకశ్లోకంలో తెలిపాడు.

"శ్లో|| విభీషణగృహీతౌ తు వధార్హౌ రాక్షసేశ్వర!,

దృష్ట్వా ధర్మాత్మనా ముక్తౌ రామేణామితతేజసా||"[136]

మూలంలో పైవిధంగా వుండగా వరదరాజు క్రింది విధంగా కల్పించి వ్రాశాడు.

"ఈ విభీషణుడు మీ-కేమిటి కితఁడు
రావణద్రోహి ధ-ర్మముఁదప్పినాడు.
అన్నదమ్ముల కెడ-రైన విరోధి
నిన్నుఁజేరినవాఁడు-నీదు హితుండె
వాలినిఁజంపి యా-వాలి రాజ్యంబు
పాలించ సుగ్రీవుఁ-బట్టంబు గట్టి
చేపట్టి నాఁడని-చేరెను మిమ్ము
కాపట్యమున హిత-కారియే మీకు?
అన్నకుఁగానివాఁ-డన్యుల కగునె?
విన్నవింపక కాదు-వీర లిర్వురును
పలికించిన స్వకార్య-పరులింతె కాక
పరమార్థమగు మీకు-పనులకు రారు"[137]

మూలంలోని శుకసారణలు రావణుని వద్ద అతని శత్రువైన రాముణ్ణి గురించి ధర్మాత్ముడు, మహానుభావుడుఅని పొగిడారు. వరదరాజు శుకసారణులు చాలాతెలివిగా లౌక్యంగా రాముని మెప్పు పొందడానికి ప్రయత్నించారు. వారు విభీషణుని నిందించినారు. 'రావణద్రోహి, ధర్మం తప్పినవాడైన విభీషణుడు మీకుహితుడా'? అతడు సుగ్రీవునివలె రాజ్యకాంక్షతో మీ వద్దకు చేరిన కపటి' అని రామునితో అన్నట్లు రావణునికి చెప్పారు.

పై కల్పన వరదరాజు కాలంనాటి రాజనీతి చాతుర్యానికి, మిత్రభేద నైపుణ్యానికి అద్దం పట్టుతూవుంది.

2) యుద్ధంలో మకరాక్షుడనే రాక్షసుడు మృతిచెందాడని తెలియగానే రావణుడు కుపితుడైనాడు. రామలక్ష్మణుల్ని వధించమని ఆతడు తన కుమారుడైన ఇంద్రజిత్తునకు ఆజ్ఞాపించాడు. అప్పుడు రావణుడు ఇంద్రజిత్తు బలపరాక్రమాల్ని పొగడిన విషయం మూలంలో రెండుశ్లోకాల్లోవుంది.

"శ్లో|| జహి వీర! మహావీర్యౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,|
అదృశ్యో దృశ్యమానో వా సర్వథా త్వం బలాధికః||
త్వ మప్రతిమకర్మాణ మిన్ద్రం జయసి సంయుగే,|
కిం పున ర్మానుషౌ దృష్ట్వా న వధిష్యసి సంయుగే||"[138]

రావణుడు ఇంద్రజిత్తుతో 'వీరుడా! మహాపరాక్రమశాలురు, అన్నదమ్ములు అయిన రామలక్ష్మణుల్ని నీవువధించుము. నీవు మాయచే అదృశ్యుడవై యుద్ధం చేసినా లేక దృశ్యుడవై యుద్ధం చేసినా బలంలో వారి కన్నావు అధికుడవు. నీవు ఇంద్రు నంతటివాణ్ణి యుద్ధంలో జయించావు. ఇకమనుష్యులైన రామలక్ష్మణుల్ని జయించడం నీకు ఒకలెక్కా? వారిని తప్పకుండా వధిస్తావు' - అని ప్రశంసించాడు.

వరదరాజు మూలంలోని పైభావాన్ని స్వతంత్రకల్పనతో మార్పుచేశాడు.

"నాకు హితంబుగా - నమ్మించి పోయి
నందఱుఁ జంపితి-నని వచ్చి యిచట
మందలించెద వభి-మానంబు మాని
పోయిన వారెల్లఁ-బొలియుటే కాని
నీయట్లు బొంకువా-ని నెఱుంగ నొకని
చావఁ బ్రాల్మాలి యి-చ్చట నిల్లు మఱిగి
యీాపు వచ్చు పెఱంగి-యెఱుఁగంగలేక
మహామునుల నిన్నుఁ బం-పఁగ నెగ్గు సిగ్గు
లెఱుఁగక నీమొగ-మేను జూచెదను
యీమాట తలఁచక - నేఁగ మున్నట్లు
రాము గెల్పించెదని-యమ్మ నీకేమి
చేకన్న కార్యంబు-సేయు మనవయు
మేకొంట దిక్కు లే-మని తండ్రనగుట."[139]

మూలంలోని రావణుడు, తనకుమారుడైన ఇంద్రజిత్తు బలపరాక్రమాల్లో ఇంద్రునికంటె గొప్పవాడని ప్రశంసించి యుద్ధంలో రామలక్ష్మణుల్ని వధించమని అతణ్ణి ఆజ్ఞాపించాడు. వరదరాజు రావణుడు ఇంద్రజిత్తును, యుద్ధంలో చనిపోవడానికి ప్రాల్మాలి అందరిని చంపినట్లు బొంకులాడినవాడని దూషించాడు. అలాగే 'నేను దిక్కులేని తండ్రిని కావడంవల్ల ఎగ్గుసిగ్గులేకుండా నిన్ను మళ్ళీయుద్ధానికి పొమ్మని చెప్పుతున్నా'నని ఇంద్రజిత్తుకు తెలిపి బాధపడ్డాడు. తెలుగు రావణుడు తనకుమారుని ప్రాణంకన్నా తాను యుద్ధంలో గెలవడమే ప్రధానంగా భావించినవాడుగా చిత్రింపబడ్డాడు. శత్రుబలంపైచేయిగా ఉన్నప్పుడు నాయకులు తమవైపు వీరుల్ని మాటల్తో రెచ్చగొట్టిపంపడం తెలుగుదేశంలో అలవాటుగా ఉండేది. ఈ అలవాటును చక్కగా ఎఱిగినందువల్లనే ఈ రాజకవి ఇంద్రజిత్తునుద్దేశించి రావణునినోట అటువంటి ములుకుల్లాంటి పలుకుల్ని పలికించాడు ఈ విధంగా రావణుడు ఇంద్రజిత్తును నిందించడం రావణుని శీలానికి మెరుగుపెట్టదని చెప్పవచ్చు. కొడుకుయొక్క బలపరాక్రమాలు తెలిపిన రావణుడు 'చావడానికి ప్రాల్మాలి అసత్యం చెప్పుతున్నావని' కుమారుణ్ణి నిందించడం ఒకవిధంగా ఔచిత్యానికి వెలితిగా నున్నట్లు పైకి కనిపించినా, ఈకల్పన దేశకాలానుగుణమైనదని చక్కగా సమర్థించవచ్చు.

# సంఖ్యా సూచిక

1. శ్రీరామాయణము, కట్టావరదరాజకృతము, బాల అయోధ్యా కాండములు, మద్రాస్ గవర్నమెంట్ ఓరియంటల్ సిరీస్, నం. ఎల్, పుటలు, 35-36, పంక్తులు, 846-867
2. శ్రీమద్రామాయణము, బాలకాండము, ఆంధ్ర తాత్పర్యసహితము, శ్రీచదలవాడ సుందరరామ శాస్త్రులు, వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 1960 పుట, 200, 23వ సర్గ, 2 వ శ్లోకము.
3. శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 86-87, పంక్తులు 2076 - 2100
4. శ్రీమద్రామాయణము, బాలకాండము, పుట 216, 26 వసర్గ, 6,7 శ్లోకాలు
5. శ్రీమద్రామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 93-94, పంక్తులు 2244 - 2260
6. శ్రీమద్రామాయణము, బాలకాండము, పుట 438, 63 వసర్గ, 6 వ శ్లోకము.
7. శ్రీరామాయణము, బాల అయోద్యాకాండములు, పుట 189, పంక్తులు, 4555 - 4570
8. శ్రీమద్రామాయణము, బాలకాండము, పుట 432, 62 వ సర్గ, 14 వ శ్లోకము.
9. శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 185 - 186, పంక్తులు 4473 - 4494
10. శ్రీమద్రామాయణము, బాలకాండము, పుట 500, 73 వ సర్గ, 9 వ శ్లోకము.
11. శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 218 - 219, పంక్తులు 5273 - 5294
12. శ్రీమద్రామాయణము, బాలకాండము, పుట 504, 73 వ సర్గ, 25 వ శ్లోకము
13. శ్రీరామాయణము, బాలఅయోధ్యాకాండములు, పుట 221, పంక్తులు 5333 - 5352
14. శ్రీమద్రామాయణము, బాలకాండము, పుటలు 84, 86, 88, 7 వ సర్గ, 1-17 శ్లోకాలు.
15. శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 39 - 40, పంక్తులు 941 - 958
16. శ్రీమద్రామాయణము, బాలకాండము, పుటలు 124, 126, 13 వ సర్గ, 18-26 శ్లోకాలు.

48 శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 60, 5 వ సర్గ, 16 - 21 శ్లోకాలు.

49 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 264, పంక్తులు 501 - 510

50 శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 518, 49 వ సర్గ, 9 - 14 శ్లోకాలు.

51 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 443, పంక్తులు 4861 - 4869

52 శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుటలు 724, 726, 70 వ సర్గ, 7 - 10 శ్లోకాలు.

53 శ్రీరమాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 520, పంక్తులు 6721 - 6724

54 శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుటలు 4,6, 1 వ సర్గ, 9 - 15 శ్లోకాలు.

55 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు పుటలు 244 - 245, పంక్తులు 35 - 54

56 శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుటలు 466, 468, 41 వ సర్గ, 2 - 5 శ్లోకాలు.

57 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 424, పంక్తులు 4395 - 4408

58 శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 166, 13 వ సర్గ, 5వ శ్లోకము.

59 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 305, పంక్తులు 1517 - 1520

60 శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 1112, 119 వ సర్గ, 19 - 21 శ్లోకాలు.

61 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 684 - 685, పంక్తులు 10679 - 10693

62 శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 70, 7వసర్గ, 2-6 శ్లోకాలు.

63 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 267, పంక్తులు 587 - 590

64 శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 174, 14వసర్గ, 4 -7 శ్లోకాలు.

65 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 308, పంక్తులు 1519 - 1599

66 శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, పుట 222, 31వ సర్గ, 23 - 26 శ్లోకాలు

67 శ్రీమారామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుట 108, పంక్తులు 2534 - 2551

68 శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, పుట 346, 47 వసర్గ, 31 వశ్లోకము.

69 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 169 - 169, పంక్తులు 3990 - 4003

70 శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, పుట 354, 48 వసర్గ, 7-9 శ్లోకాలు.

71 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 172 - 173, పంక్తులు 4083 - 4102

72 శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, పుట 148, 21 వసర్గ, 2 - 5 శ్లోకాలు.

73 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 74 - 75, పంక్తులు 1749 - 1754

74 శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, పుట 312, 43 వసర్గ, 40 - 44 శ్లోకాలు.

75 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 151 - 152, పంక్తులు 3582 - 3590

76 శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, పుట 22, 4 వసర్గ, 12 - 17 శ్లోకాలు.

77 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 11 -12, పంక్తులు 241 - 268

110 శ్రీమద్రామాయణము, సుందరకాండము, పుటలు 256, 258, 20 వసర్గ, 30 - 36 శ్లోకాలు.

111 శ్రీరామాయణము, సుందంకాండము, పుట 73, పంక్తులు 1735 - 1742

112 శ్రీమద్రామాయణము, సుందరకాండము, పుట 284, 24 వసర్గ, 7 - 12 శ్లోకాలు.

113 శ్రీరామాయణము, సుందంకాండము, పుటలు 83 - 84, పంక్తులు 1965 - 1982

114 శ్రీమద్రామాయణము, సుందరకాండము, పుట 412, 37 వసర్గ, 19 - 21 శ్లోకాలు.

115 శ్రీరామాయణము, సుందరకాండము, పుట 126, పంక్తులు 2983 - 2993

116 శ్రీమద్రామాయణము, సుందరకాండము, పుట 50, 1 వసర్గ, 126 - 129 శ్లోకాలు.

117 శ్రీరామాయణము, సుందరకాండము, పుట 9, పంక్తులు 181 - 186

118 శ్రీమద్రామాయణము, సుందరకాండము, పుట 62, 1 వసర్గ, 165 - 171 శ్లోకాలు.

119 శ్రీరామాయణము, సుందరకాండము, పుట 12, పంక్తి 270

120 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుట 54, 6 వసర్గ, 1-3 శ్లోకాలు.

121 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 20, పంక్తులు 433 - 454

122 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుటలు 392, 394, 45 వసర్గ, 11 వశ్లోకము.

123 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 179, పంక్తులు 3985 - 3998

124 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుట 434 50 వసర్గ, 21 - 22 శ్లోకాలు

125 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 197, పంక్తులు 4409 - 4426

126 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుట 636, 66 వసర్గ, 30 వశ్లోకము

127 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 278, పంక్తులు 6275 - 6289

128 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుటలు 968, 970, 91 వసర్గ, 87 - 92 శ్లోకాలు.

129 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 386, పంక్తులు 8805 - 8816

130 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుట 1088, 104 వసర్గ, 1-6 శ్లోకాలు.

131 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 431, పంక్తులు, 9823 - 9826

132 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుట 726, 7 వసర్గ, 30 - 36 శ్లోకాలు.

133 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 311, పంక్తులు 7037 - 7050

134 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుట 1154, 112 వసర్గ, 15 - 20 శ్లోకాలు.

135 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుటలు 457, 458, పంక్తులు 10421 - 10440

136 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుట 224, 25వ సర్గ, 28 వశ్లోకము.

137 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 111, పంక్తులు 2480 - 2491

138 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుట 840, 80 వసర్గ, 3 - 4 శ్లోకాలు

139 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 351, పంక్తులు 7962 - 7974



## ప్రకరణము - 3

# వరదరాజు కవితా వైశిష్ట్యం

### 3.1. వరదరాజు పాత్ర చిత్రణాకౌశలం :

కావ్యంలో ఇతి వృత్తానికి, రసభావాలకు, పాత్రలకు గల సంబంధాన్ని గుర్తించకుండా పాత్ర చిత్రణ గురించి తెలుపడం కుదరదు. పాత్రలు కథాగతికి అవలంబనాలు. సన్నివేశ కల్పనానికి పాత్రయే సాధనం. ఇతి వృత్తం పాత్రల నాశ్రయించి మాత్రమే ఉంటుంది. పాత్రల సంభాషణల్ని బట్టి పాఠకుడు కథాగమనాన్ని తెలిసికొంటాడు. కావ్యంలో గుణాలంకారాదులు పాత్ర మనస్తత్త్వాన్ని అనుసరించి ఉంటాయి

కవి పాత్రల్ని కథాభిముఖంగా పోషించుతూ కావ్యర్థమైన రసాన్ని పరిపుష్టం చేస్తాడు. కావ్యరసాన్ని బట్టే పాత్రపోషణ జరుగుతుంది ఏ పాత్రైనా అది తన స్వభావానికి అనుగుణమైన పనుల్ని చేసినట్లు మాత్రమే కవి చూపాలి. కాని స్వభావ వ్యతిరేకమైన కార్యములను చేసినట్లు చూపరాదు.

#### 3.1.1 పాత్ర పోషణ పద్ధతులు :

పాత్రపోషణలో స్వరూప వర్ణన, స్వభావ వర్ణన అని రెండు విధాలు. స్వరూప వర్ణన అనగా శారీరక వర్ణన స్వభావ వర్ణన అనగా మానసిక వర్ణన ఒకటి తను ప్రధానమైనది. మరియొకటి గుణ ప్రధానమైనది. 'ఒకటి పాంచ భౌతిక పరిణామ వర్ణనాత్మకమైనది మరియొకటి ప్రాణుల యాంతర పరివర్తన నిరూపణాత్మకమైనది' [1] - అని చెప్పుచు డా. జి వి. సుబ్రహ్మణ్యంగారు ఆదర్శ చిత్రణమను మరియొక భేదమును చెప్పి 'అదిపైరెండింటికన్న ఉత్తమమైనది. ఇందు సమగ్రోదాత్త సన్నిపాతముగల వ్యక్తులు వర్ణింప బడుదు [2] రని పేర్కొన్నారు.

మరియొక విధంగా పాత్రపోషణ రెండు విధాలు. 'ఒకటి పరోక్ష పద్ధతి. రెండు ప్రత్యక్ష పద్ధతి' [3] పరోక్ష పద్ధతిలో పాత్రల స్వరూప స్వభావాలు ఆ పాత్రయొక్క గాని మరియొక పాత్రయొక్క గాని సంభాషణలతో వ్యక్తమగును. ప్రత్యక్ష పద్ధతిలో పాత్రల స్వరూప స్వభావాల్ని కవి స్వయంగా వర్ణిస్తాడు. ఇట్లు వర్ణింపబడిన పాత్రలలో చైతన్యముండదు' [4] - అని పింగళివారి అభిప్రాయం.

ఆంధ్రవాఙ్మయములో పాత్ర చిత్రణకు సంబంధించిన ప్రత్యక్ష పద్ధతికి నన్నయ, పరోక్ష పద్ధతికి తిక్కన ఆద్యులని చెప్పుకొనవచ్చును. సంభాషణ ద్వారా

పాత్రపోషణ జరిగితే, ఆ సంభాషణ నుంచి అద్దంలో ముఖ ప్రతిబింబంలాగా ఆ పాత్ర మన స్తత్త్వము ప్రతిబింబిస్తూ వుంటుంది.

పాత్రలు సజీవములు, నిర్జీవములు - అని రెండు విధాలు. ఒక వ్యక్తి తన ఆశయ సాధనకై కృషిచేసి సఫలీ కృతుడైనచో సజీవపాత్ర శబ్ద వాచ్యుడగును. నిర్జీవ పాత్రలను, కవి అలంకార శాస్త్రమను అచ్చున విగ్రహాలవలె పోతపోయును. సజీవపాత్రలు అలంకార శాస్త్ర పరిధిని అధిగమించియుండును. నిర్మలమైన ప్రకృతిని చూచి నిలువెల్ల పులకింపలేనివి నిర్జీవములు. కదిపకదిపినా కదల లేనివి విగ్రహములు. మానసిక చైతన్యం కలవి సజీవపాత్రలు ఆంధ్రసాహిత్య చరిత్రలో సజీవ పాత్ర చిత్రణకు భారతము నిధానము. 'పాత్రల సహజ వికృతులనుద్ధరించుటయందు భారతమును మించిన గ్రంథ మీ ప్రపంచమందెక్కడను లేదు'[5] అని శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారి అభిప్రాయం

పాత్ర చిత్రణలో ప్రతియోగ సంఘటనమనే పద్ధతి ఒకటి కలదు. 'ప్రతియోగ సంఘటనము (By contrast)చే పాత్రల స్వభావమును గాని రూపమునుగాని ప్రతిభాసింపజేయుట శిల్ప ధర్మములలో నుత్తమమైన'[6] దని డా. కె వి ఆర్ నరసింహము గారన్నారు. ఇది ఒక రకంగా పరోక్ష పద్ధతి వంటిదే. రెండు సమాన ప్రతిపత్తిగల పాత్రల్ని రంగమున నిలిపి, సన్నివేశాన్ని కల్పించి, సంభాషణల ద్వారా ఆ పాత్రల స్వభావం, చరిత్ర మొదలైనవాటిని వ్యక్తం చేయుపద్ధతి

వరదరాజు రచించిన శ్రీరామాయణము శ్రవ్య కావ్యమేయైనా, కవి తనసహజ ప్రతిభావిశేషాన్ని చూపి, దృశ్యకావ్యాలైన నాటకములలోవలె ఇందలి పాత్రల్ని సజీవంగా చిత్రించాడు. అందు ముఖ్యంగా సీతారామ లక్ష్మణ భరత సంవాదములు ఎంతో రసవంతములై పండిత పామరులను రంజింప చేస్తూవున్నాయి

వరదరాజు తన శ్రీరామాయణంలో అక్కడక్కడ స్వతంత్ర కల్పనలుచేసి ఆయా పాత్రల స్వభావానికి పరిపూర్ణత కలగజేశాడు. ఈ విషయమై మచ్చుకు కొన్ని ఉదాహరణలు

1) శ్రీరాముని పాత్రౌచిత్యాన్ని పెంచడానికి కవి చేసినకల్పనను తిలకించండి :

శ్రీరాముని వెతుక్కొంటూ భరతుడు సైన్యసమేతంగా భరద్వాజుని ఆశ్రమానికి వెళ్లాడు. అప్పుడు భరద్వాజుడు భరతునిచూచి 'రామలక్ష్మణులకు అపకారం చేయదలచి నీవురాలేదు కదా'' అని అడిగినట్లు మూలకర్త వ్రాశాడు.[7] ఈ సందర్భంలో వరదరాజకవి భరద్వాజుని పల్కుల ద్వారా ఆ మహర్షికి శ్రీరామునియెడల గల అమితమైన అభిమానాన్ని వెల్లడించడం ద్వారా శ్రీరాముని పాత్రయొక్క ఔన్నత్యాన్ని పెంచ దలచాడు. అందుకే భరద్వాజుడు, భరతుని తూలనాడినట్లు రచించాడు. చూడండి

"ఎల్ల సామ్రాజ్యంబు - నేలెడు నీవు
చెల్లరే యొంటిగా - చెట్టులు వట్టి
ఆలుఁ దమ్ముఁడుఁదాను - నాకులు నలము
తాళి శరీరయా - త్రకు నీడు చేసి
తమతండ్రి పనుపను - దరిదాపు లేక
కుమకుమ శోకాగ్ని - గుములుచు నున్న
రామునిమీఁద నూ - రకె చంపనలిగి
మేమి సాధించెద - విటమీఁద నీవు?
కైకేయి కొడుకవు - గాన కౌసల్య
శోకించునని మదిఁ - జూడలేవైతి
యెవ్వరెక్కడఁ బోయి - రేమి మాకేల
యివ్వేళ నాదు క - ట్టెదురను నిలిచి
కనిపించుకొని కడ - కడలనుం బోక
నను నొక్కచీరికై - నను సడ్డగొనక
కనువొడిచిన యట్లు - గర్వించి నిలుచు
నిను వసిష్ఠునిఁ జూచి - నేడు తాళితిని
లేకున్న నిన్నొక్క - లెక్కయె మాకు
కైకభేనగు మేలు - గనఁజేతు నిన్ను"[8]

2) అత్రి ఆశ్రమంలోని మునులు, అరణ్యంలో రాక్షసులవల్ల తమకు కలిగే బాధల్ని శ్రీరామునికి తెలిపారు. పిదప వారు, అడవిలో ఫలాలు తెచ్చుకోవడానికి వెళ్ళి వచ్చే మార్గంగుండా దండకారణ్యానికి వెళ్ళమని శ్రీరామునకు తెలిపినట్లు మూలకర్త వ్రాశాడు[9]

"శ్లో|| రక్షాంసి పురుషాదాని నానారూపాణి రాఘవ |,
వస న్త్యస్మి న్మహారణ్యే వ్యాళాశ్చ రుధిరాశనాః ||
ఉచ్ఛిష్టం వా ప్రమత్తం వా తాపసం ధర్మచారిణమ్ |,
అదన్త్యస్మి న్మహారణ్యే తాన్ని వారయ రాఘవ ||
ఏష పన్థా మహర్షీణాం ఫలాన్యాహరతాం వనే |,
అనేన తు వనం దుర్గం గన్తుం రాఘవ! తేక్షమమ్" ||

అయితే వరదరాజు తన శ్రీరామాయణంలో, రాక్షసుల బాధలనుండి తమను కాపాడతానని అభయ దానమియ్యమని మునులు రాముని కోరినట్లు రచించాడు.

"అనఘ! మా జపతపో - హాని వారించి
యనయంబు కందమూ - లాదులు దేరఁ
జనువారలకు బాధ - సలుపుచుఁగ్రూర
వనమృగంబులు దై - త్య వర్గంబునిచట
నిలువ రాములు చేసె - నీవు మాకొఱకు
నిలిచి యిచ్చట మాకు - నెగులెల్లఁదీర్చి
శరముల సహితులఁ - జక్కాడి మునులఁ
గరుణించి పుణ్యంబు - గట్టుకో వలయు
ఇదియె యాతాయాత - ఋషులాశ్రమముల
బ్రదుకులపై యాసఁ -బాసి నిత్యమును
నడవులకునుఁ బోవు - నట్టి మార్గంబు
చెడకుండ నిందరిఁ - జేపట్టి మీరు
నీ త్రోవ నడవుల - కేఁగ నిచ్చోటి
దైతేయ బాధలు - దలఁగించి ప్రోచి
యభయ దానమొసంగు" ---------------- 10

ఆధ్యాత్మిక శక్తికి ప్రతీకలైన మునులుసైతం, తమకు అభయదానం ఒసంగమని రాముని కోరారని కవితెలిపాడు. కథానాయకుడైన రాముని పాత్రకు మరింత పరిపూర్ణత చేకూర్చడానికే కవి పై విధంగా రచించి వుంటాడని భావించవచ్చు.

3) అడవులకు వెళ్లే ప్రయత్నాన్ని విరమించమని కౌసల్య శ్రీరామునికి తెలిపింది అప్పుడు శ్రీరాముడు పితృవాక్య ప్రాముఖ్యాన్ని గూర్చి తల్లికి ఈ విధంగా తెలియజేశాడు.

"వేఁడెద నిన్ను వే - వేలైనఁ దండ్రి
నేఁడు వల్కినమాట - నే మీఱఁ జాల
గురుని యోగంబుచే - గోహత్య చేసి
దురితంబులనుఁ బాసెఁ - దొలుత గండుండు
తనతండ్రి ముదుసలి - తపము తామోచి
ఘనుఁడు పూరుఁడు వంశ -కరుఁడైయొసంగె
తమ పితృహితము నా - ధారుణిఁద్రవ్వి
సమసియు సగరులు - సద్గతిఁ గనిరి
జనకుని పంపున - జనయిత్రిఁ ద్రుంచి

మునుభార్గవుఁడు లోక - మునఁ బుణ్యుఁడయ్యె
పితృవాక్య మొనరించి - పృథివి ననేకు
లతిశయ విఖ్యాతు - లందిరి మఱియు
నేనట్లు తండ్రికి - హితమాచరింపఁ
బూనితి దాన నె -ప్పుడు పోనిరాదు
అమ్మ! నీకిటులాడ - నగునే" యటంచుఁ"[11]

తాను అడవులకు వెళ్లడానికి అనుజ్ఞ ఇవ్వమని శ్రీరాముడు తల్లిని కోరాడు. అందులకు ఆమె కుమారునితో ఈ విధంగా చెప్పింది.

"నీవు లేనట్టి నా - నియమంబులేల?
యీ విశ్వ జనులచే - నెన్నికయేల?
తపవేల? సుఖమేల? - ధర్మంబులేల?
పగయేల? హితమేల? - పదవులడేల?
అమంలోకంబైన - నదియేల? సర్వ
సమచరిత్రుసఁ సత్య - సంధుఁ గుమారు
నిన్నుఁ జూచుచు నెంత - నేయున్నఁ జాలు
నన్నియు నేనొల్ల - నన్యంబులైన "[12]

కౌసల్య, శ్రీరాముని పాత్రలను కవియెంత సజీవంగా చిత్రించాడో పై ద్విపద పంక్తుల వల్ల తెలుస్తోంది

4) రాముణ్ణి వనవాసానికి వెళ్లమని దశరథుడు చేసిన ఆజ్ఞ లక్ష్మణుణ్ణి కోపోద్రిక్తుణ్ణి చేసింది శ్రీరాముడు లక్ష్మణుని కోపాన్ని పోగొట్టడాన్ని కవి యీ విధంగా వ్రాశాడు

"శోకరోషంబుల - సుడి గొనియుండ
నీకేల? విభు మాన - నీయుఁగాఁ గనుము
వలవదీ యభిషేక - వార్త చిత్తంబు
నిలువఁబట్టుము నావ - నీ ప్రయాణంబు
నభిషేకయత్నంబు - నటుల చేకూర్చి
యభిమతింపుము నైక - యనుమానముడుపు
గణుతింప నాసాధ్వి - కడనాహితంబు
కణమైనఁ దామ - సించఁగ రాదు నాకుఁ

దలిదం్రడులకు నహి - తము కలనైనఁ
దలఁచుట లేదు స - త్య పరాక్రముండు
సత్యసంధుడు - నైన జనకుండె సుమ్ము
ప్రత్యక్షదైవంబు - పరికింపనాకు
నతనికి - పరలోక - హాని లేకుండ
ప్రతిపాలనము సేతు - పలికిన పలుకు
సత్యంబునకు రాజు - సంతాపమంద
సత్యంబు నేఁజూచి - సహియింపఁగలనె?
కావున వనికేఁగఁ - గలవాఁడ నిపుడె
భావించి యాదేవి - భరతు నిందెచ్చి
గ్రక్కున పట్టంబు - గట్టుకోనిమ్ము"[13]

శ్రీరాముని మాటలకు లక్ష్మణుడు సమాధానమిస్తూ ఈ విధంగా తెలియ జేశాడు.

"తండ్రికిం దప్పెని - తఁడు రాజ్యకాంక్ష
వేంద్రమైనది రామ - విభుని చిత్తంబు
మనలఁబ్రోచునె యిట్టి - మర్యాద వాఁడు
మనముల నితని న - మ్మఁగ రాదటంచు
జనులెంతురోయను - శంకచే నీవు
వనులకేఁగెదనన్న - వలవదియ్యెడల
అసమర్థమగుదైవ - యత్నంబు శౌర్య
లసమానుఁడగు రాజు - లక్షింపఁదగునె?
అలవడియున్న క్ష - త్రాచారరూఢి
గెలువుము దైవంబుఁ - గేకయరాజ
తనయ బుద్ధులు విని - దశరథ విభుఁడు
కనఁడు కపటంబు - కల్ల నెయ్యమున
మంచివారునుఁబోలి - మచ్చిక సేసి
కించుఁదనంబునఁ - గీడాచరించు
వారలుగల రట్టి - వారల నెఱుఁగ
కేరీతి మోసపో - యెద వాత్మనమ్మి"[14]

రామలక్ష్మణుల వాదనను వరదరాజు పై విధంగా చిత్రించి ఆ రెండు పాత్రలను సజీవపాత్రలుగా మలచాడు.

5) తనతో అడవులకు రావలదన్న శ్రీరాముని సీత ఆక్షేపించడాన్ని గురించి కవి వ్రాసిన ద్విపద పంక్తుల్ని చూడండి

"నిన్ను మాతండ్రి పూ - నిక దప్పలేక
తిన్నని ప్రాయంబు - తీరునుంజూచి
మగవాలకంబుతో - మలయుచున్న
మగువ యౌకెఱుంగక - మదిలోన నమ్మి
యల్లునిఁ గానెంచి - యతఁడు నన్నిచ్చె
తెల్లమాయెను నీదు - తెఱగెల్ల నిపుడు
రవితేజుఁడా రఘు - రాముఁడన్నట్టి
యవివేక వాక్యంబు - లనృతంబులయ్యె
నీవె దిక్కనియున్న - నెలఁతను డించి
పోవ నేయార్తి ని - ప్పుడు నీకువచ్చె
కాలాగ్ని కల్పునే - గానకయంటి
నేలక నాదోష - మేమి గాంచితివో?
యిదినేర మన్ననే - నెఱుఁగుదుగాక
వదల నూరక నన్ను - వర్జించితేని
సత్యపతివ్రతా - చారయై తొల్లి
సత్యవంతునిఁ గూడు - సావిత్రి యనఁగ
యే నను వ్రత నయి - యేతేరకేల
మానుదుఁగుల శీల - మర్యాదలెల్ల?
వదలిన వెలయాలి - వలె నిన్నునేల
మదిమది నుండి యే - మఱియెడఁబాతు
జయోప జీవియో - సాని నట్టువుని
చాయ నిల్లాలిని - సడలఁ జూచెదవు
ఒకతెనుఁ ననుఁబ్రోవ - నోపని వాఁడ
నకట! యేఁటికిఁ బెండ్లి - యాడితివయ్య!"[15]

సీత ఆక్షేపణతో మనసు మార్చుకొన్న శ్రీరాముడు ఆమెతో ఈ విధంగా చెప్పాడు

"ఏల చైతన్య మి - ట్లేమరి నీవు
బాలాలలామ! కో - పమున నేడ్చెదవు?

యే నిన్ను నెడఁబాతు - నే యింద్రభోగ
మైన నాకేల నీ - యండ లేకున్న
వనులకు నేనేఁగ - వలసిన కతన
వనితా! నీమదిఁజూచు - వాఁడనైయుంటి
చిత్తంబులో నేను - చేసిన నేర
ముత్తమ గుణవతి! - యోర్చిసైరింపు
జగములు నిర్మింప - సమయింపఁజాలు
పొగడి కల్గొన్న యం - బుజగర్భు శక్తి
మెంత యుంట పికన్న - యెచ్చైన శక్తి
పంతుని నన్ను నీ - మాటలాడుదురె?
జ్ఞానాధిపుఁను కీర్తి - సడలనియుడుల
యేనేల యిట్టిచో - నెడవాతు నిన్ను
వనవాసముల నుం త - వనజ విభ్రాంపు
వనితా! నీ తలయింగ - వ్రాసిన వాఁడు
అదియేం తప్పు గా - నన్ను నిన్నేల
వదలుదు నెఱుఁగక - వగ వగపేల?
అతివ! వానప్రస్థు - లడవుల యందు
సతులతో నుండరే - సంసారులగుచు
వారికే దోషముల్ - వచ్చె నీవరము
కోరినదే కైక - కొసరుదీఱంగ
నర్యము వెనుక భా - యాదేవి వచ్చు
మర్యాద నావెంట - మానిని! రమ్ము
నిలువరాదిచ్చోట - నేఁడెపోవలయుఁ
దలిదండ్రులాజ్ఞయో - దలఁదాల్తు నెపుడు
తనగురుండును తల్లి - దండ్రు లెవ్వరికి
వనిత స్వాధీన దై - వతములు సుమ్ము" [16]

పై ద్విపద పంక్తుల్లోని సీతారాముల సంభాషణ, నాటకములో రంగస్థలంపై రెండు పాత్రలు ఎదురెదురుగా నిలబడి మాట్లాడు కుంటున్నట్లు వుంది దీనినిబట్టి వరదరాజు తన శ్రీరామాయణంలోని పాత్రలను ఎంతనాటకీయంగా చిత్రించాడో విదితమవుతుంది.

6) భరతుడు అడవుల్లో వున్న శ్రీరాముని వద్దకు వెళ్ళి, తండ్రి తనకిచ్చిన రాజ్యాన్ని పరిగ్రహించమని ఈ విధంగా కోరాడు

"దేవ! మీయానతి - తెఱఁగెల్ల వింటి
భావింపఁ దెలియఁగ - పల్కుట గాదు
వసుమతి కైకకు - వసుధేశుఁడిచ్చె
ననమ వైఖరినిచ్చె - నాయమ్మ నాకు
నాచేతఁగాక యెం - తయునుఁ బ్రార్థించి
మీచేతి కిచ్చితి - మేదినీ భరము
అధికార మెఱుఁగక - యవని నాసించు
నధముని రాజని - యందురే జనులు?
సింగంబునకు నమ - ర్చిన యామిషంబు
చెంగక శునక మా - సింపఁ జేకురునె?
గరుడని గమనంబు - కాకికిఁ దగునె?
ఖరమువోవునె తురం - గమము చందమున?
నీదైన రాజ్యంబు - నీచేతఁ గాక
యోదేవ! పాలింప - నోపునే యొకఁడు?
ధరణీ రుహంబులఁ - దాఁ బ్రయత్నమున
పరిపాలనము చేసి - ఫలమందు వేళ
యవివీటఁ బుచ్చిన - యట్టు లిన్నాళ్లు
నవమతి లేక మ - మ్మరసి రక్షించి
పగవానిఁ జూచిన - పగిదిగాఁ జూచి
దిగ విడిచిన నేది - దిక్కు మాకింక?
మమ్ము నీ చేతికి - మాతండ్రి యిచ్చె
నెమ్మది తానేఁగె - నీ వింకమీఁద
మమ్ము రక్షింపకీ - మాట లాడినను
సమ్మతమే మహీ - జనుల కిందఱికి
జనులెల్ల మీరు రా - జ్యము సేయఁగోరి
నను రమ్మనఁగ వచ్చి - నాఁడ మీకడకు
వారేల యిలయేల - వలసినట్లయ్యె!
నోరామ! మిముఁ - గొల్చి యుండెద నేను

బంటులకే యూరు - ప్రభువుల తోడ
నంటి యౌఁగాదని - యాడుపే యూరు
మీచిత్తమింక నే - మియుఁ బల్కనొల్ల
చూచికొండు పురంబు - చూఱవోకుండ"[17]

భరతుని పై మాటలకు సమాధానంగా శ్రీరాముడు చెప్పిన అంశాలు తిలకింపదగి వున్నాయి.

"వనులకిచ్చుట నేను - వసుమతి కీవు
నొనరంగ దొరలమై - యుండంగవలయు
దండకావన మహీ - స్థలముల నేను
మండితచ్ఛత్రచా - మరముల నీవు
కందమూల ఫలాది - కములచే నేను
నందితరసరసా - న్నంబుల నీవు
క్రమముతో నారచీ - రలు గట్టియేను
రమణీయ దివ్యాంబ - రమ్ముల నీవు
వనిత జటాకలా - పములతో నేను
జననుత రత్నభూ - షణముల నీవు
ముందర వనమృగం - బుల గొల్వ నేను
నిందఱికిని కొల్వ - నిచ్చుచు నీవు
సౌమిత్రి యొకఁడి - చ్చట నుండ నేను
సౌమిత్రి యొక్కఁడ - చ్చట నుండ నీవు
రాజితగిరకంద - రంబేల నేను
రాజగేహ పరంప - రలయందు నీవు
సీతయొక్కతె సేవ - సేయంగ నేను
శీతాంశు వదనలు - సేవింప నీవు
పాద సంచార వై - భవముతో నేను
వేదండ తురగాది - విహృతిచే నీవు
ఈ చిత్రకూట మ - హీధరం బేను
ఆ చక్రవాళ మ - హాధాత్రి నీవు
తల్లిదండ్రుల యాజ్ఞ - తప్పక లోకు

తెల్లమెచ్చు వహింప - కేమనవచ్చు

---------------------------------

---------------------------------

కొనసాగ కున్నచో - కొడుకు లేమిటికి?" [18]

ఇట్లు, శ్రీరామ భరతుల సంవాదమును వరదరాజు పండిత పామరుల చెవులకింపు గల్గించు నటుల రచించాడు. పై విధంగా శ్రీరామాయణంలోని పాత్రలన్నీ సముచిత వర్తనలతోను, తమ తమ దృక్కోణాల నుంచి ఎదుటి పాత్రలతో సంభాషించడం ద్వారానూ సజీవమైన చక్కని చైతన్య దీప్తిని పొందాయి.

## 3.2 వర్ణనలు :

కావ్యంలో అష్టాదశ వర్ణనలుండడం కవితా సంప్రదాయం ప్రబంధకవులు వర్ణనలకు అగ్రతాంబూలం ఇచ్చారు కవి తాను ఊహించిన దృశ్యాన్ని కన్నులకు కట్టినట్లు చేయడానికి వర్ణనలు చేస్తాడని విమర్శకుల అభిప్రాయం [19] రసప్రధానమైన ప్రబంధాలకు వర్ణనలెంతో ఆవశ్యకం.

ఆలోచనాశక్తి ఏకవస్తు విషయ కేంద్రికృతం కావడానికి ఆవస్తు పరిశీలనా దృష్టి సమగ్ర సుందరమై వర్ణనాత్మకంగా వుండాలి. అట్టి ఏకాగ్ర మనః స్థితిలోనే భావం ఉద్భవిస్తుంది భావతీవ్రత అనుభవ యోగ్యమగుటకు కారణం రసోత్పాదకత ఈ హేతువు వల్ల రసప్రాధాన్యం కలిగిన ప్రబంధాలకు వర్ణనలు ఆవశ్యకమయ్యాయి

తెలుగు సాహిత్యంలో అష్టాదశ వర్ణనల ప్రసక్తి మొట్టమొదటిసారిగా నన్నె చోడుని కుమార సంభవంలో చూడవచ్చు [20] విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో ఈ వర్ణనలే కన్పిస్తాయి [21] అయితే అప్పకవి, పదునెనిమిది వర్ణనలకు అదనంగా ఇంకోనాల్గింటిని చేర్చి ఇరవైరెండు వర్ణనలుండడం ప్రబంధ లక్షణంగా నిర్దేశించాడు [22] ఆశ్రమ, కన్యాంగ సౌందర్య, దౌహృద, మృగయా - అనేవి అప్పకవి చెప్పిన నూతన వర్ణనాంశాలు. ఈ అష్టాదశ వర్ణనల్లో రవి, శశి, అంబునిధి, ఋతు, నగవర్ణనలు ప్రకృతి వర్ణనలు. తక్కినవి వస్తువిషయక వర్ణనలు.

వరదరాజు శ్రీరామాయణంలోని వర్ణనల్ని మూడు విధాలుగా విభజించవచ్చు

1 కథానుగుణ వర్ణనలు

ఉదా - i) భగవంతుని వర్ణన, ii) పురవర్ణన

2 పాత్రానుగుణ వర్ణనలు

ఉదా - i) సుతజననము, ii) విజయము.

3 రసానుగుణ వర్ణనలు

ఉదా - i) నాయక వర్ణన, ii) కన్యాంగ సౌందర్యము

iii) పరిణయము iv) ఋతువర్ణన v) వనకేళి vi) జలకేళి

vii) విప్రలంభము viii) రణము ix) ప్రయాణము

3 2 1 కథానుగుణ వర్ణనలు .

(1) శ్రీ వేంకటేశ్వరుని వర్ణన :

వాల్మీకి రామాయాణాన్ని ద్విపదలో తనకు అంకితంగా రచింపవలసినదని శ్రీ వేంకటేశ్వరుడు కలలో కనబడి ఆదేశించినట్లు వరదరాజకవి తెలిపాడు తనకు కలలో కనపడిన శ్రీ వేంకటేశ్వరుని స్వరూపాన్ని కవి వివరంగా ఇలా వర్ణించాడు.

'కలకలనవ్వు చ - క్కని నెమ్మొగంబు
గిల గిల మొరయు బ - ల్కెంపుటందియలు
తళ తళ మెఱయు బి - త్తరిఁ దాల్చునురము
జల జల చింద్రెంబు - చల్లు వాతెఱయు
మినమిన చామన - మిసిమి నెమ్మేను
కనఁగనవెలుఁగు చొ - క్కపు కిరీటంబు
లివలివలాడు మే - లిమి కుండలములు
రవరవల్గనువూంచు - రత్నహారములు
నిగనిగల్మను పైఁడి - నిగ్గుచేలంబు
ధగధగలీను సు - దర్శనకరము
చక చకిల్గల పాంచ - జన్యంబునమరు" [23]

సౌందర్య వర్ణన కవియొక్క ఊహాశక్తిపై ఆధారపడి వుంటుంది నఖశిఖ పర్యంతం వర్ణనగావించిన ప్రబంధ కవులు అనేకులు కలరు. హొడిహొడి మాటలతో రూప సౌందర్యాన్ని అపురూపంగా వర్ణించిన తిక్కనాదులూ కలరు. సామాన్యంగా రూపాన్ని వర్ణించడానికి కవులు ఒక క్రమాన్ని పాటిస్తారు. వరదరాజునకు కలలో కనిపించిన శ్రీ వేంకటేశ్వరుని రూప వర్ణనలో క్రమం పాటించబడలేదు ఆయనకు కనిపించిన మొదటి రూపం నెమ్మోము. అది కలకల నవ్వుతూ కనిపించింది భక్తిపారవశ్యంతో

వెంటనే వరదరాజు ఆ రూపంయొక్క పాదాల్ని చూచినట్లు తెలుస్తుంది. పాదాలు తిలకించిన కన్నులతో వెంటనే వరదరాజు చూచింది ఆ భగవంతుని వక్షః స్థలాన్ని, ఆపై వాతెరను. క్రమంగా శరీరాన్ని, కుండలాల్ని, కిరీటాన్ని, సుదర్శనాన్ని, పాంచజన్యాన్ని. ఈ వర్ణనలో కొంత కలగాపులగం చోటు చేసికొన్నమాట వాస్తవం. అందుకు కారణం కలలో కనిపించిన దేవుని, వరదరాజు తన్మయత్వంతో తిలకించుటయే అని గ్రహింపవచ్చు.

(2) అయోధ్యాపుర వర్ణన :

అయోధ్యానగరాన్ని వరదరాజు కడురమ్యంగా వర్ణించాడు. ఈ అయోధ్యా పురం తనకాలం నాటి మధురా పురమని చెప్పవచ్చు. ఆ పట్టణంలో చంద్రశాలలు, సావడులు, హజారాలు, హజారముల వద్ద కావలి కాచే భటులు, చప్పరములు, సాముగరిడీల శాలలు, ఉప్పరిగెలు మొదలగునవి వరదరాజు రామాయణంలో కన్పిస్తాయి. ఆ పట్టణంలో

"రాజమార్గంబులు-----------------
రాజిల్లు మణిమయ - రంగవల్లికలు
పువ్వు మేల్కట్టుల-బ్బురపు మేడలును
పువ్వులతోఁటలు - భువనేశ్వరములు
మకరకేతనములు - మణిగవాక్షములు
చకచకల్ వెదచల్లు - చంద్రశాలలును
కోటలు నట్టళుల్- కొత్తళంబులును
నీటైనయంగళ్లు-నిబిడ యంత్రములు
రం-------------------- లు జఖురు
జంగులాశ్వరులు దం-చన పుజేతులును
నరిభీమ తేజంబు-లగు సామజంబు
లరయఁబాయురయంబు-లగు హయంబులును
రత్నసౌధములు కి-రాటయూధములు
రత్నాకరాను కా-రము లగడ్తలును
సావళ్లఁ బసిఁడిహ - జారముల్ కడల
కావళ్లఁగా చువి-క్రమ వీర భటులుఁ
గేళివనమ్ములుఁ - గృతకాచలములు
బాలికాలం కార-పణ్య వీధులునుఁ

ఐరపుచప్పరము లు-ప్పరిగెలు సాము
గరుడులు వైభవా -గత విమానములుc
జెఱకుcదోcటులు - మిన్ను చెనకు కోటలును
విరులుcగదంబముల్- విలుచుcజేటలును"[24]

అయోధ్యా పట్టణాన్ని వరదరాజు అత్యంత సుందరంగా వర్ణించాడు. నేడు పట్టణాభివృద్ధి సంస్థవారు రూపొందించిన పట్టణ నిర్మాణం వరదరాజు నిర్మించిన పై అయోధ్యానగర వర్ణనలో చక్కగా గోచరిస్తున్నది.

(3) శ్రీహరి వర్ణన :

మూలంలో ఒకేయొక్క శ్లోకంలో ఇమిడివున్న విష్ణువుయొక్క వర్ణనను విష్ణుభక్తుడైన వరదరాజు శ్రీరామాయణంలో పెంచి వ్రాశాడు. శ్రీ మహా విష్ణువు మెఱుగు రెక్కలతో కూడిన మేరుపర్వతంపైనీలమేఘంవలె ప్రకాశిస్తూవున్నాడని ఈయన ఇందు ప్రయోగించిన ఉపమాలంకారమే ఈకవీంద్రుని అద్వితీయమైన విష్ణుభక్తికి చక్కని తార్కాణం ।

ఈ కవీశ్వరుడు కావించిన విష్ణువర్ణనమిది

"సులభుcడైనట్టి కౌ-స్తుభవిభూషణుcడు
శ్రీమించు రత్నకి-రీటంబు తోడ
చామన నెమ్మేని - చందంబు తోడ
వర్ణిత దరహాస -వదనంబుతోడ
కర్ణకుండల విభా-కళికలతోడ
కరములు శంఖ చ-క్రంబులతోడ
నురము మీcద వసించు - నొయ్యారితోడ
గ్రైవేయమణిమయాం - గదములతోడ
సౌవర్ణ కటితటి - శాటికతోడ
హారకంకణ మేఖ-లావళితోడ
కారుణ్య రసవిలో - కనములతోడ
భువన పావన పదాం-బుజముల తోడ
రవికోటి శతభాసు - రద్యుతి తోడ
మెఱుcగుఱెక్కల తోడి - మేరువుమీcద
మెఱుపులతో నీల-మేఘమోయనcగ

వైనతేయస్కంధ - వర్ధితపీఠి
దీనకోటులభాగ - ధేయమౌనతఁడు
అరవిందభవముఖ్య - లగువేలుపులకు
హరిసర్వమయుఁడు ప్ర-త్యక్షమై నిలచె."[25]

వరదరాజు దృష్టిలో వేంకటేశ్వరుడు భక్తసులభుడు. అందుకే ఆయనను కవి భక్తసులభుడైన కౌస్తుభ విభూషణుడు - అని అన్నాడు. ఆ స్వామి కిరీటం 'శ్రీ నిమించింది' - అంటాడు వరదరాజు సంపదలో ఆ కిరీటం విలువ లక్ష్మీదేవిని మించింది అని చెప్పడం కన్నా, లక్ష్మీనివాసం అయిన విష్ణువు వక్షః స్థలానికి పై భాగాన ఆ స్వామి శిరసుపై ఆ కిరీటం వెలసిందని గ్రహింపవచ్చు. వక్షఃస్థలంలో సిరిని, కరములలో శంఖ చక్రాల్ని, కర్ణములయందు కుండలాల్ని దరించిన ఆ స్వామిచూపులు దయతో కూడి ఉన్నవి నూటుకోట్లసూర్యబింబాల వెలుగును కలిగిన ఆ వేంకటేశ్వరుడు ఈ భువనమునంతటిని తనపాదాల చేత పావనం చేయగలవాడు. దేవతలకే దేవుడైన ఆ దేవుడు గరుడారూఢుడై మేఘంవంటి శరీరంతో మెఱుపులవంటి ఆభరణాల్తో వరదరాజునకు ప్రత్యక్షమైనాడు

(4) గంగానది వర్ణన :

దివినుంచి భువికివచ్చు వరదరాజు గంగ చిందులు త్రొక్కింది ఎగసియాడింది సుళ్లుతిరిగింది నిగనిగమెరసింది. మలకలై దిక్కులమలసింది. చులకనై వేగాన్ని చూపింది గుఱ్ఱములాగా అంగలు వేసింది. ఒక్కొక్కచోట ఏనుగులాగా నడచింది. లహరి 'పరస్పరోల్లాస ఘట్టనల విహితాట్టహాసములు' ఒనర్చింది

"కారండవ క్రౌంచ-కలహంస చక్ర
సారసకలకల -స్వన శోభితంబు
కమఠకుళీరన-క్ర గ్రాహభయద
తిమి తిమింగిల సము-త్క్రాంతాంతరంబు
కనకాబ్జకల్హార - కైరవప్రసవ
వినుతమాధ్వీ రసా-వితషట్పదంబు
అభ్రంలిహోర్మికా - ప్రాంచలచార
శుభ్రడిండీరవి - భ్రుతదిశాముఖము
బహుతదావర్తాన-పాయ చంక్రమణ
మహనీయ తరతరు -మథ్యమానంబు
నగుచు మిన్నుననుండి-యభ్రయానముల

నిగనిగ మెఱయు మ-ణీభూషణముల
నాదిత్య రుచులతో -నధినుతుల్సేయు
నాదిత్య కోలాహ-లాను వాదముల
శరదభ్రముల యాక-సంబు చందమున
హరిణ పక్షములైన - హంస పోతముల
దొరయుచునిలకెల్లఁ - దొడవుకై వడిన
వరనదీ రత్నము-ర్వరవచ్చునపుడు
మలకలై దిక్కుల - మలయు నొక్కెడను
చులకనై వేగంబు-చూపు నొక్కెడను
తగునశ్వముల రీతి-దాఁటు నొక్కెడను
నిగుడక యందంద-నిలుచు నొక్కెడను
గజములోయిన నొక్క-కడ మందమంద
నిజగమనము చూపు-నిలుచు నొక్కెడను
లహరీ పరస్పరో-ల్లాసఘట్టనల
విహితాట్టహాసముల్- వెలయించు నొకట
నమరలోకముఁబాసి-యవని పైఁబుట్టు
నమరుల మరలంగ - ననుపు నీరార్చి
తొలఁకుల నెగయు లేఁ-దుంపురులంటి
పొలయుగాడ్పులఁ బాప-ములుఁబాఱమీటు
ఇరుగడ నింద్రాదు-లెల్ల సేవింప
గరుడగంధర్వాయ-క్ష ప్రభుల్గొలువ"[26]

ఇక్కడ వరదరాజు రచన సంస్కృత భూయిష్ఠంగా సాగి ఆగంగా తరంగాల గాంభీర్యాన్ని ప్రతిధ్వనింపజేసింది. ధాత్రికి వచ్చు దివ్యగంగను తలదాల్చగలిగినవాడు పరమశివుడొక్కడే! దేవతల్లో ఎవ్వరికీ ఆకార్యం సాధ్యంకాలేదు. ఆగంగ గాంభీర్యానికి తగినట్లుగానే సంస్కృత సమాసాల్తో వరదరాజు వర్ణన గావించాడు.

**(5) అయోధ్యాపురవాసుల మానసికస్థితి వర్ణన :**

రాముడు అయోధ్యను వదలి అడవులకు వెళ్లునప్పుడు ఆపురంలోని ప్రజల బాధను మూలకర్త రెండు శ్లోకాల్లో వర్ణించాడు.

"శ్లో|| నక్షత్రాణి గతార్చీంషి గ్రహాశ్చ గత తేజసః |,
విశాఖాస్తు సధూమాశ్చ నభసి ప్రచకాశిరే ||
కాళికానిలవేగేన మహోదధి రివోత్థితః |,
రామే వనం ప్రవజితే నగరం ప్రచచాల తత్ "[27]||

వరదరాజు మూలంలోని ఈవర్ణనకు తనకవితా శక్తిని జోడించి క్రింది విధంగా వర్ణన గావించాడు.

"అసమయంబునఁబంక-జాప్తుండు తొలఁగ
వసుధఁ గావిరులు న-ల్వంకలఁ బొదువ
గ్రహతారకముల పొ-గల్ గనుపింప
మిహికాంశుబింబంబు-మే నెల్లఁగంద
నుదధి ప్రచండ వా-యువులఁజలించు
విధమునంగలఁగె న-వ్విభు పట్టణంబు"[28]

మనుజేశ్వరుడైన శ్రీరాముడు అయోధ్యను వదలి అడవులకు వెళ్ళునప్పుడు ఆపురంలోని ప్రజలు ఎంతగా మానసిక క్షోభకు గురయ్యారో వరదరాజు ప్రకృతి సంకేతాల్ని ఆధారంగా చూపెట్టాడు. 'సాయంసమయం కాకుండానే సూర్యుడు అస్తమించాడని, గ్రహతారకల్లో పొగలు కనిపించాయని, చంద్రబింబంకంపించిందని', కవి తెల్పాడు. శ్రీరాముడు అయోధ్యను వదలి వెళ్లడం వల్ల సముద్రం ప్రచండ వాయువుల్తో కల్లోలంచెందినట్లుగా ఆపురం కల్లోలంచెందిందని కవి వర్ణించాడు

(6) చిత్రకూట పర్వత వర్ణన :

చిత్రకూట పర్వత వర్ణనను వరదరాజు కడురమ్యంగా చిత్రించాడు

"అంచిత మునివర-యజ్ఞ వాటంబు
నవరత్న శోభాపి - నద్ధకూటంబు
పాలిత తరువరా -పారఝూటంబు
నీలనీలాంబుద - నికర ఖేటంబు
ప్రాలేయ కర సుసం-బద్ధ జూటంబు
పరిసర సంచర-ద్భాను ఘోటంబు
స్థిర పుణ్య కూటంబు - చిత్ర కూటంబు"[29]

మునుల యజ్ఞయాగాదులకు నిలయమైనది, నవరత్నాలతో శోభిల్లునది, మంచి వృక్షాల్ని కలిగినది, మేఘాలు క్రమ్ముకొన్నది, మంచుతెమ్మెరలు పరచుకొన్నది అయిన చిత్రకూట పర్వతం పుణ్యానికి నిలయమైనదని వరదరాజుకవి వర్ణించాడు.

వరదరాజు యొక్క పై ప్రకృతి వర్ణనలో శబ్దాడంబరంచోటు చేసికొన్నది. "చిత్రకూటంబు" అనే ప్రయోగానికి అనుగుణంగా - వాటంబు, కూటంబు, ఝూటంబు, ఖేటంబు, జూటంబు, ఘోటంబు - పదాల ప్రయోగం గమనింపదగ్గది. ఈ అంత్య ప్రాసప్రయోగంలో వినికిడికి ఒక సొగసును కలిగించి కవి పాఠకుని మనస్సును చిత్రకూటం వైపు మళ్లించాడు. ప్రకృతి వర్ణనకు ఇదిమేటి అని చెప్పలేము కాని శబ్దాడంబరంతో వర్ణన వినసొంపుగా సాగింది.

(7) ఋష్యమూక పర్వత వర్ణన మూలంలో ఒక శ్లోకంలో వుంది.

> "శ్లో || ఋశ్యమూకశ్చ పమ్పాయా పురస్తాత్పుష్పితద్రుమః |,
> సుదుఃఖారోహణో నామ శిశునాగాభి రక్షితః" [30] ||

వరదరాజు ఈ శ్లోకభావాన్ని పెంచి వర్ణించాడు. ఈయన పాదాంతాల్లో అనుప్రాసన్ని ఉపయోగించాడు. ఈవర్ణన చమత్కారయుతంగా వుండి సంస్కృత పద భూయిష్ఠంగా సాగింది

"అవలోకమాత్రని - రస్తశోకంబు
దివిజభామోద రాం-తి ప్రవేకంబు
ఉపహృతాధ్వన్య శ్ర-మాతిరేకంబు
తపనేందు మణిగణ-స్థగితరోకంబు
అమరాపగాకృతా-త్మాభిషేకంబు
యమదూత గదితసం-మోనువాకంబు
సారసినీ చర-చ్చక్ర వాకంబు
తీరవనీ సము-త్తీర్ణ పైకంబు
కందరాంతర విశం-కటువనోకంబు
సందీప్త శృంగాను-షంగి నాకంబు
హేలాచరిష్ణు గం-ధేభపాకంబు
తాలాదితరసము-త్కటవనీకంబు
ఋషి కన్యకాకరా-హృత ప్రలాకంబు
విషయలోలాశర - ద్విషదభీకంబు
వాలి సంప్రాప్త బా-వవ్యాళికంబు
కాలాంచరిత మౌని - గణసరాకంబు
ప్రతి పన్నయతి పుణ్యా-ఫల విపాకంబు
శృత ఋష్యనీకంబు - ఋష్యమూకంబు" [31]

అని వర్ణించడంలో వరదరాజు ఊహావైచిత్రి గోచరిస్తుంది.

### 3.2.2 పాత్రానుగుణ వర్ణనలు :

**(1) సుతజననము :**

వరదరాజు దశరథునితో కౌసల్యాదిరాణులకు 'పుంసవనాదికంబులెనయు వేడుకల్ కావించాడు. ఈ రాణులు రామాదుల్ని ప్రసవించారు. అప్పుడు అయోధ్య అంతాపండుగచేసికొన్నది. దేవతాదుందుభులు ఆకాశం నుంచి వినబడ్డాయి. గంధర్వ స్త్రీలు పాడారు. అప్సరలు నాట్యం చేశారు పురజనులు ఆనందంలో తేలియాడారు. 'పొంగెను విల్లెత్తు పొడవు ధరిత్రి, మంగళాలంకారమయమయ్యె7బురము' అని వరదరాజు వర్ణన చేశాడు

"ఆవేళఘువినిండె - నలరులవాన
దేవతాదుందుభుల్- దివి నెల్లమొరసె
పాడిరి గంధర్వ - భామినుల్ మింట
నాడిరి లాస్యంబు - లప్సరాంగనలు
మలసె వాసనలతో - మలయమారుతము
వెలసె వేలుపుల దీ-వెన లాకసమునఁ
బురజను లానంద-మునఁదే లిరపుడు
దరణీ శుతపము నెం-తయు నిండఁబండె
పొంగెను విల్లెత్తు - పొడవు ధరిత్రి
మంగళా లంకారమయ-మయ్యెఁబురము."[32]

రామజననంతో భూమి విల్లెత్తు పొంగిందని కవి ఒక అద్భుతరమణీయ భావనను చక్కగా ఊహించాడు. విల్లెత్తు పొంగుట అనుమాట శ్రీరాముని ధనుర్వేదప్రౌఢిని ధ్వనింపజేస్తూవుంది. అంతేగాకుండా శ్రీరాముడు తనధనుర్వేద పాండిత్యంతో బాలకాండం నుంచి యుద్ధకాండం వరకు చేసిన కార్యాల్ని సూచిస్తున్నది. 'మంగళాలంకారమయమయ్యెఁబురము' - అనుమాటరాముడు జన్మించగా, రాజ్యంలో ఈతిబాధలు, కలహాలు లేకుండా ప్రజలంతా సుఖసుఖంగా ఉండినారనే అభిప్రాయం ధ్వనితమౌతూవుంది.

వరదరాజు తాటకయొక్క ఆకారాన్ని సులభగ్రాహ్యంగా కళ్ళకు కట్టినట్లు వర్ణించాడు. తాటకి శరీరాన్ని కాటుకకొండతోను, చన్నుల్ని అరిశెలతోను, చెవుల్ని గవనివాకిళ్లతోను, పళ్లను గవ్వలతోను పోల్చి కవి వర్ణించాడు.

"భీమారుణేక్షణ - భీకరాకారఁ
జూచి కాటుకకొండ - చొప్పగుమేను
యేచిపై పొడవు గా-నెత్తుఁ జేతులును
మెఱుపులు వెదఁజల్లు - మెఱుఁగు గోరలును
హరిగెల రీతిన-ల్లాడుఁ జన్నులును
వివృతాస్య గర్తంబు - వెళుపైన కడుపు
గవని వాకిళులట్లు - కరమొప్పుఁ జెవులు
వంకరముక్కు గ-వ్వలవంటి పండ్లు
సంకు కామాక్షులు - జగ జంపు జడలుఁ
గలిగి పై వచ్చుర-క్కసిఁ జూచినగవు
సెలవులం దులకింప - శ్రీరాముఁడనియె" [33]

(3) శివదనుర్భంగ సన్నివేశము .

శ్రీరాముడు శివధనుర్భంగం కావింపగా భూమ్యాకాశాల్లో ప్రతిధ్వనులు నిండాయి ఈ ధ్వనికి ఓర్వలేక జనకుడు, రామలక్ష్మణులు, గాధేయముని తక్క అక్కడనున్న తక్కిన వారందరూ భీతిచే మూర్ఛనొందారని వరదరాజు తెలిపాడు ఈఘట్టం యథామూలంగా వుంది.

"నడు చక్కివట్టి యు-న్నతిమీఱనెత్తి
కదువేగ రసదాడి - గజమునుఁ బోలె
నారిసారించి స-న్నాహంబు మెఱసి
గౌరవంబమర నా-కర్ణాంతముగను
నట వినోదంబుగా - నలవోక దోఁప
కటకాముఖ నిరూఢ - కరపద్ముఁడగుచు
దొడికి యందఱును క్రం-దుగఁ జూచుచుండ
పిడిపట్టు మెల్లనె - బిగువుసళ్లుటయుఁ
బెటిల పెటిల్లు నఁ-బృథివి నింగియును
దిటదప్ప నెందుఁ బ్ర-తిధ్వనుల్ నిండ
ఖలుగొండ యశనిచేఁ-బగిలిన రీతి
కలగుండు వడఁగ జ-గంబులన్నియును

జనకుండు రామ ల-క్షణులు గాధేయ
మునియును దక్కం గా-ర్ముకవరాభంగ
భంగనిష్ఠురమహా-ర్భటి కోర్వలేక"[34]

వరదరాజు పై వర్ణన మూలంలో ఈ విధంగావుంది.

"శ్లో|| లీలయా స ధనుర్మధ్యే జగ్రాహ వచనాన్మునేః |,
పశ్యతాం నృసహస్రాణాం బహూనాం రఘునందనః ||
ఆరోపయత్స ధర్మాత్మా సలీలమివ తద్ధనుః |,
ఆరోపయిత్వా ధర్మాత్మా పూరయామాస తద్ధనుః ||
తద్బభంజ ధనుర్మధ్యే నరశ్రేష్ఠో మహాయశాః |,
తస్య శబ్దో మహానాసీన్నిర్ఘాత సమనిస్వనః ||
భూమి కంపశ్చ సుమహాన్ పర్వతస్యేవ దీర్యతః |
నిపేతుశ్చ నరాస్సర్వే తేన శబ్దేన మోహితాః ||
వర్జయిత్వా మునివరం రాజానాం తౌ చ రాఘవౌ ||"[35],

మూలంలో రామునికి "ధర్మాత్మా" 'నరశ్రేష్ఠో', 'మహాయశా' - అనే విశేషణాలు ప్రయోగింపబడియున్నవి. ధర్మజ్ఞుడై, గొప్పకీర్తి ప్రతిష్ఠలు గల నరశ్రేష్ఠుడైన మహావ్యక్తి మాత్రమే ఆవిల్లును ఎక్కు పెట్టగలడని వాల్మీకి అభిప్రాయం. వాల్మీకి రామాయణంలోగల ఈ విశేషణాలు వరదరాజ రామాయణంలో లేవు. ఇక్కడ వాల్మీకి రామాయణంలోని ఔన్నత్యం వరదరాజు రామాయణంలో లేదు.

(4) రావణ స్వరూపము :

హనుమంతుడు రావణుణ్ణి లంకలో అతని శయ్యా మందిరంలో చూశాడు హనుమంతుడు చూచిన రావణ రూపులేఖల్ని మూలకర్త నాలుగు శ్లోకాల్లో వర్ణించాడు.

"శ్లో|| తస్మిన్ జీమూతసంకాశం ప్రదీప్తోత్తమకుండలమ్ |,
లోహితాక్షం మహాబాహుం మహారజిత వాససమ్ ||
లోహితే నానులిప్తాంగం చందనేన సుగంధినా |,
సంధ్యారక్త మివాకాశే తోయదం సతటిద్గణమ్ ||
వృత మాభరణై ర్దివ్యై స్సురూపం కామరూపిణమ్ |,
సవృక్షవన గుల్మాఢ్యం ప్రసుప్త మివ మందరమ్ ||
క్రీడి త్వోపరతం రాత్రౌ వరాభరణ భూషితమ్ |,
ప్రియం రాక్షసకన్యానాం రాక్షసానాం సుఖావహమ్"[36] ||

దీన్ని వరదరాజు ద్విపద రామాయణంలో ఈ క్రింది విధంగా వర్ణించాడు.

"కలకల వెలుఁగు చు-క్కలలోనఁ బొలుచు
కలువలరాజు బిం-కము మించు వాని
చెఱకు సింగాణి పూ-సెలగోల లవలఁ
దొఱఁగించి వచ్చు కం-తుని వంటివాని
వనమెల్ల నలరింప - వచ్చె వసంతుఁ
డనఁగ నొచ్చెములేని - యందంబు వాని
బొటిదువ్వలువ హ-స్త విభూషణాగ్ర
హీరాంకురములాన - నెసఁగెడు వాని
నగుమోము లోచనా - నందంబు గాఁగ
మగువలకును జొక్కు - మందైన వానిఁ
దనుఁ జూచు కన్నులు - తడవులకైన
జనులకు నవ్వలఁ - జననీనివాని
సకల విభూషణో-జ్జ్వలుఁ బీనవక్షు
నకళంకుఁ దేజస్వి-నాజాను బాహు
జలధర వర్ణుని - శత పత్రనయను
వలమాన విభవు రా-వణుఁ జూచునంత"[37]

(5) శ్రీరాముని వర్ణనము .

శ్రీరాముణ్ని, వానరసైన్యాన్ని చూచివచ్చిన శుకసారణులు ఆ విశేషాల్ని రావణునకు వివరించారు. అప్పుడు రాముని బలపరాక్రమాల్ని గురించి శుకుడు రావణునికి తెల్పిన విషయాన్ని మూలకర్త నాలుగు శ్లోకాల్లో వర్ణించాడు.

"శ్లో || యశ్చై షోఽనన్తర శ్శూర శ్శ్యామ పద్మని భేక్షణః |,
ఇక్ష్వాకూణామతి రథో లోకే విఖ్యాతపౌరుషః ||
యస్మి న్నచలతే ధర్మో యో దర్మం నాతి వర్తతే |,
యో బ్రాహ్మ మస్త్రం వేదాంశ్చ వేద వేదవిదాం వరః ||
యో భిన్ద్యాద్గగనం బాణై పర్వతాంశ్చాపి దారయేత్ |,
యస్య మృత్యో రివక్రోధ శ్శకస్యేవ పరాక్రమః ||
యస్య భార్యా జనస్థానాత్సీతా చాపహృతా త్వయా, |
స ఏష రామ స్త్వాం యోద్ధుం రాజ ! న్సమభివర్తతే"[38] ||

వరదరాజు రాముణ్ని క్రింది విధంగా వర్ణించాడు.

"చటులప్రతాప వై-శ్వానరాఖిల
సంగరరంగ భీ షణదైత్య వీర
పుంగవ నిజభుజా - భుజగభుజంగ
భుజగీ భవన్నాక - పురువధూవార
భజనీయకీర్తి ప్ర-భావాను భావ
మందారమంజరీ - మకరంద బిందు
తుందిలేందిందిర - స్తోమసంగీత
కలనాదమేదురా - కాశావకాశ
వలయిత వసుమతీ - వలయమైనట్టి
బ్రహ్మాస్త్ర ముఖదివ్య - బాణాభిరాము
జిహ్మాగోత్తమ విల-సిత భుజస్థేముఁ
బరమ కల్యాణ వై-భవ గుణారాము
శరణాగతత్రాణ - సద్ధర్మకాము
దూరీకృత సమస్త - దుర్దోషనాము
నూరీకృత దయాగు-ణోరులలాముఁ
గోమల తరనీల-కు వలయశ్యాము
సామాది నృపనీతి - సముదయోద్దాము
సీతా దృగుత్పల - శ్రీకరసోము
దాతృత్వనిస్సీము - దశరథరాముఁ
గనుఁగొంటిరే యిట్టి - కల్యాణ చరితు"[39]

(6) ఇంద్రజిత్తు పరాక్రమము :

రావణుని పుత్రుడైన ఇంద్రజిత్తు అదృశ్యుడై ఆకాశం నుంచి వానరసేనను బ్రహ్మాస్త్ర ప్రభావంతో భయభ్రాంతులకు గురిచేశాడు. ఈ విషయాన్ని మూలకర్త రెండుశ్లోకాల్లో చెప్పాడు

"శ్లో|| సంసృజ్య బాణవర్షం చ శస్త్రవర్షం చ దారుణమ్ |

---------------------------------------------

---------------------------------------------

వవర్ష నీలామ్బుధరో యథాఽమ్బు"40 ||

వరదరాజు, ఇంద్రజిత్తు ఘనపరాక్రమాల పట్ల ముగ్ధుడై క్రిందివిధంగా వర్ణన గావించాడు.

"అసురేంద్రు సుతుండు బ్రహ్మాస్త్ర ప్రభావ
[illegible]
నెరయించు నొకచోట - నీలమేఘములు
కురిపించు నొకచోట - మోహాస్త్ర వృష్టి
కురియించు నొకచోట - మంచు పెందెరలు
పొంగించు నొకచోట - ధుగధుగల పొగలు
వినిపించు నొకచోట - విలునారి మ్రోత
కంపించు నొకచోట - గాంచన రథము
వెలిగించు నొకచోట - సింహ నాదములు
నెలకొల్పు నొకచోట - నేమికా ధ్వనులు
నడరించు నొకచోట - హయ హేషితములు
జడియించు నొకచోట - శస్త్రులువైచి
విసివించు నొకచోట - విలుకెల బూని
నసముంచు నొకచోట - నాకృతిఁ జూచి
యీలీల నెలయించె - యింద్రజిత్తుండు !"41

రావణాసురుని పుత్రుడైన ఇంద్రజిత్తు తన బ్రహ్మాస్త్రమహాత్మ్యంతో వానరసేనను భీతిల్లజేశాడు. అతడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి యుద్ధంలో నీలమేఘాల్ని సృష్టించాడు. వానరసేనపై మోహనాస్త్రాల్ని కురిపించాడు. వానరసేనలు వారిని వారేహత మార్చు కొనడానికి పెద్ద ఎత్తున పొగల్ని సృష్టించాడు. వానరుల్ని భయపెట్టడానికి వింటినారితో భయంకర శబ్దాన్ని చేశాడు. సింహనాదం చేశాడు. నేమికా ధ్వనుల్ని సృష్టించాడు గుఱ్ఱాలచేత సకిలింపులు చేయించాడు. ఈ విధంగా ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్ర ప్రభావంతో యుద్ధరంగంలో ఒక్కొక్కచోట ఒక్కొక్క రకమైన విద్యను ప్రదర్శించి వానరసేనను హడలగొట్టినట్లు వరదరాజు వర్ణించాడు.

(7) దశరథుని గుణగణాలు :

దశరథుని గుణగణాల్ని గురించి కవి సులభ గ్రాహ్యమైన పదాలతో రమ్యాతి రమ్యంగా వర్ణన గావించాడు.

"పాలించు సకల భూ-పాల శేఖరుఁడు
శీలవివేక దా-క్షిణ్య భూషణుఁడు
వరమతి యిక్ష్వాకు - వంశవర్ధనుఁడు
స్థిరధైర్యనిధి జితేం-ద్రియుఁడు దారుండు
ధార్మికాగ్రణి ధీర్ఘ-దర్శి యత్యంత
నిర్మల చిత్తుండు - నిపుణ మానసుఁడు
బలవంతుఁడతి కృపా-పరుఁడు పుణ్యాత్ముఁ
డలఘుకీర్తి వినోది - యైశ్వర్య ఘనుఁడు
సత్యసంధుఁడు సర్వ-సముఁడర్థులకును
నిత్యదాతత్రి కర్మ-నిరతుఁడుత్తముఁడు
నతిసాహసుండ స-మాధికవైరి
నతరాజిలోకుఁడున్నత భుజాబలుఁడు
దశదిశల యశఃప్ర-తాపముల్ నించు
దశరుథుండల రునా-ధన్యు రాజ్యమున"[42]

ఇక్ష్వాకు వంశవర్ధనుడైన దశరథుడు 'స్థిర ధైర్యనిధి, జితేంద్రియుడు, ఉదారుడు, ధార్మికాగ్రణి, దీర్ఘదర్శి, నిర్మలచిత్తుడు, నిపుణమానసుడు, బలవంతుడు, కృపాపరుడు, పుణ్యాత్ముడు, సత్యసందుడు, నిత్యదాత, త్రికర్మనిరతుడు, ఉన్నత భుజాబలుడు' - అని వరదరాజు వర్ణించాడు. రాముని తండ్రిగా దశరథునకు పై గుణగణాలు వుండడం భావ్యమని కవి భావించి పైవర్ణన గావించి యుండవచ్చు

3 2 3 రసానుగుణ వర్ణనలు :

(1) వర్షఋతువును వరదరాజు వర్ణించిన విధమిది :

"గ్రీష్మాతపములఁ గ్రాఁ-గినయట్టి వసుధ
యూష్మంబె గావిరు-లుప్పతిల్లంగ
ననుఁబాసియున్న జా-నకిఁ బోలితాప
మున నున్న చంద మి-ప్పుడు విలోకింపు
కేతకీ కైరవ - క్రీడాసమీర

పోతముల్సేతమై - పొలపంబుఁ దెలిపె
ఈయేరుమద్దికం-టీగిరి మీఁదఁ
బాయక నవసుమ - ప్రచుర సంపదలు
ఏవిచారము లేని - యీరవిసుతుని
కైవడి దృష్టి మం-గళ కరంబయ్యె
అలఘు మేఘములు కృ-ష్ణాజినంబులుగ
జలధార లురముల - జన్నిదంబులుగ
యీనగంబులు చూచి-తే తమ మీఁది
మౌనులు వేషముల్- మాఱ్పడఁ దాల్చె
మెఱుపు గుంపుల చిరి-మిణి తరుటులను
హరిహయుఁడను సాది-యదలించి వేయ
సకిలించు నుత్తమా-శ్వము రీతి జలద
మకలంక గర్జల - నదె వచ్చెఁ గనుము
నీలమేఘంబులో - నెఱమించునట్టి
వాలిం మెఱుపు రా-వణుని యూరువుల
వసియించు మనసీత-వలె వడంకుచును
దెసలకు వన్నియఁ-దెచ్చెఁ జూచితివె
పర్జన్యుఁడను నొన-పరి మావటీఁడు
గర్జితంబనెడి ఘీం - కరణంబు సలుప
మెఱుపు టంకుశము చే-మీటికాల్మీటి
పఱువనీక యడంచి - పట్టిన నిలుచు
మదసింధురము రీతి-మబ్బు సంజోకఁ
జదలు గన్పట్టె ల-క్ష్మణ ! విలోకింపు."[43]

అని రాముడు వర్షాగమనాన్ని లక్ష్మణునికి తెల్పాడు.

ఒక ఉత్తమాశ్వం అశ్వికునిచే దెబ్బతిన్నప్పుడు సకిలించే విధంగా, మేఘాలు శబ్దం చేస్తూవచ్చాయని వరదరాజు రామునితో చెప్పించాడు. నీలమేఘం నుంచి వెల్వడిన మెఱుపుతీగ రావణునియూరువుల పైకూర్చున్న సీతలాగా వణుకుతూకూడా దిశలన్నీ కాంతిపుంతం చేసినట్లు రాముడు లక్ష్మణునకు తెలిపినట్లు కవి వర్ణించాడు. ఘీంకారం చేసే మదపుటేనుగును మావటీడు తన అంకుశంతో ఏవిధంగా నిలువరిస్తాడో ఆవిధంగా వర్షపుదేవత, మేఘాలకు కదలిక లేకుండా చేశాడని కవి వర్ణించాడు.

(2) వరదరాజు చేసిన శరదృతు వర్ణనను చూడండి.

"శరదవసరమున - సారస శ్రేణి
విరిసె భానుని కరా-విర్భూతి వలన!
కపురంపు నెత్తావి - కడలందు నుడిసి
రసముతో మకరంద-రసములు గ్రోలి
ఘుమ్మను తుమ్మెద - కొమ్మలచాలు
గమ్మన మొరయు మం-గళ గానములకు
వీనులు చొక్కఁగ-విని మేనులుబ్బి
దానధారలు సము-త్కటముగాఁ గురియఁ
బొలయుచుఁ గరులున్న - పొంకంబుఁ జూడు!
చలదద్రులన మీఱె- శారదవేళఁ
దామరపుప్పొడిఁ - దడియు రెక్కలను
సాములు మట్టిని - చల్లు కొన్నట్లు
తనవులపై నంటఁ - దరలహంసములు
పెనఁగెడు జక్కన - పిలుకలఁ నరిమి
తొలఁగని హంసికిఁ - దూఁడు లందించి
మెలఁగు చెల్వము లెంత - మెచ్చొదవించె!
సెలయేటి కెలని ప-చ్చికల మచ్చికలఁ
దలఁచెని యాలమం-దల విలోకింపు."[14]

అని రాముడు లక్ష్మణునితో అన్నాడు. పై వర్షా శరదృతు వర్ణనల్లో కవి భావుకత ప్రాబంధికంగా గోచరిస్తుంది. ఇక్కడ కవి వర్ణనకోసం వర్ణన చేసినట్లు కనిపిస్తుంది. ఈ రెండు వర్ణనలు కథాస్ఫూర్తిని కలిగించవు.

(3) వరదరాజు ఇంపుగా, మధురంగా సులభ గ్రాహ్యంగా కావించిన ఈ క్రింది కిష్కింధా పురవర్ణన తిలకించదగివుంది.

"అమరావతియొ కాక-యిల కాపురంబొ
హిమవన్నగమొ, వేల్పు-టిరవైన గిరియొ
యనఁగఁ గొండలు చుట్టు-నమర నన్నడుమ
ననుపమ భోగ భా-గ్యములఁ జూపట్టు
వానరపురము త్రో-వనె రాఁగ వీథి
లోనఁదారుండు నీ-లుఁడు శతబలియు

విజయసూర్యాంగద - ద్వివిద సుషేణ
గజగవయ గవాక్ష - గంధమాదనలు
పనసమ్మై నాక సం-పాతి సూర్యాక్ష
హనుమత సురగోము-ఖాగ్ని నేత్రులును
నలజాంబ వద్వీక-ర్ణక మయకుముద
మలయ విద్యున్మాలి - మైందగోకర్ణ
దధిముఖ ఋషభ మం-దారసు నేత్ర
దధివక్త్ర వీరహ-స్తసు పాటలులును
మొదలుగాఁగల కపి-ముఖ్యులుఁ జేరి
ముదము మీరఁగఁ గొల్వ- మ్రొక్కులు వేయ
నంగీకరింపుచు - నావలికేఁ
బంగారమిటికల - ప్రహరిగోడయును
నవరత్నముల రోహ-ణ గిరీంద్రమనఁగ
రవణంబు గలహజా-రము మగరాల
బోరు దల్పులు ద్వార-ముల మరకతపుఁ
దోరణంబులు నింపుఁ - దొలకించునట్టి
నగరిలో జానుమం-డల మంబరమున"[45]

4) రాముని గుణగణాల్ని వరదరాజు సరళమైన భాషలో చాలా రమ్యంగా వర్ణించాడు. ఈ కవీంద్రునికి రామునిమీద ఉన్నదైవ భక్తే దీనికి కారణమై ఉండవచ్చు

"రాముండు తేజోభి - రాముండు ధైర్య
విభవంబుగలవాఁడు - విజితేంద్రియుండు
త్రిభువనోన్నతుఁడు బు-ద్ధియు నీతి నేర్పు
నైశ్వర్యమును నంత-రరి జయస్ఫురణ
శాశ్వతంబులుగ ని-చ్చల నందు వాఁడు
ఎగుభుజంబుల వాఁడ - హీనబాహుండు
నగుమోమువాఁడు చిం-దపు మెడవాఁడు
తళుకుఁజెక్కుల వెడం-దయురంబు గలిగి
బలువైన విల్లు చేఁబట్టిన వాఁడు
కొమరొప్పు మౌళియు - గూఢ జత్రులును
నమరులలాటంబు - నడుగుల సొబఁగు

చామననెమ్మేను - చక్కందనంబు
తామరకన్నులు - తనరు నంగములు
మంగళాయతన కో-యల ముఖాంబుజము
రంగైన వాఁడు ధ-ర్మజ్ఞ భావనుఁడు
పరమసత్యాత్ముండు - ప్రజలకు నిహముఁ
బరము లీనేర్చు శో-భన కీర్తిశాలి
జ్ఞానాధికుఁడు సర్వ-సముఁడు వశ్యుండు
దీనులఁబోషించు - దృఢమానసుండు
జగములు నిర్మింప - సంరక్షసేయ
జగమెల్ల భరియింపఁ - జాలినవాఁడు
రక్షకుండఖిల ధ-రాజీవములకు
రక్షకుండెప్పుడు ధ-ర్మ విధానమునకు
నిజధర్మపాలన - నిపుణుండు మిగుల
స్వజన రక్షణమున - సరిలేని వాఁడు
వేదవేదాంగ సం-వేది కోదండ
వేదపారగుఁడస్త్ర - విద్యావినోది
సర్వశాస్త్రార్థ ని-శ్చయ మానసుండు
సర్వజ్ఞుఁడాత్మ వ-శంబగు వాఁడు
మఱపెఱుంగని వాఁడు - మనుజులు తనదు
పరిణామ మాసింపఁ - బరగెడు వాఁడు
వగపెఱుంగఁడు, సాధు - వర్తన వాఁడు
పగయెఱుంగఁడతి ప్ర-భావుఁడుత్తముఁడు
సదయాత్మకుఁడు విచ-క్షణుఁడు సజ్జనులు
కదిసి పాయక కొల్వఁ - గరమొప్పువాఁడు
జలరాశి నదులలో - సరివొత్తు గలియుఁ
గలయికవిబుధ సం-గతిఁ బేర్చువాఁడు
కలిమి గల్గినవాఁడు - ఘనుఁడు పూజ్యుండు
పలుమారు చూడఁ జూ-పట్టిన వాఁడు
చక్కని వాఁడు కౌ-సల్యాకుమారుఁ
డెక్కుడు గుణమున - కిరవైన వాఁడు "[46]

'రాముడు తేజస్సుగలవాడు, ధైర్యవంతుడు, విజితేంద్రియుడు, త్రిభువనోన్నతుడు, నగుమోమువాడు, ధర్మజ్ఞ భావనుడు, పరమ సత్యాత్ముండు, సర్వజ్ఞుడు, ఆత్మవశంబగువాడు, సాధువర్తన కలిగినవాడు' - అని వరదరాజు వర్ణించాడు. దేవతలు సైతం ఎవ్వనిపేరు వింటే భయకంపితులవుతారో అట్టి దుర్మార్గుడైన రాక్షసరాజు, రావణుని సంహరించిన రాముణ్ణి గూర్చి చెప్పడానికి కవి ఉద్యుక్తుడై నప్పుడు పై పదప్రయోగం వచ్చివుంటుందని చెప్పవచ్చు.

(5) రామునిమీద వున్న అమితమైన భక్తితో కవి ఆయన బలపరాక్రమాల్ని గురించి క్రిందివిధంగా వర్ణనచేశాడు.

"రాముని బలపరా-క్రమ శక్తు లింత
సామాన్యమే ! నీవు - శపథముల్ వలుక
శరములచే నదీ - సలిల ప్రవాహ
ములనైన నొకక్షణం-బున నిల్పగలఁడు !
అవని నక్షత్ర గ్ర-హావళినైన
దివియైనఁగినిసి భే-దించు నమ్ములను !
పాతాళమునఁ గ్రుంగి - పడిపోవునట్టి
భూతలంబైన ని-ల్పును కరాగ్రమున !
జలములు లేకుండ - జలధులింకించు
జలముల నించుని-ర్జల వారినిధుల
నిల మిన్నుగావించు-నిల సేయు మిన్ను
నెల నినునిగఁజేయు-నెల సేయు నినుని
పగలురేలును రేలుఁ-బగలును జేయు
జగతిపై నతనిక - సాధ్యముల్ గలవె ?
తలఁచిన విశ్వమెం-తయు వినిర్మించి
మలఁగించు విశ్వంబు-మాట మాత్రమున
నరికట్టు వాయువు - నల్లాడకుండ"[47]

'రాముడు నదీసలిల ప్రవాహాలనైన ఒకక్షణం నిలపగలడు నక్షత్రాల్నిగాని ఆకాశాన్నిగాని తన బాణాల్తో కూల్చగలడు. పాతాళంలో క్రుంగిపడిపోయే భూతలాన్ని కూడ తనచేతి వ్రేలితో నిలపగలడు. జలంలేని జలాశయాల్లో నీటిని నింపగలడు. భూమిని ఆకాశంగా, ఆకాశాన్ని భూమిగా చేయగలడు. చంద్రుని సూర్యునిగా, సూర్యుని చంద్రునిగా చేయగలడు. పగలును రేయిగా, రేయిని పగలుగా చేయ సమర్థుడు.

విశ్వాన్ని నిర్మించి క్షణంలో బూడిద చేయగలడు. మరియు గాలి లేకుండా అరికట్టగలడు' - అని వరదరాజు రాముని బలపరాక్రమాల్ని గురించి వర్ణించాడు. రాముడు దైవ స్వరూపుడు కాబట్టి ఆయనకు అసాధ్యమైన పనులు లేవని చెప్పే ఉద్దేశ్యంతోనే కవి పై విధంగా వర్ణనచేశాడని భావించవచ్చు

ఈ విధంగా వరదరాజు కవీశ్వరుని రచనలో వర్ణనావైశారద్యము అడుగడుగునా సముచితముగా, సరస హృదయా వర్జకముగా నొప్పారుచున్నది.

## 3.3 రసపోషణము :

పాఠకునికి కావ్యపఠనంవల్ల రసానుభూతి కలుగుతుంది రసానుభూతికోసం సహృదయుడైన వ్యక్తి కావ్యాన్ని చదువుతాడు సత్త్వగుణ వాసితమైన మనస్సుతో వున్నప్పుడే అతనికి ఆ రసానుభూతి తన్మయత్వం కలుగుతుంది అయితే రసాన్ని పోషించడంలో కవి కూడా శ్రద్ధవహించాలి ఏ పరిమితుల్లో ఉచితానుచిత పరిజ్ఞానంతో కవి వర్ణ్యవస్తువును చిత్రించినప్పుడే రసానందం కలుగుతుంది లేకపోతే రసాభాసమే మిగులుతుంది

నవరసాల్లో ముఖ్యంగా శృంగారాన్ని వర్ణించేటప్పుడు కవి అప్రమత్తుడుగా వుండాలి అది కత్తిమీద సాములాంటిది. శృంగార వర్ణనపట్ల కవులందరూ సాధారణంగా చాపల్యానికి లోనైనవారే. వాల్మీకి, తిక్కన, ఎఱ్ఱనవంటి మహాకవులకు మాత్రమే శృంగారం సత్త్వరూపంలో సాక్షాత్కారమైంది రామాయణంలో వాల్మీకి మహర్షి గావించిన శృంగార వర్ణనలు సుకుమారమైనవి గాను, హృదయగ్రాహ్యమైనవి గాను వున్నాయి. వాల్మీకి రామాయణాన్ని యథామూలంగా అనువదించు పూనికతో రచన కొనసాగించిన వరదరాజు రచనలోనూ రసపోషణ మనోజ్ఞరీతిలో నిర్వహింపబడినది అందుండి మచ్చునకు కొన్ని ఉదాహరణలు.

### 3.3 1 శృంగార రసము :

(1) వరదరాజు-విశ్వామిత్రుడు మేనకఅందచందాల్ని చూచి, తనతపస్సు ఫలించి ధన్యుడైనట్లు భావించాడు

"నడపుల మురిపెంబు - నగవులతేట
తొడల చక్కదనంబు - తురుము క్రేవంబు
కలికి చూపుల బాగు- గబ్బితనంబు
పలుకులఁ జూచి సం-కోచంబుమాని
తొయ్యలి గాదిది - తొలు కారుమెఱుపు"[48]

అనిభావించి ఆమెవద్దకు వచ్చి హస్తంచాచి వనితామణికి స్వస్తివాదం బొసంగి,

"ఆ రామముల నొంటి - నలసిన వాఁడ
నోరామ ! నీచెంత-నునిచి లాలింపు
తీఱని యాఁకలి - తీఱంగ నీవు
పారణయిడుము బిం-బఫలాధరమునఁ
బంచాగ్ని మధ్యత-పశ్రాంతి నీదు
మించుకౌఁగిటిలో శ-మింపంగఁజేయు
మేనితాపము దీఱ-మీనాంకు కేళి
నానందరసవార్ధి - యందుఁదేలింపు"
అని అంజలితో నిలువక మరీదిగజారిపోయి -
"మరుని బారికిలోఁగి - మానంబు వదలి
శరణుచొచ్చితినీదు-చరణంబులకును
బంటునయ్యెద నన్నుఁ-గని గొమ్మువాలుఁ
గంటి ! వేఁడిన యూడి - గములు చేసెదను"[4]

అని యామె పాదాలను శరణుజొచ్చాడు. 'తననుగైకొంటే బంటుగా వుండి ఊడిగాలు చేస్తా'నని సిగ్గువిడిచి చెప్పాడు. ఇలా ఇంద్రియ సంతర్పణమే శృంగారంగా వరదరాజు ఊహించాడు. అందువల్లనే 'తీరనియాకలి తీరంగ పారణయిడుము' అని వ్రాయడం జరిగింది. మూలంలోని "అనుగృహ్ణీష్వ భద్రంతే మదనేన సుమోహితమ్" అనే మాటలోని సొగసును ఈ కవి గుర్తించలేదు. ఈ విధంగా కవి విశ్వామిత్రుని ఔన్నత్యాన్ని తగ్గించడానికి నాటి సామాజిక వ్యవస్థ కారణంకావచ్చు.

(2) ఋష్యశృంగుని యెదుట వేశ్యలు తమ హావభావాల్ని ప్రదర్శించిన విధానాన్ని వరదరాజు చక్కగా వర్ణించాడు. వారు ముని యెదుట నవ్వుల వెన్నెలలు గాయించారు. కప్పురంపు పలుకులు రాల్చారు. అవయవాల చాకచక్యాన్ని ప్రదర్శించారు. వారిని చూచి మహర్షి దిగ్భ్రమనొంది, దిగ్గన లేచి, నమస్కరించి వారికి అర్ఘ్యపాద్యాదుల్ని ఒసగినాడు. పిమ్మట తన వృత్తాంతాన్ని వారికి తెలిపాడు. ఆ కలవాణులను చక్కగా చూసి వారి స్తనాల్ని శివలింగాలుగా భావించాడు.

"పూజింప శివలింగ-ములకేల లేవు
పానవట్టములందు - పాలిండ్లు నివురు
ముమ్మెదగుంపులఁ - దోలెదననుచు
కొమ్మననుడుటి ముం-గురులంటి త్రోచు

వేలిమి బోంట్లింత - వింతాయెననుచు
తేలిక కస్తూరి - తిలకముల్ మెచ్చు
స్వాదుగా గమగమ - వలచు నెచ్చోటి
బూడిదోయని గంధ - వొడికేలనంటు
యీవింత ముంజి(త్రా-శ్శెక్కడి వనుచు
తావేఁడు మేఖలా - దామముల్ చూచి
యేసీమ పటికంబు - లిట్లుండుననుచు
గాసిల్ల వజ్రాల - కడియముల్ ద్రిప్పు
నేచెట్టలను బుట్టు-నీ వల్కలంబు
లీచాయనని వల్వ-లెగనెత్తి చూచు
మంచివె రుద్రాక్ష- మాలికలనుచు
కాంచి నీలపుసరుల్- కన్నులనద్దు
రేకమించఁగ నుత్త-రీయంబులందు
చెకమండలువు లుం-చితిరంచు నవ్వు
చిగురాకులా యివి - చిమముదమనుచు
తొగరుఁగెమ్మోవు లం-దుక గిల్లఁజూచు
సిటులున్నయమ్మౌని - నింతులలోనఁ
గుటిలకుంతల మోర్తు-గొబ్బునఁగదిసి
రమ్మని మౌనిక - రమ్ముచేఁబట్టి
సమ్మతి నొకమౌని - చాటున నిలిచి
జిగిబిగి చన్నుల - చిఱుత సోఁకులను
గగురుఁదాల్పఁగమేనుఁ - గౌఁగిటఁజేర్చి
కరయుగళంబుపైఁ - గదియించి వచ్చి
చఱుచుఱుక్కున గోరు - సోఁకులంటించి
చెవిచెంత నెమ్మోము - చేర్చి మౌన్గన్ను
హవణింపఁజేసి పం-చాస్త్ర మంత్రములు
కలరవకలరావ - గళనాద భేద
కలనలచేత నం-గము మఱపించి"[50]

వారు ఋష్య శృంగుని మరులు గొల్పారు. వరదరాజు చేసిన పై వర్ణనలో హాస్యానికి బదులుగా మౌనిచాటు శృంగారం నెలకొనివుంది. ప్రబంధ యుగంనాటి రాజుల శృంగార వర్ణనకు ఇది దగ్గరగా వుందని చెప్పవచ్చు.

### 4.3.2 కరుణ రసము :

కరుణ రసపూరితములైన సన్నివేశాలు శ్రీ మద్రామాయణంలో అనేకం ఉన్నాయి. వరదరాజు రసభావ విన్యాసానికి ద్విపదమిక్కిలి అనుకూలం కావడంవల్ల వరదరాజు తన ద్విపద రామాయణంలో కరుణ రసాన్ని చక్కగా పోషించాడు.

(1) శ్రీరాముడు తన బాణంతో వాలిని నేలగూల్చాడు. అప్పుడు తార, తన భర్తతో పాటు తనను కూడా చంపుమని రాముణ్ణి ప్రార్థించే సన్నివేశాన్ని వరదరాజు కరుణ రసపూరితంగా రచించాడు.

"ఏయమ్ముచేఁ వాలి-నేసితిరిప్పు
డాయమ్ము చేఁదన - యాయమ్ము నాఁటు
నేసిన వాలిలో-నెద నాసియున్న
గాసి యంతయుఁ దీఱి-కాంతు సద్గతిని!
ననుఁబాసి వాలియుం-డఁగ లేఁడు క్షణము
కననొల్లఁడ మరలో-క సరోజ ముఖుల
మీరు జానకితో ని-మేషంబుఁ బాయ
నేరనిగతి నర్థ - నిమిష మాత్రంబు
ననుఁ బాయలేఁడు వా-నర వజ్రపాణి
యనుపుము కూర్చి పు-ణ్యము నీకుఁ గలదు
స్త్రీవధ దోషంబు-చే కూడు ననుచు
దేవ! నీయాత్మఁ జిం-తిం చెదవేని
యేనాటఁ దానఁగా - నీమేను వాలి
లోనర్థ బాగ మా-లోకింప వీవు!
వాలిఁ జంపెదనని - వరమిచ్చి ప్రతిన
చాల చేసితివి భా-స్కర పుత్రుతోడ
నట్టి ప్రతిజ్ఞకు - హానిరాకుండ
గట్టిగా నేయు మీ-కడమ సగంబు
వాలిఁ జంపిన కీర్తి-వన్నెకు నెక్క
నీలోనె తనుఁబడ - నేసితివేని
జలజాక్ష! యిదివేళ - శాస్త్రసమ్మతము
వాలినేసిన యట్టి - వాఁడవే తారఁ

గూల నేసినఁబతిఁ - గూర్చితివేని
నీకుఁ గన్యాదాన-నియత ఫలంబు
చేకూడు ---------------------- "[51]

పై పంక్తుల్లోని తారమాటలు శ్రీరాముని హృదయాన్ని ద్రవింపజేసేవిగా వున్నాయనడంలో ఏలాంటి సందేహంలేదు

(2) తనకు కలిగిన శాపవృత్తాంతాన్ని దశరథుడు కౌసల్యకు తెలిపే సందర్భం శ్రీరామాయణంలో కరుణ రసపూరితమైంది. దశరథుని బాణానికి ఆహుతియైపడివున్న ముని పుత్రునిమీద చేతులు ఉంచి వృద్ధులైన యాతని తల్లిదండ్రులు విలపించడాన్ని వరదరాజు ఈ విధంగా వర్ణించాడు

"అదియేఁటి కన్నమ-హాత్మ ! మాతోడ
మదినల్గితివొ యొక్క - మాటాడ వేల ?
యీనేలఁ బడియుండ - నేఁటికి నీకు
మానుపంజెల్లదే - మాయార్తి నీకు
ఇదెనేడు నీజన-యిత్రి శోకింప
మదిఁ గనికరముంచి - మానుప వేల ?
శ్రవణ హితంబుగా - శాస్త్రపురాణ
నివాహమెవ్వరి చేత-నే విందునింక
సమయోచిత క్రియల్- జపములు దీర్చి
తమకు నెవ్వాఁడు వం-దన మాచరింపు
అలసి యాకొన్న వా-రని కందమూల
ఫలము లెవ్వఁడు మాకు - భక్తితో నొసఁగు
కన్నుల నిరువురఁ-గానమీ మమ్ము
నన్న ! రక్షింప - సమర్థుఁడెవ్వాఁడు
మముడించిపోవ ధ-ర్మముగాదు నీకు
తనుకడ కేతెమ్ము - తనయ ! యీ ప్రొద్దు
ఱేపు మువ్వురముఁ గో-రిన యట్టియెడకు
వేపోద మొంటిగా - విడిచి పోఁజనదు"[52]

(3) సీత కనపడకపోవడంతో శ్రీరాముడు ముల్లోకాల్ని భస్మం చెయ్యడానికి విల్లుచేబూనినాడు. సీతను తాను పర్ణశాలలో వదిలినవిధంగా వన్నెవాసి తరగకుండా తెస్తానని శ్రీరాముడు చెప్పాడు. ఆఘట్టాన్ని వరదరాజు ఈ విధంగా చిత్రించాడు.

"దేవగంధర్వ దై-తేయకింపురుషు
లీవేళ మనసీత - నెప్పటియట్ల
వేగంబె నాచేత - విల్లందు మునుపె
జాగుసేయక పర్ణ-శాలలో నుంచి
బోయినఁబోయిరి - పోకున్న నెటకుఁ
పోయినఁద్రుంతు నే-భువనంబు లెల్ల
నూరక తెచ్చిన-నొప్పు కొనంగ
నేరుతుమే ధర-ణీ తనూభవను!
ముడిచిన పువ్వులు - ముడిచిన మేరఁ
దొడిగిన సొమ్ములు - తొడిగిన కరణిఁ
గట్టిన వస్త్రంబు - గట్టినయట్లు
పెట్టిన తిలకంబు - పెట్టిన మాడ్కి
వేసిన కీల్గంటు - వేసిన జాడఁ
జేసిన వీడెంబు - చేసిన పోల్కి
నవ్విన నెమ్మోము - నవ్విన రీతి
జవ్వని దెచ్చియుం-చక మాననిపుడు!"[53]

(4) పర్ణశాలలో సీత కనపడక పోవడంవల్ల శ్రీరాముడు హృదయ విదారకంగా విలపించాడు. ఈ ఘట్టాన్ని వరదరాజు కరుణ రసభరితంగా రచించాడు

"తిలకంబ! కానవే - తిలకలలాట?
నళులార! కానరే-యళి నీలకచను?
హరిరాజ! కానవే - హరిరాజ మధ్యఁ?
గరివర! కానవే - కరివరగమన?
హరిణంబ! కానవే - హరిణాయ తాక్షి?
గురివింద! కానవే - కురువిందరదన?
లతలార! చూపరే - లతి కాలతాంగి?
శతపత్రమా! ఏది - శతపత్రి గంధి?
మల్లిక! కానవే - మల్లికానఖరఁ?
బల్లవమా! చూపు - పల్లవాధరను?"[54]

(5) శ్రీ రాముడు సీతా వియోగ భారాన్ని భరించలేక పోయాడు ఆయన విరహవేదనను ఆవిష్కరించడంలో కవి శృంగార, కరుణ రసాలను ప్రాచుర్యంగా పరిపోషించి ఈ క్రింది రీతిని రచించాడు.

"కన్నుల నెఱిఁగించు - గలయింగితంబు
చిన్ని నవ్వులఁ దెల్పు - జిత్తాభిమతము
సిబ్బితిచేఁ జూపు-శీల గౌరవము
గబ్బిచన్నుల నెఱఁ-గఁగఁ జేయువలపు
యలిగి యుండగ నేర-దవలి మోమిడనుడు
తలఁప దెవ్వరినిఁ జిం-తకులోను గాదు
యేను గాసిలియున్న - యెఱిఁగి హితోక్తి
దానూ రడించి సం-తాపంబుఁ దీర్చు
నడవి యయోధ్యగా-నన్నింటి మారు
పడఁతి తానయి నిల్చి - పరితుష్టఁ జేయు
తలఁచినట్ల మెలంగుఁ - పనమదిడాప
దలయికఁ జూప దే-మనిన సైరించు
నగుమోముతోఁ జేరి-నా చెంత నిలిచి
తగిన మాత్రంబె మె-త్తని మాటలాడు
నట్టి సీతకు బాయు-నట్టి నన్నీవు
చుట్టుక దిరిగియే - సుఖము గాంచెదవు ?"[55]

**3.3 3 అద్భుత, భయానకములు :**

వరదరాజు కవి ఆశ్చర్యాన్ని, భీతిని కలిగించే సన్నివేశాల్ని సైతం ఈ ద్విపద కావ్యంలో చక్కగా చిత్రించాడు. వాటిలో మచ్చుకు కొన్ని ఉదాహరింపబడుతున్నాయి.

(1) సీతను నమ్మించడానికి రావణుడు మాయా కల్పితమైన శ్రీరాముని తలను ఆమె ముందర పెట్టించాడు. ఆ శిరస్సును చూచిన సీత

"హా ! రామ ! హా ! నాథ "-యని పొగలుచును
వారిజానన సీత-వగల నిట్లనియె
కైకేయి ! నీదు సం-కల్పంబు నీకు
చేకూడె నీవు కో-ల్చినదె దైవంబు

నోములన్నను నీవు - నోఁచిన యవియె
నోములు కడతేఱెను తపంబు నీకు
నడవుల కేఁటికి - నంపితివమ్మ ?
చెడుఁడు పొందని మేము - చేసినదేమి ?
కడలేని శోక సా-గరములో నిట్లు
పడి యీఁద వలసె దె-ప్ప యొకండు లేక
ముచ్చట మున్నీట -మునుఁగుటఁ గాక
వచ్చెను తనకిట్టి - వైధవ్య వృత్తి"[56]

భీతిచెంది, తమ అవస్థకు కారణమైన కైకేయిని తూలనాడింది. ఇలా కైకను నిందించడంలో సీత ఔన్నత్యం కొరవడిందనక తప్పదు

(2) ఇంద్రజిత్తు మాయా సీతను తనరదంపై ఉంచి ఆమె తలను తెగవ్రేయడానికి ఉద్యుక్తుడవుతాడు అప్పుడు ఆమె ఆర్తారావాన్ని కవి ఈ విధంగా చిత్రించాడు

"హారామ ! హారామ ! - హాసుమిత్రాకు
మారక ! హా హను-మంత ! రావయ్య !
నమ్మితి ప్రాణదా-నము చేసి కనిక
రమ్మున విడిపింప-రావె ! --------------"[57]

ఇంద్రజిత్తును ఎదుర్కొని తనను కాపాడగలిగే శక్తి రామలక్ష్మణ, హను మంతులకు మాత్రమే వుందని ఆమె నమ్మకం అందుకే "హారామ ! హాసుమిత్రా కుమారక ! హనుమంత ! " అని భీతిచే అర్థించింది

3 3.4 వీరరసము

వరదరాజు ఈ కావ్యంలో వీరరసాన్ని అద్భుతంగా పోషించాడు. ఈయన రాజు కావడంవల్ల, యుద్ధంలో పాల్గొనివుండటంవల్ల వీరరసస్ఫో రకాలైన సన్నివేశాల్ని మనోహరంగా వర్ణించాడు మాసరాకు ఇంద్రజిత్తు కావించిన ఈక్రింది యుద్ధఘట్టం తిలకింపదగి వుంది

"అసురేంద్ర సుతుఁడు బ్ర-హ్మాస్త్ర ప్రభావ
లసమాన తేజో - విలాసియై లాసి
నెరయించు నొకచోట - నీలమేఘములఁ
గురియించు నొకచోట - ఘోరాస్త్ర వృష్టి

మలయించు నొకచోట - మంచు పెందెరలు
పొలయించు నొకచోట - భుగభుగ బొగలు
వినుపించు నొకచోట - విలునారి మ్రోఁత
కనిపించు నొకచోట - గాంచన రథము
చెలఁగించు నొకచోట - సింహనాదములు
నెలకొల్పు నొకచోట - నేమికాధ్వనులు
నడరించు నొకచోట - హయ హేషితములు
జడియించు నొకచోట - శక్తులు వైచి
విసివించు నొకచోట - విలుకేలఁ బూని
నసముంచు నొకచోట - నాకృతిఁ జూచి
యీలీల నెలయించె - యింద్రజిత్తుండు !"[59]

ఈ రీతిగా ఈ ద్విపద కృతియందు ఎల్లయెడల ఈ కవిరాజు కావించిన రసపోషణ సందర్భోచితమై, సహృదయ హృదయాహ్లాదకారియై వరలినది

## 3.4 కథాసంవిధాన చాతురి :

కావ్యం కథాప్రాధాన్యం కలది కథకు ఇతివృత్తం ముఖ్యం. కావ్య నిర్మాణానికి ఏదో ఒక విధమైన ఇతివృత్తాన్ని స్వీకరించడంతోనే సరిపోదు ఆ ఇతివృత్తాన్ని పదార్థరూపంలో వివిధ సమస్యల్ని చిత్రీకరించుకొంటూ రచయితకు కథాకథన సరళత ఉండాలి లేకపోతే కావ్యం పాఠకుల్ని ఆకట్టుకోలేదు ఒక్కొక్క కవి ఒక్కొక్క పద్ధతిలో కథను నడిపిస్తాడు కవులు కావ్యంలో కథను నడిపించే తీరులోను, చెప్పే విధానంలోను తమ నైపుణ్యాన్ని కనబరుస్తారు

కావ్యానికి వస్తువు ఎంత ముఖ్యమో ఆ వస్తువుకు మంచి రూపాన్నిచ్చే శిల్పంకూడ అంతే ముఖ్యం. రచయిత శిల్పాన్ని సాధనంగా ఉపయోగించుకొని తాను చెప్పదలచుకొన్న భావాల్ని స్పష్టంచేస్తాడు. రచయిత చెప్పదలచుకొన్న భావం పాఠకునికి అవగతమైతేనే కథ కళాత్మకంగా ఉన్నట్లు మనం భావిస్తాం

వరదరాజు శ్రీ రామాయణంలో, ఎక్కడా లోపంలేకుండా, వస్తువైశిష్ట్యం దెబ్బతినకుండా, పాఠకుల హృదయాల్లో సన్నివేశాలు హత్తుకుపోయే విధంగా కథను నడిపాడు ఆయన మూలకథకు అక్కడక్కడా చేసిన కొన్ని మార్పులు చేర్పులు దాని ఔన్నత్యానికి ఉపకరించేవిగానే ఉన్నాయి

ఈ విషయమ్మై మచ్చుకు కొన్ని ఉదాహరణలు :

(1) తనను వెతుక్కొంటూ అడవులకు వచ్చిన భరతుణ్ణి తిరిగి అయోధ్యకు వెళ్ళమని శ్రీరాముడు తెలిపిన విషయం మూలంలో మూడు శ్లోకాల్లో వుంది.

"శ్లో || త్వం రాజా భరత ! భవ స్వయం నరాణాం
వన్యానా మహ మపి రాజరాణ్మృగాణామ్ |
గచ్ఛ త్వం పురవర మద్య సంప్రహృష్ట
స్సంహృష్ట స్త్వహ మపి దణ్డకాన్ప్రవేక్ష్యే ||

శ్లో || ఛాయాం తే దినకరభాః ప్రబాధమానాం
వర్షత్రం భరత ! కరోతు మూర్ధ్ని శీతామ్ |
ఏతేషా మహ మపి కాననద్రుమాణాం
ఛాయాం తా మతిశయినీం సుఖ శ్రయిష్యే ||

శ్లో || శత్రుఘ్నః కుశల మతిస్తు తే సహాయ
సౌమిత్రి ర్మమ విదితః ప్రధానమిత్రమ్ |
చత్వారి స్తనయవరా వయం నరేంద్రం
సత్యస్థం భరత ! చరాను మా విషాదమ్ ||"[59]

'నీవు మనుష్యులందరికి రాజువుకమ్ము నేను వనాల్లో వుండే మృగాలకు రాజుగా వుంటాను. నీవు శీఘ్రంగా అయోధ్యకు పొమ్ము నేను ఇప్పుడే దండ కారణ్యానికి పోతాను, శ్వేతచ్ఛత్రం నీడలో నీవు, అడవి వృక్షాల నీడలో నేను ఉండాల. నీకు సహాయకుడుగా శత్రుఘ్నుడు, నాకు ముఖ్య స్నేహితుడుగా లక్ష్మణుడు ఉన్నారు మనం నలువురము తండ్రిమాట సత్యంచేస్తాం' అని రాముడు భరతునకు తెలిపనట్లు మూలకర్త వ్రాశాడు.

మూలంలోని పై భావాన్ని వరదరాజు పెంచి రచించాడు.

"వసుల కిచ్చుట నేను - వసుమతి కీవు
నొనరంగ దొరలమై - యుండంగ వలయు
వంచికావన మహీ - స్థలముల నేను
మండితచ్ఛత్ర చా-మరముల నీవు
కందమూల ఫలాది-కముంచే నేను
నంది తరసరసా-న్నంబుల నీవు

క్రమముతో నారచీ-రలు గట్టియేను
రమణీయ దివ్యాంబ - రమ్ముల నీవు
పనిత జటాకలా-పములతో నేను
జననుత రత్నభూ-షణముల నీవు
ముందర వనమృగం-బులు గొల్వ నేను
నిందతీకిని కొల్పు- నిచ్చుచు నీవు
సౌమిత్రి యొక్కఁడి-చ్చట నుండ నేను
సౌమిత్రి యొక్కఁడ-చ్చట నుండ నేను
రాజిత గిరికంద-రం బేల నేను
రాజగేహ పరంప-రల యందు నీవు
సీతయొక్క తె సేవ-సేయంగ నేను
శీతాంశు వదనలు - సేవింప నీవు
పాద సంచార వై-భవముతో నేను
వేదండ తురగాది - విహృతిచే నీవు
ఈ చిత్రకూట మ-హీధరం బేను
ఆ చక్రవాళ మ-హాద్రి నీవు
-----------------------------
-----------------------------
కొనసాగ కున్నచో - గొడుకు లేమిటికి ?"[60]

మూలకథకు కవి ఇక్కడ చేసిన పెంపు కావ్య గౌరవాన్ని పెంచేదిగా వుంది. వనజీవితానికి నగర జీవితానికి మద్య భేదాన్ని పాఠకులకు స్పష్టంగా తెలియజేయాలనే ఉద్దేశ్యంతో వరదరాజు ఈ మూల విస్తరణ చేసియుండవచ్చు కవి తన సమాజంలో లక్ష్యమయ్యే 'నందితరసర సాన్నంబులను, రమణీయ దివ్యాంబరములను, రత్న భూషణములను' ఇక్కడ చొప్పించాడు

(2) లంకకు ఆకాశ మార్గంలో వెళ్ళుతూవుండిన హనుమంతుడు తనకు అడ్డం వచ్చిన సింహిక అనే రక్కసిని హతమార్చాడు. అందులకు ఆకాశంలో సంచరించే భూతాలన్నీ అతణ్ణి పూజించాయని మూలకర్త ఒక శ్లోకంలో తెల్పాడు.

"శ్లో|| ధృతి ర్దృష్టిర్మతి ర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి |,
సతై స్సంభావితః పూజ్యః ప్రతిపన్న ప్రయోజనః"[61] ||,

మూలంలోని పై శ్లోకభావాన్ని వరదరాజు పెంచి రచించాడు.

"ఒకచోట గంధర్వు - లొకయెడ సిద్ధు
లొకట విద్యాధరు - లొకమేర సురలు
నొకత్రేవ మౌనులు - నొకతరి యక్షు
లొక చక్కిఁ బన్నగు - లొకవంక మునులు
సేవింప రంభోర్వ - శీమేనకాది
దేవతాభామి నుల్ - తెరువులు గట్టి
సకల దిక్పాలకుల్ - సముఖంబునందు
నొకరొకళ్ళను జేరి -యోలగింపంగఁ
దనుఁజూచి విరివాన - దట్టంబు గాఁగ
వినువీథిఁ గురియించు - విబుధ నాయకుని
గనుఁగొని యవ్వలఁ - గడచి దక్షిణపు
వనరాశి గట్టు పా-వని విలోకించి
---------------------------
---------------------------
లంక వీక్షించి మె-ల్లన చెంతవ్రాల "[62]

సింహికను సంహరించడం వల్ల హనుమంతుణ్ణి, ఆకాశంలో సంచరించే భూతాలన్నీ పూజించాయని వాల్మీకి ఒక్కమాటలో చెప్పాడు. అయితే వరదరాజు హనుమంతుణ్ణి, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు, సురులు, మునులు, యక్షులు, పన్నగులు సేవించారు. రంభ, ఊర్వశి, మేనకాది దేవతా భామినులు తెరువులు కట్టారు ఆతని పై పూలవాన కురిసింది.

రామాయణ కథౌన్నత్యాన్ని పెంచే ఉద్దేశ్యంతో కాబోలు వరదరాజు ఇలాంటి చోట్ల మూలానికి పెంపుచేశాడు. కవి ఇక్కడ హనుమంతునకు గొప్పతనం ఆపాదింపబడునట్లు మూలానికి పెంపు చేయడంద్వారా, ప్రధాన కథయొక్క ఔన్నత్యం పెంపొందినదని చెప్పవచ్చు.

వరదరాజకవి రామాయణ కథా ప్రాధాన్యాన్ని పెంచే ఉద్ధేశ్యంతో కాబోలు అక్కడక్కడ మూలకథను సంక్షేపించాడు.

(3) రాముడు అడవులకు పోయిన తర్వాతి అయోధ్యాపురి యొక్క పరిస్థితిని గూర్చి మూలంలో ఐదు శ్లోకాల్లో చెప్పబడివుంది.

శ్లో|| ఇత్యేవం విలప[illegible] ప్రాం స్త్రీణాం [illegible] రాఘవమ్ |
[illegible] దినకరః [illegible] |

'శ్లో|| నష్టజ్వలనసంపాతా ప్రశాన్తాధ్యాయసత్క థా |,
తిమిరేణాభిలిప్తేవ సా తదా నగరీ బభౌ ||

శ్లో|| ఉపశాన్తవణిక్పణ్యా నష్టహర్షా నిరాశ్రయా ।
అయోధ్యా నగరీ చాసీ న్నష్టతారమివామ్బరమ్ ||

శ్లో|| తథాస్త్రియో రామనిమిత్త మాతురా
యథా సుతే భ్రాతరి వా వివాసితే |,
విలప్య దీనా రురుదు ర్వి చేతస
స్సుతైర్హి తాసా మధికో హి సో8 భవత్ ||

శ్లో|| ప్రశాన్త గీతోత్సవనృత్తవా దనా
వ్యపాస్తహర్షా పిపి తాపణోదయా |,
తదా హ్యయోధ్యా నగరీ బభూవ సా
మహార్ణవ స్సంక్షిపితోదకో యథా || "[63]

'రాముడు అడవికి పోయిన తర్వాత అయోధ్యాపురంలోని స్త్రీలు తమగృహాల్లో రామునిగూర్చి విలపించారు సూర్యాస్తమయమై రాత్రి అయిన తర్వాత ఆహితాగ్నులు అగ్నిహోత్రాల్లో ప్రణయింపలేదు బ్రాహ్మణులు వేదాధ్యయనం కాని పురాణ పఠనంగాని చేయలెదు. వర్తకులు అంగళ్ళను తెరువలేదు పాటలు, ఆటలు, వాద్యాలు, ఉత్సవాలు నిలిచిపోయాయి తమకొడుకు గాని, తోబుట్టువుగాని అరణ్యానికి పోతే ఏవిధంగా దుఃఖిస్తారో ఆ ప్రకారంగా పౌరస్త్రీలు రాముని నిమిత్తమై దుఃఖంతో దీనులై రోదనం చేశారు ఎవ్వరికీ సంతోషమే లేకుండింది కాబట్టి ఆపురం చీకట్లు క్రమ్మినట్లు ఉండిందని మూలకర్త తెలిపాడు

మూలంలోని పై భావానికి వరదరాజు గావించిన కుదింపు చూడండి.

"అని పురస్త్రీలు నా-యకులతో మృత్యు
వును బోలు కైక చై-వులకు శోకింప
నంతట బానుడ - స్తాద్రికిఁ జేరె
నెంతయు మహి నెల్ల-నిరులల్లు కొనియె
అధ్యయనాగ్ని హో-త్రాదులు లేక
విధ్యుక్త కర్మముల్- వీడుకోలొంది
యుదక శూన్యంబైన - యుదధియుం బోలి
యొదవు నిశ్శబ్దత - నుండె పట్టణము"[64]

ప్రధాన కథ యొక్క నడకకు, మూలంలో ఈ విషయానికి ఉన్న విపులత్వం అవరోధం అవుతుందని భావించి కవి పై విధంగా 'అధ్యయనాగ్నిహోత్రాదులు లేక విధ్యుక్త కర్మములల్ వీడు కోలొంది' అని సంక్షేపించి యుండవచ్చు. అయోధ్యాపుర ప్రజల మనస్సుల్లో రామునికి గలస్థానాన్ని మూలకర్త కనులకు కట్టినట్లు తెలిపాడు. అయితే అనువాదంలో ఇది కొరవైంది

(4) రాముడు పదునాలుగు వేలమంది రాక్షసుల్ని వధించడం గురించి రావణుడు మారీచునకు తెలుపడం మూలంలో పదిశ్లోకాల్లో వుంది

"శ్లో|| మారీచ ! శ్రూయతాం తాత ! వచనం మమ భాషతః |,

---------------------------------------

---------------------------------------

తే త్విదానీం జనస్థానే వసమానా మహాబలాః |,
సజ్జితాః పరమాయత్తా రామేణ సహ సంయుగే ||
నానా ప్రహరణోపేతాః ఖరప్రముఖ రాక్షసాః |,
తేన సంజాతరోషేణ రామేణ రణమూర్ధని ||
అనుక్త్వా పరుషం కిఞ్చి చ్ఛరై ర్వ్యాపారితం ధనుః |,
చతుర్దశ సహస్రాణి రక్షసా ముగ్రతేజసామ్ ||
నిహతాని శరై స్తీక్ష్ణై ర్మానుషేణ పదాతినా |,
ఖరశ్చ నిహత స్సంఖ్యే దూషణ శ్చ నిపాతితః ||
హత శ్చ త్రిశిరా శ్చాపి నిర్భయా దణ్డకాః కృతాః |,
పిత్రా నిరస్తః క్రుద్ధేన సభార్యః క్షీణజీవితః"[65] ||

'మారీచ ! నేను చాలా కష్టాల్లో వున్నాను ఇలాంటి స్థితిలో నాకు పరమగతివినీవే నాతమ్ముడు ఖరుడు, మహాబాహుడైన దూషణుడు, నాచెల్లెలు శూర్పణఖ, త్రిశిరుడు మొదలైన రాక్షసులు నా ఆజ్ఞచేమునుల్ని బాధిస్తున్నారని రాముడు వారిని ఎదిరించాడు ఒకనాడు ఆ రాక్షసులు నానావిధ ఆయుధాల్తో రామునితో యుద్ధంచేశారు ఆ యుద్ధంలో రాముడు పదునాలుగు వేలమంది రాక్షసుల్ని వధించాడు ప్రస్తుతం దండకారణ్యంలో ఋషులు ఎంతమాత్రం భయం లేకుండా ఉన్నారు తండ్రిచే తరుమబడినవాడు, భార్యా సహితుడు, ఆయుస్సు దీరినవాడు, క్షత్రియాధముడైన రాముడు అంత సైన్యాన్ని ఒక్కడే వధించాడు' - అని రావణుడు మారీచునకు తెలిపినట్లు మూలకర్త రచించాడు.

వరదరాజు మూలంలోని పై భావాన్ని సంక్షేపించాడు :

"ఓయి! మారీచ! నీ-వొకఁడవే కాక
యేయెడ వెదకిన-నేఁ బ్రాపుఁగాన!
ఖరదూషణాది రా-క్షసుల నందఱను
నరుఁడొక్కఁ డెదురుగా-నక సంహరించె
జడియక మన జన-స్థానంబు చెఱిచి
కడులావుతో దండ-కావనంబునను
ఐదునాల్గు వేలైన - పలల భోజనులఁ
జిదిమి వైచితిని - మీచింతలు దీరె
ననుచు బీరములాడి - యందలి మునులు
తనుమెచ్చ దమ్ముఁడుఁ - దాను నున్నాఁడు
అందుపైఁ దనకది - యాలని యొక్క
సుందరిఁ దెచ్చియుం-చుక యున్నవాఁడు
రాముఁడు మిగుల దు-ర్జనుఁడు మూర్ఖుండు"[66]

వరదరాజు ఇక్కడ మూలంలో రెండవశ్లోకం నుంచి ఏడవశ్లోకం వరకు ఉన్న భావాన్ని పూర్తిగా పరిహరించాడు. ఈ శ్లోకాల భావం అసందర్భమేగాక, అనవసర విస్తరణ అని కవి భావించి పరిహరించి ఉండవచ్చు. ఈ పరిహారణ ఎంతేని సమంజసమని చెప్పవచ్చు.

(5) తన ఆశ్రమానికి వచ్చిన సీతారామలక్ష్మణులకు అగస్త్యుడు అతిథి సత్కారం చేశాడు. ఋషులైనవారు అతిథిపూజ చేయకుంటే కలిగే పాపాన్ని గూర్చి అగస్త్యుడు ఆ సమయంలో రామునికి తెలిపిన విషయం మూలంలో మూడు శ్లోకాల్లో వుంది.

"శ్లో|| అగ్నిం హుత్వా ప్రదాయార్ఘ్య మతిథిం ప్రతిపూజయేత్|,
అన్యథా ఖలు కాకుత్స్థ! తపస్వీ సముదాచరన్||
దుస్సాక్షీవ పరే లోకేస్వాని మాంసాని భక్షయేత్|
రాజా సర్వస్య లోకస్య ధర్మచారీ మహారథః||
పూజనీయశ్చ మాన్యశ్చ భవాన్ప్రాప్త ప్రియాతిథిః|,
ఏవ ముక్త్వా ఫలైర్మూలైః పుష్పై రన్యైశ్చ రాఘవమ్"[67]||

'రామా! ఋషియైనవాడు అతిథి పూజ చేయకుంటే తప్పుడు సాక్ష్యం చెప్పిన వాడివలె పరలోకంలో తనమాంసాన్ని తానే భక్షిస్తాడు. సమస్తలోకానికి ప్రభువు,

ధార్మికుడు, మహారథుడు, పూజనీయుడు, మాన్యుడవైన నీవు వచ్చినపుడు నిన్నుపూజించుట నాధర్మం' - అని చెప్పి, అగస్త్యుడు ఫలమూలాలు, పుష్పాలు, వనద్రవ్యాలతో రాముణ్ణి పూజించాడని మూలకర్త తెలిపాడు.

మూలంలోని పై భావాన్ని వరదరాజు యథావిధిగా తెనిగించాడు.

"నరనాథ తనయ ! వా-న ప్రస్థులైన
పరమ యోగీంద్రులు - పావక క్రియలఁ
దీరిచి చేరిన - తెరవరులకును
నీరమన్నమునిచ్చి - నెగులు వారింపఁ
దలఁపని యధముండు - దబ్బరసాక్షి
వలికిన నీచుఁడు-వడు నారకముల
తాఁబడి తనమేను - తానె భక్షించి
లోఁబడి వాఁడధో - లోకమ్ము వొందు
నని ధర్మశాస్త్రంబు - లందుఁ దెల్పుటను
నినుఁ బూజసేయుట - నీతంబు మాకు !
కందమూల ఫలాది-కములు మాచేత
నంది తృప్తుఁడవుగ-మ్మ ------------"[68]

అతిథి పూజా ప్రాధాన్యాన్ని గురించి మూలంలో వున్న విషయాన్ని యథాతథంగా అనువదిస్తేనే సామాజిక ప్రయోజనాన్ని, కథాప్రయోజనాన్ని నెరవేర్చినట్లు అవుతుందని కవి భావించినందువల్లనే ఆయన ఇక్కడ యథాతథాను వాదం చేశాడు

రామబాణ పీడితుడైన వాలి శ్రీరాముణ్ణి తూలనాడే ఘట్టంలో మూలంలో నెలకొని వున్న ఈ క్రింది శ్లోకాలు పరికింపదగి ఉన్నాయి.

"శ్లో|| రాజహా బ్రహ్మహా గోఘ్నః శ్చోరః ప్రాణివధే రతః |,
---------------------------------------
---------------------------------------
ప్రసుప్తః పన్నగేనేవ నరః పానవశం గతః"[69]

వాలి రామునితో 'రాజును చంపినవాడు, బ్రహ్మఘ్నుండు, గోహత్య చేసినవాడు, చోరుడు, ఎల్లప్పుడూ ప్రాణివధనే చేయువాడు, నాస్తికుడు, అన్నకంటె ముందుగా పెళ్లిచేసికొన్నవాడు నరకానికి పోతారు. ఇతరులపై కొండెములు

చెప్పువాడు, లుబ్ధుడు, మిత్రుని హతమార్చిన వాడు, గురుభార్యను కూడిన వాడును పాపాత్ములు పొందే లోకాల్ని పొందుతారు

నన్నువేట వినోదంతో వధించితినని చెప్పడానికి నీకు అవకాశంలేదు. నీవంటి ధార్మికులైన సత్పురుషులు నాచర్మాన్ని ధరించరు. నారోమాల్ని ఉపయోగించరు. నా ఎముకలను స్పృశింపరు నా మాంసాన్ని భక్షింపరు. ఏదుపంది, అడవిపంది, ఉడుము, కుందేలు, తాబేలు-ఈ ఐదు మృగాలు మాత్రమే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు భక్ష్యాలు

సర్వజ్ఞయగుతార హితము, సత్యమునైన వాక్యాన్నే నాకు చెప్పింది. నేను అజ్ఞానంతో ఆ మాటను అతిక్రమించడం వల్లనే ఇప్పుడు మృత్యువు వాతపడ్డాను మగాడు దుష్టుడైతే ఉత్తమ గుణవతి అయినస్త్రీఎలాంటి కష్టాల్ని ఎదుర్కోవాల్సి వస్తుందో ఆ ధర్మాన్ని అవలంబించే నీవు ప్రభువుగా ఉండునంతకాలం ప్రజలు బాధపడాల్సిందే

నీవు రహస్యంగా ఇతరులకు అప్రియం చేయువాడవు పరులకు అపకారం చేసే స్వభావం గలవాడవు. నీవు నీచకార్యాలు చెయువాడవు. కుటిలమైన మనస్సుగల వాడవు. పాపాచారుడవు, ఇలాంటి నీవు మహానుభావుడైన దశరథునకు ఎలా జన్మించావు? మదించిన యేనుగు అంకుశాన్ని లెక్కచేయక తారసిల్లిన వారిని చంపునట్లు నీవు సదాచారాన్ని వదిలి ధర్మానికి భయపడక నన్ను హతమార్చావు.

ఇలాంటి పాపకృత్యం చెసిన నీవు ఎప్పుడైనా సత్పురుషులతో కలిస్తె వారు ఆక్షేపించినప్పుడు ఏమి సమాధానం చెప్పగలవు? నీకు ఏ అపకారం చేయని నాపై ప్రయోగించిన పరాక్రమాన్ని నీకు అపకారాన్ని చేసిన రావణునిపై ఎందుకు ప్రయోగించకున్నావు? నీవు నాతో ప్రత్యక్షంగా యుద్ధం చేసివుంటే నాచేతిలో హతుడవై యుుండేవాడవు - అని అనట్లు మూలకర్త తెలిపాడు

ధర్మా ధర్మాల్ని గురించి వాలిరామునితో అన్నమాటల్ని మూలంలో ఉన్నదున్నట్లు అనువదిస్తేనే ప్రధానకథకు సొబగు అని వరదరాజు భావించి ఉండవచ్చు అందుకే ఆయన యథాతథ అనువాదం చేశాడు చూడండి.

"క్రూరాత్ముకుఁడు నాస్తి-కుఁడు పతితుండు
చోరుఁడు కరుఁడు నీ-చుఁడు మద్యపాయి
రమణుల నావుల - రాజుల ద్విజుల
సమయించువాఁడు పా-షండ వర్తనుఁడు
గురుతల్ప గమనుఁడు - కొండీఁడు ద్రోహి
పరివేత్తయన్యాయ-పరుడు హింసకుఁడు

నిరయగాములు గాన - నీకేఁటి కయ్యొ!
కొఱమాలి యీకోఁతి - కొలఁగట్టు కొనఁగ?
ఈ మాంస మీ చర్మ-మీదంత శల్య
రోమాదికంబులు - రోతురుగాని
రోయరెవ్వరు వాన-రుల ధార్మికుండ
వీయపకీర్తి నీ-వేల పొందితివి?
పంచనఖంబులఁ - బరగిన జంతు
సంచయంబుల నైదు - చనుఁగాని మాకు
కడమ వాటినిఁ దినం-గాదేమి దలఁచి
పడవేసితివి నీకు-భక్ష్యంబె యేను?
అంటుదురే కేల-నైన వానరుల
యొంటి మాంసంబు? ని-న్నొకనిఁ జూచితిమి!
రామచంద్ర! వివేకు-రాలు మాతార
వేమారు నాకు నీ-వృత్తంబుఁ దెలిపె
నది వినియుండియు - నహమిక చేత
విధి పెడరేఁపఁగ - వెడలి వచ్చితిని
నను నేయఁబనియేమి? - నానేర్పు నేర
మునకు నెవ్వాఁడ వ-మ్ముగఁ బడనేయ?
నీవు రాజవుగావు - నీవెంటఁ బరమ
పావని . నాసీత - పతివైన కతన
మది నమ్మి నిను నధ-ర్మ పరుఁడ వనుచు
హృదయంబులోనఁ దా-నెఱుఁగక వచ్చి
యీపాటు బడిపోయె - హీనకర్ముఁడవు
పాపివి. యన్యాయ - పరుఁడ వల్పుఁడవు
ద్రోహివి శఠుఁడవు - దుర్బుద్ధి వధమ
సాహసాత్ముఁడవు వం-చకుఁడ వజ్ఞుఁడవు!
అక్కట ! దశరథు - నంత రాజునకు
ఎక్కటి సుతుఁడవై - యీావు గల్గితివి?"[70]

(7) ఇక, మూలానికి వరదరాజు తన కల్పనా చాతుర్యాన్ని జతచేయడాన్ని తిలకించుడు.

"నిద్రపోతున్న శ్రీరాముని శిరస్సును ప్రహస్తుడు నరికివేశా'డని అశోకవనంలో వున్న సీతాదేవితో రావణుడు చెప్పాడు. ఆవార్త విన్న సీతాదేవి విలపిస్తూ రావణునితో, 'రావణా ! రాముని శిరస్సుతో నా శిరస్సును, అతని దేహంతో నాదేహాన్ని చేర్చుము. మహాత్ముడైన నాపెనిమిటితో అనుగమనంగావించెద'నని చెప్పినట్లు మూలకర్త ఒకశ్లోకంలో వ్రాశాడు.

"శ్లో || శిరసామే శిరశ్చాస్య కాయం కాయేన యోజయ |,
రావణానుగమిష్యామి గతిం భర్తుర్మహాత్మనః || "[71]

వరదరాజు మూలంలోని పై భావానికి తనకల్పనను జతచేశాడు.

"ఓరి! రావణ! నీకు - నొకపుణ్యమార్గ
మేఱపాటుగఁ దచ్చి - యిచ్చెద నేను
తల తోడఁ దలయు గా-త్రముల గాత్రంబు
గలయించి తన్ను రా-ఘవుఁ గూర్చితేని
ననుగమనము సేయు-నపుడు దీవింతు
నిను చిరంజీవివై - నెగులొంద కుండ"[72]

తనను భర్త అయిన శ్రీరామునితో అనుగమనం కావించేట్లు చేయమని మూలంలోని సీత రావణుని కోరింది ద్విపద రామాయణంలోని సీత, 'తనను భర్త అయిన రాఘవునితో కూర్చితే అతనితో అనుగమనం చేసేటప్పుడు నిన్ను చిరంజీవిగా దీవిస్తా'నని రావణునికి ఆశ చూపింది.

సీతరావణునికి 'చిరంజీవిగా ఉండునట్లు దీవిస్తా'నని ఆశ చూపడం ద్వారా, వరదరాజు ఆమెను లోకజ్ఞురాలుగా, పతివ్రతా శిరోమణిగా చిత్రించ దలచినట్లు తెలుస్తుంది. ఈ విధంగా కావ్యనాయిక యొక్క ఔన్నత్యాన్ని పెంచుతూ తద్వారా ప్రధాన కథయొక్క విలువను పెంచదలచాడు వరదరాజకవి.

మరొక విధంగా ఈ కల్పనను బట్టి అనుమరణం చేసే ప్రతివ్రత దీవించే సంప్రదాయం ఒకటి వరదరాజు కాలంలో ప్రచారంలో ఉన్నట్లు చెప్పవచ్చు. అంతేగాక అలాంటి విపత్కర సందర్భాల్లో శత్రువు సైతం ప్రతిఫలాపేక్ష భావంతో ఉపకరించే అవకాశాలు కూడా వరదరాజు కాలంలో వాడుకలో ఉండేవని భావించడానికి ఆస్కారముంది.

ఈ రీతిగా శ్రీ రామాయణంలో వెల్లివిరిసిన వరదరాజు కవీశ్వరుని కథా సంవిధాన చాతురి ఇందలి ప్రతి సన్నివేశమూ నదమల నిదర్శనంగా అలరారుతూ ఉన్నది.

## 3.5 వరదరాజు శైలీ సౌభాగ్యం :

### 3.5.1 శైలీ నిర్వచనాలు :

శీలమే 'స్వార్థము'న శైలికాబట్టి, కవి చిత్తసంస్కారమే శైలి. అది కవి వాగ్వృత్తియందు ప్రతిబింబించును. తత్ప్రకటనమే కావ్య శిల్పమగును. ఇట్టి సమన్వయము పాశ్చాత్యుల (Style) నిర్వచనానికి సన్నిహితంగా కనపడుతున్నది. తెలుగులో 'శైలి' అనేపదం సమానార్థకంగా వాడబడుతున్నది.

**1)** నిఘంటువుల్లో 'శైలి'కి నిర్వచనం :

ఎ) తెలుగు నిఘంటువులు

i) సూర్యరాయాంధ్ర నిఘంటువు - 'రచనారీతి'

ii) శబ్దార్థ చంద్రిక - రచనా కౌశలముగల బాషాసౌష్ఠవము, భాషాసరణి, లేఖన పద్ధతి, విధము, ధోరణి.

iii) ఆంధ్రదీపిక - సరకేతము, పరిభాష, శాస్త్రీయ వ్యవహారము

బి) ఆంగ్లనిఘంటువులు

i) Sanskrit - English dictionary } Manner of act[illegible] or living practice

ii) English - Telugu dictionary } Manner of writing with regard to language

**2)** తెలుగు కవుల నిర్వచనాలు

i) శ్రీనాథుడు - శ్రీనాథుడు శృంగార నైషధములో 'ఒప్పిదపుశైలి'[73] అని ప్రయోగించాడు.

ii) డా|| టి కోటేశ్వరరావు - 'కావ్యత్వ సిద్ధి హేతుకమైన విశిష్ట శబ్దవిన్యాసము శైలి. కావ్యత్వ సిద్ధియనగా నానందహేతుకమైన సౌందర్యము'[74] అని తెలిపారు.

iii) డా|| పా. మాధవవర్మ - 'శీలధాతు నిష్పన్నములైన శీలము, శైలి, శిల్పము తర తమ భావమున ఏకార్థములే, అనంత జన్మాభ్యాస సంస్కారము శిల్పము. ---------------మహర్షులయందు శీలమైనది మహాకవులయందు శిల్పమగుచున్నది. అప్రయత్న ఫలసిద్ధి శీలమూలకము. ప్రయత్న ఫలసిద్ధి శిల్పమూలకము'[75] - అని తెలిపారు.

3) ఆంగ్లేయుల నిర్వచనాలు

i) Newman - "Style is the man"[76]

ii) John Henry Newman - "Thought and speech are inseperable from each other Matter and expression are parts of one, style is a thinking out into language"[77]

### 3.5.2. శైలి భేదాలు :

ఒక్కో కవికి ఒక్కోరకమైన శైలి ఉంటుంది. ప్రబంధకవులు ఇతివృత్తం విషయంలో అంతగా విభేదించకున్నా శైలి విషయంలో మాత్రం విభిన్నమార్గాల్ని అవలంబించారు.

శైలీమార్గాలు అనంతాలు. మనుష్యులకు మూఖాద్యవయవాలు భిన్నంగావుండి వారి స్వరూపాల్ని వేరుపఱచే విధంగా శైలి ఒక కవినుంచి మరొక కవిని విడదీయును.

i) కుంతకుడు - 'కుంతకుడు విచిత్ర మార్గము, సుకుమార మార్గము అనురెండు శైలి భేదములను పేర్కొనెను "[78]

దీనిని బట్టి 'శైలి' అనగా 'మార్గ'మని చెప్పవచ్చు.

విచిత్రశైలి - విచిత్ర శైలిలో విచిత్ర పదబంధనముండును. ఆముక్త మాల్యాదాదులిట్టివి.

సుకుమారశైలి - సుకుమారశైలిలో మృదుపద బంధనముండును. పారిజాతా పహరణాదులిట్టివి.

ii) పింగళి లక్ష్మీకాంతం - పింగళి లక్ష్మీకాంతంగారు శైలిని రెండు భాగాలుగా విభజించారు.

కావ్యసామాన్య సరణి - ఇదిమూడు విధాలుగా కనపడుచుండును.

(అ) ఆఖ్యానశైలి (Narrative) (ఆ) నాటకశైలి (Dramatic)

(ఇ) వర్ణనశైలి (Descriptive)

ఆఖ్యానశైలిలో కథచెప్పుటయే ప్రధానం. దీనిని కథనశైలి అనవచ్చును. నాటకీయశైలి దేశీయతామయం. ఇదినుడికారపు పొద మరియు సంవాదాత్మకమైనది. ఇందు పలుకుబడి రాజ్యంచేయును. వర్ణనశైలి అష్టాదశ వర్ణనలకు సంబంధించినది. జటిల సంస్కృతపద సామాన్య లక్షణాలు.

పదగుంఫనశైలి - ఇదికూడ మూడు విధాలుగా ఉండును.

(అ) బుద్ధిగమ్యము (Intellectual)

(ఆ) భావస్ఫోరకము (Emotional)

(ఇ) కర్ణపేయము (Aesthetic)

పైన పేర్కొన్న శైలీ విభజనలలోని సుకుమారాది శైలీవిభజన వైయక్తిక దృష్టితోను, నాటకీయాది శైలీ విభజన ప్రక్రియా దృష్టితోను చేయబడినవి. మొదటి విభజనశైలీ స్వభావ దృష్టితోను, రెండవ విభజనశైలీస్వరూప దృష్టితోను చేయబడినట్లు చెప్పవచ్చు. ప్రతికవిలో ఈరెండు విధాలైనశైలులు పెనవేసికొని ఉంటాయి. వీనిలో దేనికి ఎక్కువ ప్రాధాన్యం ఉండునో దానినిబట్టి ఆ కవిశైలిని నిర్ణయింప వీలవుతుంది.

### 3.5.3 వరదరాజు కవితాశైలి :

కుంతకుని శైలీ విభజనను దృష్టియందిడుకొని చూచినచో వరదరాజు శ్రీరామాయణంలో సుకుమారశైలి కనపడుతుంది. కవుల మనోరంజనానికై తన శ్రీరామాయణంలో అక్కడక్కడ సంస్కృత భూయిష్ఠ రచనను చూపెట్టినా, శబ్దసౌకుమార్యం ఆతని కావ్యంలో అంతర్లీనంగా కనబడుతుంటుంది కవి తన కావ్యంలో పాత్రోచితమైన భాష, భావసౌకుమార్యం, జాతీయాలు, పలుకుబడులు, లోకోక్తులు, నానుడులు ప్రయోగించాడు. ఇది దేశీయమైన శైలీ లక్షణం. వర్ణనల్లో వర్ణనాత్మకశైలిని, కథను నడుపుతున్నప్పుడు కథనాత్మకశైలిని ఈ కవి ప్రయోగించాడు.

వరదరాజు సుకుమార కవితాశైలి :- మిక్కిలిగా భావింపబడకయే అర్థమును స్ఫురింపజేయునట్టి శబ్దఘటన కలది సుకుమారశైలియనబడును. ప్రయత్నం లేకుండా సంఘటింపబడిన మనోహరములైన అలంకారాలు గలది.

ఈ సుకుమారశైలిని 1) భావ సౌకుమార్యం, 11) ద్విపదల రచనా సౌకుమార్యం, 111) అలంకార సౌకుమార్యం అనిమూడు విధాలుగా విభజించి పరిశీలింపవచ్చు.

1) భావసౌకుమార్యం

వరదరాజు తన శ్రీరామాయణంలో ప్రకటించిన భావాలు రసవత్తరములు, సందర్భోచితములై పాఠకుల్ని ఆకట్టుకొంటూవుంటాయి. మచ్చునకు ఈ క్రిందివి కొన్ని ఉదాహరణలు.

అ) వరదరాజు శృంగార భావనలు

1) మేనక 'నడుపుల మురిపెంబు' ' నగవులతేట' 'తొడల చక్కదనంబు' ను చూచిన వరదరాజు విశ్వామిత్రుడు తనతపస్సు ఫలించినట్లు భావించాడు ఈ సన్నివేశాన్ని వరదరాజు రసవత్తరమైన శృంగార భావనతో రచించాడు

"ఈధవళాక్షితో - నెనసినఁజాలు
తపములు ఫలియించె - ధన్యుఁడనైతి
నిపుడుగా దా కోర్కు - లీడేఱె ననుచు
నడుపుల మురిపెంబు - నగవులతేట
తొడల చక్కదనంబు - తురుము ప్రేఁకంబు
కలికి చూపుల బాగు-గబ్బితనంబు
కులుకులు ఁజూచి సం-కోచంబు మాని
తొయ్యలి గాదిది-తొలుకారు మెఱుపు
వెయ్యేలయిది నాకు - వెలఁది యౌనేని
యేలనే భువనంబు - లేల? నేఁజేయు
గాలి యావటములఁ - గాలిఁచఁబోవఁ
దపము సేయఁగ ఘోర-తపన ప్రచండ
విపులాతపముల ని-వ్విపు లాటవులను"[79]

2) వేశ్యలు ఋశ్య శృంగుని యెదుట తమహావభావాల్ని కడుచక్కగా ప్రదర్శించారు. దీన్ని వరదరాజు అతిరమ్యంగా వర్ణించాడు. వారు మునిని చూచి కిలకిల నవ్వారు నవ్వుల వెన్నెలలుగాయ పలుకుల కపురంపు పలుకులు రాల్చారు మహర్షి వారిని చూచి దిగ్భ్రమపొంది, దిగ్గునలేచి. నమస్కరించి అర్ఘ్యపాద్యాదుల్ని ఒసంగాడు. పిదప ఆ జవ్వనులు అడుగగా తనవృత్తాంతాన్ని తెలిపాడు. తరువాత వారు ఋశ్య శృంగుని ఏవిధంగా వలపుల వలలోకి లాగారో చూడండి

"మౌనినాయక ! విను-మా ! వనితలము
కాననెన్నడు విను-కని పుట్టు మొదలు
నావలపుల జాడ-లరయవుగాక
నీవు మమ్ములఁ బాసి - నిమిష మోరుతువె
చక్కని కొమ్మల - చందంబు చూచి
చొక్కన మరలి రాఁ - జూతువేయిటకు
మామోవి పండ్లకై-మన సూరనట్టి
మీమౌనులున్నారె - మేదినియందు
కలహంస గమనాను-కార చేష్టలును
నెలకొను కీరవాణీ - విలాసములుఁ
గలకలాయిత రవ-కంఠరవంబు
తలఁపనియీ రిత్త-తపమేల? నీకు
కొమ్మాస్వదింపుకై-కొనుమని చెలులు
కమ్మిక గోదుమ - కజ్జముల్ మేప
మెండుగా మెసవుచు - మీయాశ్రమమునఁ
బండునే యిటు-వంటి పండ్లనిమెచ్చి
యలరి యాపాదకే - శాంతంబుగాఁగఁ
గలవాణులను చ-క్కఁగా ఁదేఱిచూచి
పూనుమీ శివలింగ-ములకేల లేవు?
పానవట్టములంచుఁ - బాలిండ్లు నివురుఁ
దుమ్మెద గుంపులఁ-దో లెదననుచుఁ
గొమ్మననుదుటి ముం-గురులంటి త్రోచు
వేలిమిబొ ట్లెంత-వింతాయెననుచుఁ
దేలిక కస్తూరి - తిలకముల్ మెచ్చు
స్వాదుగా గమగమ - వలచునెచ్చోటి
బూడియోయని గంధ-వొడికేల నంటు
యీవింత ముంజిత్రా-ళ్లెక్కడి వనుచు
తావేఁడు మేఖలా - దామముల్ చూచి
యేసీమ పటికంబు - లిట్లుండు ననుచు
గాసిల్ల వజ్రాల - కడియముల్ ద్రిప్పు
నేచెట్టులనుఁబుట్టు -నీవల్కలంబు

లీచాయనవి వల్వ-లెగనెత్తి చూచు

..........................

.......... ................ ..

కలనలచేత నం-గము మఱపించి"[80]

ఆ) వరదరాజు వీర రసభావనలు

వరదరాజు వీరరసాన్ని బాగా పోషించాడు. ఈయన రాజు కావడంవల్ల వీరరసస్ఫోరకాలైన సన్నివేశాల్ని అత్యంత మనోహరంగా చిత్రించాడు. మచ్చునకు ఒకటి రెండుదాహరణాలు

1) రావణుడు మహాశౌర్యంతో రాముని పై యుద్ధంచేశాడు. ఈ సన్నివేశాన్ని కవి వీరరసస్ఫోరకంగా రచించాడు చూడండి.

"వివిధాస్త్రములు దైత్య - విభునిపై వ్రేయ
నవి ద్రుంప నతఁడు న-య్యస్త్రంబు లేసి
గాంధర్వ రాక్షస - గారుడాస్త్రములు
సంధించి యిరువురు - జగడించు నపుడు
దానవ విభుఁడు మా-తలి మేను నొవ్వఁ
గానేసి హరుల మా-ర్గణముల ముంచి
యింద్ర ధ్వజంబు మ-హీస్థలి నర్ధ
చంద్ర బాణంబుచేఁ - జక్కాడి త్రోచి
రాముని దివ్యనా - రాచకోటులను
చేమెదల్పక యుండఁ-జేసి నిల్పుటయు
నూరకే వేసరి-యున్నట్టులున్న
శ్రీరాముఁ దేరి చూ-చి కపీంద్రు లెల్ల
రామచంద్రుఁ నెదిర్చి - రాహువు రీతి
నీమేర దనుజేంద్రుఁ-డేచి పట్టెడును"[81]

2) ఇంద్రజిత్తు మింటినుండి తన అస్త్ర విద్యా నైపుణ్యాన్ని ప్రదర్శించిన ఘట్టాన్ని వరదరాజు, మనసు పులకింపజేయునట్లు రచించాడు.

"అసురేంద్ర సుతుఁడు బ్ర-హ్మాస్త్ర ప్రభావ
లసమాన తేజో-విలాసియై లాసి
నెరయించు నొకచోట -నీలమేఘములు

గురియించు నొకచోట - ఘోరాస్త్రవృష్టి
మలయించు నొకచోట - మంచు పెందెరలు
పొలయించు నొకచోట - ఘుగఘుగఁ బొగలు
వినిపించు నొకచోట - విలునారి మ్రోఁత
కనిపించు నొకచోట - కాంచన రథము
చెలఁగించు నొకచోట - సింహనాదములు
నెలకొల్పు నొకచోట - నేమికా ధ్వనులు
నడరించు నొకచోట - హయహేషితములు
జడియించు నొకచోట - శక్తులువైచి
విసివించు నొకచోట - విలుకేలఁ బూని
నసముంచు నొకచోట - నాకృతిఁ జూచి
యీలీల నెలయించె-యింద్ర జిత్తుండు !"[82]

ఇ) వరదరాజు కరుణ రసభావనలు :

రామాయణంలో కరుణ రసపూరితమైన సన్నివేశాలు అనేకం ఉన్నాయి వరదరాజు ఆయా సన్నివేశాలకు తగినట్లుగా కరుణరసాన్ని పరిపోషించాడు వాటిలో మచ్చునకు రెండుదాహరణాలు

1) కైకేయి కోరికతో రాముడు సీతాలక్ష్మణులతో వనవాసానికి వెళ్ళాడు. ఆవియోగాన్ని భరించలేని కౌసల్య భర్తతో చెప్పి విలపించింది. ఈ సన్నివేశాన్ని వరదరాజు కరుణ రసపూరితంగా చిత్రించాడు.

"కుపున మూఁచ్చిన త్రాఁయు - కొదమయో యనఁగ
కపటంబు పేరిటి - గరళంబుఁదాల్చి
గైకేయి యున్నట్టి-గతి ప్రాణనాథ !
నాకుఁ జూచిన నెమ్మ-నము భీతినొందె
వరమడిగిన నేమి - వనముల కేల
తరిమించె నురక - నా తనయుపై నలిఁగి
తనుఁ గొల్చియుండఁ డో-తా మోము జూడ
ననిన యుండఁడో నాగృ-హంబులోనైన
తను నేరుచెప్పి చెం-తలవారి నడుగు
కొనియైన మెలఁగఁడో - కొన్నాళ్లు పురిని
పర్వకాలముల వెం-బడి సోమయాజి

పర్వి పురోడాశ - భాగంబుఁదెచ్చి
యసురుల పాల్సేయు-నట్టి చందమున
పొసఁగునే రామునిఁ - బొమ్మని త్రోయ?
కొడుకులు తనపెద్ద - కోడలునిట్లు
నిడుములం బడుదురే-యెల జవ్వనముల
నెన్నడు వత్తురో-యిచటికి మఱలఁ
బున్నమరేల నం-బుధి యుబ్బుకరణి
వారలంగని యెల్ల-వారు నానంద
వారధిఁదేలి చె-ల్వము గాంతురొక్కొ?
ఉప్పరిగల యందు-న త్పలగంధు
లెప్పుడీ పురవీథి - నెడమీక కూడి
సీతా సమేతుఁడై - శ్రీరామ చంద్రుఁ
డేతేర కవదోన - లిరువంకఁ దాల్చి
శృంగంబులను మహా-శిఖరిఁ గన్పట్టు
సింగారమునఁ జేతి - సింగాణు లమర
వెనుక లక్ష్మణుఁడు రా-విరులును లాజ
లును కరంబులను జ-ల్లుచుఁ జూతురొక్కొ?
నయశాస్త్ర విదుల యం-దతిలోనఁబెద్ద
వయసు నిల్కడను దే-వతలతో నుద్ది
యిట్టి రాఘవుఁడు మూఁ-డేండ్ల ప్రాయంపుఁ
బట్టికైవడి కనుఁ-బండువుఁగాఁగ
నాచెంత నుండు చం-దంబునే మఱలఁ
జూచి యింకొకనాఁడు - సుఖముందు నొక్కొ?
తల్లులఁ గొడుకులఁ - దానెడల్ చేసి
తొల్లి యెవ్వరికింత - దొసఁగు చేసితినొ?
లేఁగఁగానక కోల్పు-లికిఁ జిక్కునావు
తోఁగూర్చెఁగైకేయి - తోఁగూడి యజుఁడు
అతిశయ గ్రీష్మంబు-లందు భాస్కరుఁడు
కతకత నిలయెల్ల- గ్రాఁగించురీతి
యీపుత్ర శోకాగ్ని - యెంతయు మదికిఁ
దాపంబు నొందించెఁ - దరియింపఁగలరె?"[83]

2) రాముడు వనవాసానికి వెళ్లడంవల్ల దశరథుడు తీవ్రసంతాపానికి గురియైనాడు. ఈ చింతతో ఆయన రాముణ్ణి పదేపదే తలచుకొని మృతిచెందాడు. ఇక్కడ దశరథుని పరితాపాన్ని వరదరాజు చక్కగా చిత్రించాడు.

"తనయులు తనకేమి - తప్పుచేసినను
జనకుఁడుత్తముఁడైన - సడలిపోలేఁడు
ఏమమూరుఁడు తండ్రి - కెదిరి యేమియును
వాకొనకూరకె - వనములకేఁగు?
చరియించె బుద్ధియు - శమనకింకరులు
బలిమి నీడ్చుకపోవఁ - బదరుచున్నారు
ఈ వేళ రాముపు - నెడఁబాసి యేల
జీవనంబిక పృతిఁ - జెందుటేమేలు?
ఎండకొంచెపు నీటి - నెంకించి నట్లు
నిండు తాపమున మే-నికి పోనియయ్యో
చంద్రాస్య! వికసిత - జలజాత పూర్ణ
సాంద్రతగల రామ - చంద్రుమొగమ్ము
చేరి యప్పుణ్యులి-జింతురో యింక
వారివె స్వర్గాప - వర్గ సౌఖ్యములు
పంచేంద్రియమ్ముల - పాటవంబెల్ల
నించుకయును లేక - యెనసి భూతముల
నలివేణి! తైలశూ-న్యతనారు దీప
కళికయోయున జ్ఞాన-కళ తెల్విమానె
అని యింత పతిహంత-వని నీమనంబు
కసనేరనైతిఁగై-కా! యంచువగచి
హాలక్ష్మణా! సుమి-త్రా! కోసలేంద్ర
బాలికా! యనుచుఁ బా-పంబుచేఁ బొరలి
ఓ జనకాత్మజా! - యనివిలాపించి
హాటల జేడలా! - హారామ! రామ!
యనిప్రాణములఁ బాసి-యా దశరథుఁడు
చనియె నంతట నిశా - సమయంబు నయ్యె"[84]

11) ద్విపద రచనా సౌకుమార్యం

వరదరాజు ద్విపదరచన సరళమై సర్వజన సులభగ్రాహ్యంగా వుంటుంది. కవితా శిల్పంలోను, కమనీయ రచనా సౌందర్యంలోను ఇదిరంగనాథ రామాయణానికి ఏవిధంగాను తీసిపోదు. రామాయణ శ్లోకాలకు ద్విపదలాగా వేరొక ఛందస్సు పొసగదు. మఱియు ద్విపద పాటవలె పాడుకోవడానికి వీలుగా వుండడంవల్ల ఇది ప్రజాసామాన్యాన్ని ఆకర్షించింది.

వరదరాజు మూలాతిక్రమణము చేసిన పట్టులందు కవితా చమత్కారాన్ని చూపి, కథాకథనాన్ని కమనీయం గావించియున్నాడు. ఆదికావ్యానికి "పాఠ్యేగేయేచ మధురమ్" అన్న ప్రశస్తి ఉంది వరదరాజు ఈ సూక్తిననుసరించి తనరచనను గేయ ధోరణికి అనువుగా వుండేటట్లు రచించాడు

1) వరదరాజు సంస్కృతాంధ్ర భాషాశైలి బహు ప్రసన్నత గలది. వర్ణనల్లో మాత్రమే ఈయన సంస్కృత సమాస రచన సాగించాడు చూడండి.

"కాంచన దళరత్న - కందళ కర్ణి
కాంచిత కమల వ-నాభి శోభితము
మకరంద రసలోల-మద చంచరీక
నికర గాయనగాన - నిబిడీకృతంబు
శౌనకాదిమ మహా- సంయమిశ్రేష్ఠ
మానితాశ్రమలస - మానకూలంబు
మానిత సురత సం-భ్రమ రణదివిజ
మీనేక్షణామణీ - మేఖలారవము
కలితలతా డోలి - కాలోల మౌని
కులకన్యకా తులా - కోటిస్వనంబు
పనస రసాల రం-భానారికేళ
తినిశక్ర ముకవనో-త్కీర్ణరోదంబు
వారికేళీలోల - వైమానికాళి
సారికా వీక్షామృ-షా మీనబలము
యాజన హోమ ధూ-మాకాండ జలద
రాజికాచ్ఛన్నత - రంగ మాలికము
కారండవ మరాళి-కా ప్లవీభూత
గౌరసారస పరా-గ ప్రపంచంబు"[85]

2) తెనుఁగుశైలికి ద్విపదరచనలో ఉండే అవకాశాల్ని కవి పూర్తిగా వినియోగించు కొన్నాడు. ఏద్విపదకా ద్విపద విడివడి వుండునట్లేగాక పాదాంతంలో అనుప్రాసల్ని ఉపయోగించి చదువరుల చెవులకింపు నింపినాడు. ఒక్కొక్క విభక్తి ప్రత్యయముతోనే ద్విపదల్ని విస్తరింపజేసినా విసువు పుట్టింపవు. అందుకు ఉదాహరణంగా క్రింది ద్విపద పంక్తులు తిలకింపదగివున్నాయి

"శ్రీమించు రత్నకి-రీటంబుతోడ
చామన నెమ్మేని - చందంబుతోడ
వర్ణిత దరహాస - వదనంబుతోడ
కర్ణకుండల విభా-కళి కలతోడ
కరములు శంఖ చ-క్రంబుల తోడ
నురము మీఁదవసించు - నొయ్యారితోడ
గ్రైవేయమణి మయాం-గదముల తోడ
సౌవర్ణకటి తటి - శాటికతోడ
హారకంకణ మేఖ - లావళితోడ
కారుణ్య రసవిలో-కనములతోడ
భువన పావన పదాం - బుజములతోడ
రవికోటి శతభాసు - రద్యుతితోడ
.............. .... .... .. .. .
......... ...... ... ........ .. .
హరి సర్వమయుఁడు ప్ర-తక్ష్యమైనిలిచె."[86]

3) భరతుడు చేసిన శపథాలను షష్ఠీ విభక్తిలో వరదరాజు రచించిన తీరు ఈ క్రింది పంక్తులలో తిలకించదగివున్నది.

"ఇది నేఁదలంచిన - నినమండలంబు
నెదిరి చూడక విష్ణుఁ-డేఁగెడు గతికి
నిదురించు నావుఁద-నిన్న వానిగతికిఁ
బెదరించి విప్రుఁజం-పిన వానిగతికిఁ
గొలిచిన వారల - కొలువు పాటెఱిఁగి
అలరించి జీత మి-య్యని వానిగతికి
ధరణియేలుచుఁ బ్రజఁ-దగినట్టి జాడ
నరసి ప్రోవఁగ లేని-యతఁడేగుఁ గతికి

యాగంబు లొనరించు - నపుడు దక్షిణల
చాగమియ్యని వాఁడు - చనియెడు గతికి
భీతిచే ననిలోన - బెదరెడు పాఱఁ
బోతు బంట్రౌతులు - వోయెడు గతికి
హితమతి నిగమంబు - లెల్లనుం జదివి
మతిలేక మఱుమ దు-ర్మతి పోవుగతికి
నైవేద్య మిడక య-న్నము భక్ష్యములును
తావేడ్క మెసవు పా-తకు లేఁగుగతికి
సజ్జనులగు వారిఁ-జవుకగా నెంచి
.. ............. ... ... ..... .
.. .......... ..  ..  .. . ...
జెఱపఁ జూచిన ద్రోహి - చేరెడుగతికి
వాలాయముగ నేఁగు - వాఁడనో యమ్మ
ఏల సన్నీ మాట-లిపుడు వల్కితివి?"[87]

4) రాముడు భరతునకు రాజనీతిని బోధించిన ఘట్టాన్ని వరదరాజు 'రక్షింతె? సేయుదువె?' - మొదలైన ప్రశ్నార్థక క్రియలలో రెండువందల యేబది పంక్తుల్లో రచించాడు.

"చేయుదువే! తండ్రి - చెప్పిన యటుల
పాయవే! యవ్విభు-పరి చర్యలందు
గావింతువే! కులా-గత గురుపూజ
బావింతువే! వారి - పరిణామ మెల్ల
గౌసల్యయు సుమిత్ర - కైకయు రాణి
వాసంబులను శుభా-వహులైన వారె?
సుఖియేకదా! సుయ-జ్ఞుఁడు వామదేవ
ముఖులందఱును సౌఖ్య-మున నున్నవారె?
చెలికాండ్ర కెల్లను - సేమమే? బంధు
కులమెల్ల నీమేలు - గోరియున్నారె?
యేమేరల భజింతు-వే యజ్ఞ లెల్ల
యేమరవే దేవ-ఋషి తర్పణములు?
కొలిచిన వారి నె-గులు మాన్పినావె?

ఇలవేలుపులు సుఖు-లే పట్టణమున?
బహుమాన మొనరింతె - పండిత శ్రేణి?
గృహదేవతలను భ-క్తి భజించినావె?
భరత ధనుర్వేద - పారీణుండైన
గురుని సుధన్వుం జే-కూర్చి రక్షింతె?
మంతుకెక్కిన బుద్ధి-మంతులై నట్టి
మంత్రులకెల్ల సే-మమె కదవయ్యా?
...... ... ............. .... ..
..... .. . ... .. ... ... .......
భావంబులో నీకుం - బాదు కొన్నవియె"[88]

5) ప్రథమావి భక్త్యంతాలైన ద్విపద పాదాల్లోని తేట తెనుంగు రచనాశైలికి ఈ క్రింది పంక్తులు తిలకింపదగినవి.

"రవిలేని దినము సా-రథి లేనిరథము
కవిలేనికీర్తి యం-కము లేనిపోటు
ప్రతిలేని వాదు తీ-ర్పరి లేనిసేన
ధృతిలేని తెగువ కూ-రిమిలేని చెలిమి
దొరలేనిసీమ చం-ద్రుండు లేనిరాత్రి
తరిలేని సంధ్య మం-త్రములేని జపము
సతిలేని గృహము వా-సనలేని పువ్వు
భృతిలేని కొలువు కో-యిల లేని వనము
శ్రుతిలేని పాట శూ-రులులేని కోట
కతలేని రచన ని-ల్కడలేని మాట"[89]

6) వరదరాజకవి పాల్కురికి సోమనాథునివలె అంత్యాను ప్రాసలను, పదమధ్య ప్రాసలను పాటించి తనద్విపద కావ్యరచనలో విశిష్టత నెలకొల్పియున్నాడు

పాదాంతప్రాసలు :

"రథగజ హయభటు - వ్రాతనిశ్శంక
పృథుగోపురాగ్ర కుం-భిత హరిణాంక
పౌలస్త్యదోర్దండ-బల బిరుదాంక
సాలగుప్తి నిరస్త - శాత్రవాతంక

పరబలోపల శారి-భటశౌర్యటంక
శరధి వేలావనాం - చత్కలావింక
కలధౌత సౌధస-ఘటిత విటంక
లలిత శృంగారాక - లంక యాలంక"[90]

పదమధ్య ప్రాసలు :

"దానుల నర్థిని - దానుల సుపరి
ధానుల వివిధాభి - ధానుల సదప
దానుల రుచి రోప-ధానుల సావ
ధానుల జయసంవి-ధానుల సప్ర
ధానులఁ బహుయాతు - ధానులఁ గసుచు
నావల వివిధ మా-యావులఁ గ్రూర
భావుల దీన సం-భావుల సాను
జీవులఁ గలుషోప - జీవుల మద్య
సేవులఁ గృతవీర - సేవులఁగాంచి
ధీరులఁ బోపిత - ధీరుల సమర
శూరుల విక్రమ - శూరుల సపరి
వారుల శౌర్యడు-ర్వారుల వరవి
చారుల దురుణా - పారుల నాత్త
చారుల యామినీ - శౌరులఁ జూచి"[91]

7) అలాగే వరదరాజు తన శ్రీరామాయణంలో ద్విప్రాసల్ని ఉపయోగించి రచనను ఎలా మనోహరం కావించాడో తిలకింపుడు.

"వేళంబు యందందు - వెదకుచు నతివి
శాలాయతన చంద్ర-శాలాంతరముల
రాజితంబులును బు-రందర ప్రముఖ
పూజితంబులును సం-పూర్ణ వస్తువుల
నూర్జితంబులును ది-వ్యోపధావిధన
మార్జితంబులును మా-యాసుర శిల్పి
నిర్మితంబులును మా-ణిక్య ప్రకాశ

వర్ణితంబులును రా-వణ భుజాశౌర్య
పాలింతంబులును న-పార విభూతి
లాలితంబులును నీ-లమణి ప్రవృద్ధ
నీలమంబులును గం-ధిల ధూపధూమ
కాళిమంబులును రం-గన్మాలికాంత
రామణీయకములు - రత్నవితర్ది
కామనీయకములుఁ - గాంచనకుడ్య
భాగంబులును దైత్య-భామ హితాను
రాగంబులును నైన - రాక్షస విభుని
నడినన్న గాణివా-సముల వాసములు
పుడమి పట్టినిఁ జూచుఁ-బూనికఁ జూచి"[92]

111) అలంకార సౌకుమార్యం

అలంకారిక రచన ద్విపదలకు సొగసును, పాఠకులకు ఇంపును గొలిపే భావాన్ని ప్రసాదిస్తుంది. ఎరదరాజు తేటపదాలతో అలంకారాల్ని ప్రయోగించి, భావాన్ని సులభ గ్రాహ్యంగా పాఠకులకు అందజేయటంలో కుశలుడు ఈ విషయమై ఈ క్రిందివి కొన్ని ఉదాహృతులు.

అ) ఉపమాలంకార సౌభాగ్య గరిమ

ఉదా - 1) "చుక్కల జవరాండ్రు - చుట్టునుం గొలువ
చక్కని సంపూర్ణ - చంద్రుండు జేరు
సరణిమైఁజేరి య-చ్చటు సుఖస్థితులఁ
బరమాను రాగవై-భవముల నుండె."[93]

దశరథుడు శయనాగారంలోకి వెళ్ళే సన్నివేశాన్ని చిత్రించడంలో కవి పై విధంగా ఉపమాలంకారాన్ని ప్రయోగించాడు.

2) లక్ష్మణుడు అతికాయుణ్ణి అధిక్షేపించే ఘట్టంలో ఈ కవి సమకూర్చిన ఈ క్రింది ద్విపద తిలకింపదగివున్నది.

"తరువృంతమునఁ బోవు - తాళఫలంబు
ధర డొల్లినటుల నీ-తలఁ ద్రెవ్వవైతు"[94]

3) ఈ సందర్భంలో వరదరాజు అంత్యానుప్రాస ఘటితమగు శబ్దాడంబరానికి ఇచ్చిన ప్రాముఖ్యం కూడ పరికింప దగివుంది.

"అంచిత మునివర - యజ్ఞవాటంబు
నవరత్న శోభాపి - నద్ధకూటంబు
పాలిత తరువరా - పారఝూటంబు
నీలనీలాంబుద - నికర ఖేటంబు
ప్రాలేయకర సుసం - బద్ధజూటంబు
పరిసర సంచర-ద్భాను ఘోటంబు
స్థిరపుణ్యా కూటంబు - చిత్రకూటంబు"[95]

4) అలాగే సీతయొక్క అందచందాల్ని కని ఎంతటి స్వభావోక్తియుక్తంగా చిత్రించాడో చిత్తగించండి.

"చక్కని నెమ్మోము - జాబిల్లి రేక
నొక్కులు దిద్దునె-న్నుదురును మేల్మి
బంగరు నిగ్గులు - పచరించుమేను
సింగపునడుము రా-జీవ పత్రముల
నిరసించు కన్నులు - నెఱివంక బొమలు
గరువంపు నడుపు ను-త్కట కటీరంబు
జక్కవ గుబ్బల - సంపంగి బెక్కు
ముక్కును వలమురి - మురువైన గళము
తుమ్మెదకురులు చే-తుల సోయగంబు
కెమ్మోవి చెలువందు - కిసల హస్తములు
కెందమ్మి యడుగులు - గిలగిల మొరయు
నందెలు మణికంక-ణాం గదంబులును
జెలువొప్పు నాసాధ్వి - శ్రీమహాలక్ష్మి
పొలుపున గిరిరాజ - పుత్రివైఖరిని
వనదేవత యనంగ - వారిజాననుని
వనితకైవడి జగ-ద్వర్ణిత యగుచు
నెక్కడి సురకాంత - లేడయప్సరస
లెక్కడి యహికన్య - లెందుకు వారు?
వారి సౌందర్యమ - వ్వనజాక్షి కాలి
గోరునకైనఁద - క్కువ నిక్కువంబు !"[96]

ఈ రీతిగా ఈ రాజ కవియొక్క శైలీ సౌభాగ్యము సంస్కృతాంధ్ర పదమిళితమై రసనము చిత్రమై అలంకారయుక్తమై సందర్భానుగుణముగా జాలువారుచు, సహృదయ హృదయాహ్లాదకారిగా విలసిల్లుచున్నది.

## సంఖ్యా సూచిక :

1 & 2 ప్రథమాంధ్ర మహాపురాణము. ప్రబంధ కథామూలము, పుట 489

3 & 4 ఆంధ్ర సహిత్య చరిత్ర, ఆచార్య పింగళి లక్ష్మీకాంతం. పుట. 244

5 కవిత్వ తత్త్వ విచారము. పుట 25

6 ఆంధ్ర ప్రబంధము, అవతరణ వికాసములు. పుట 56

7 చూ శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 872, 90వసర్గ, 10-13 శ్లోకాలు.

8 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 580-581, పంక్తులు 8189-8206

9 చూ. శ్రీ మద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 1112, 119వ సర్గ, 19-21 శ్లోకాలు

10 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 684-685, పంక్తులు 10679-10693

11 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 342-343, పంక్తులు 2431-2445

12 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 344, పంక్తులు 2479-2486

13 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 346-347, పంక్తులు 2529-2547

14 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 349-350, పంక్తులు 2605-2620

15 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 372-373, పంక్తులు 3147-3170

16 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 376-377, పంక్తులు 3239-3266

17 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 637-638, పంక్తులు 9573-9604

18 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 647-648, పంక్తులు 9821-9850

19 ఆంధ్ర మహాభారతము - అవతరణ వికాసము, పుట 78

20 నన్నెచోడ కుమార సంభవము, 1 ఆశ్వా., 44 ప.

21 కావ్యాలంకార చూడామణి, 3 ఆశ్వా., 42 ప.

22 అప్పకవీయము, 1 ఆశ్వా , 28 ప.

23 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 4-5, పంక్తులు 89--99

24 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 35-36, పంక్తులు 845-866

25 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 63-64, పంక్తులు 1534-1552

26 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 136-137, పంక్తులు 3297-3328

27 శ్రీమద్రామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 468,470, 41వ సర్గ, 12-13 శ్లోకాలు.

28 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట425, పంక్తులు 4427-4432

29 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 470, పంక్తులు 5514-5520

30 శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, పుటలు 546, 548, 73వ సర్గ, 31వ శ్లోకము.

31 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుట 271, పంక్తులు 6460-6479

32 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 71, పంక్తులు 1709-1718

33 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 94, పంక్తులు 2264-2274

34 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 201, పంక్తులు 4851-4865

35 శ్రీమద్రామాయణము, బాలకాండము, పుటలు 464, 466, 67వసర్గ, 15-18 శ్లోకాలు.

36 శ్రీమద్రామాయణము, సుందరకాండము, పుట 158, 1వసర్గ, 7-10 శ్లోకాలు.

37 శ్రీరామాయణము, సుందరకాండము, పుటలు 68-69, పంక్తులు 1613-1628

38 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుటలు 248, 250, 28 వసర్గ, 19-22

39 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుటలు 121-122, పంక్తులు 2689-2708

40 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పట 760, 73 వసర్గ, 49-50 శ్లోకాలు

41 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 353, పంక్తులు 8009-8024

42 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 37, పంక్తులు 887-889

43 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 392-393, పంక్తులు 3801-3828

44 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 407-408, పంక్తులు 3173-3190

5 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 425-426, పంక్తులు 3605-3627

6 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 11-12, పంక్తులు 248-288

7 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుట 108, పంక్తులు 2534-2550

శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 188, పంక్తులు 4543-4547.

49 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 189, పంక్తులు 4555-4557

50 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 48-49, పంక్తులు 1165-1196

51 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 375-376, పంక్తులు 2411-2435

52 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 503, 504, పంక్తులు 6317-6334

53 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 231-232, పంక్తులు 5521-5536

54 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుట 217, పంక్తులు 5169-5178

55 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పటలు 282-283, పంక్తులు 183-198

56 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుటలు135-136, పంక్తులు 2997-3009

57 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 357, పంక్తులు 8115-8118

58 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 353, పంక్తులు 8009-8024

59 శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము, పుట 1024, 107వసర్గ, 17-19 శ్లోకాలు.

60 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 647-648, పంక్తులు 9821-9850

61 శ్రీమద్రామాయణము, సుందరకాండము, పుట 68, 1వసర్గ, 190 వ శ్లోకము.

62 శ్రీరామాయణము, సుందరకాండము, పుట 14, పంక్తులు 297-315

63 శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండము. పుటలు 522, 524, 48 వసర్గ, 33-37 శ్లోకాలు.

64 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 445, పంక్తులు 4901-4908

65 శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, పుటలు 258, 260, 36 వసర్గ, 1-10 శ్లోకాలు.

66 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధా కాండములు, పుట 128, పంక్తులు 3020-3032

67 శ్రీమద్రామాయణము, అరణ్యకాండము, పుట 90, 12 వసర్గ, 29-31 శ్లోకాలు.

68 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధా కాండములు, పుటలు 43-44, పంక్తులు 1005-1016

69 శ్రీమద్రామాయణము, కిష్కింధాకాండము, పుటలు 170, 172, 17 వసర్గ, 34-46 శ్లోకాలు.

70 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 343-345, పంక్తులు 1653-1686

71 శ్రీమద్రామాయణము, యుద్ధకాండము, పుట 286, 32 వసర్గ, 32వ శ్లోకము.

72 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుటలు 138-139, పంక్తులు 3072-3077

73 శృంగార నైషధము, 7ఆశ్వా., 157 ప.

74 చూ ఆముక్తమాల్యదా సౌందర్యము, పుట 168

75 చూ ఆంధ్రమహాభారతము - ఛందః శిల్పము, పుట6

76 చూ. ప్రథమాంధ్ర మహాపురాణము, పుటలు 382 & 383

77 చూ. అదే.

78 చూ. శిల్ప ప్రభావతి, పుట 237

79 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 188, పంక్తులు 4540-4552

80 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 47-49, పంక్తులు 1147-1196

81 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుటలు 428-429, పంక్తులు 9769-9780

82 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 353, పంక్తులు 8009-8024

83 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 430-432, పంక్తులు 4547-4588

84 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 506-507, పంక్తులు 6401-6426

85 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 448-449, పంక్తులు 4983-5000

86 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 63-64, పంక్తులు 1535-1552

87 శ్రీరామాయణము. బాల అయోధ్యాకాండములు, పుటలు 542-546, పంక్తులు 7259-7364

88 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు614-624, పంక్తులు 9015-9262

89 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 313, పంక్తులు 1715-1724

90 శ్రీరామాయణము, సుందరకాండము, పుట 15, పంక్తులు 327-334

91 శ్రీరామాయణము, సుందరకాండము, పుటలు 27-28, పంక్తులు 631-644

92 శ్రీరామాయణము, సుందరకాండము, పుట 35, పంక్తులు 803-820

93 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 265, పంక్తులు 537-540

94 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 314, పంక్తులు 7109-7110

95 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 470, పంక్తులు 5514-5520

96 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుటలు 122-123, పంక్తులు 2878-2897

# ప్రకరణము - 4

# వరదరాజు కాలంనాటి సామాజిక పరిస్థితులు

'వాఙ్మయం సామాజిక జీవన ప్రతిబింబ' మని ఆర్యోక్తి, కావ్యేతివృత్తం ఏదైనా సమకాలీన సమాజ స్థితిగతులు ఆకావ్యంలో తప్పనిసరిగా ప్రతిబింబిస్తాయి ఈ విషయాన్ని బలపరుస్తూ కొక్కొండ సత్యవతిగారు 'సారస్వతమునకు సంఘమునకు నొక యవినాభావ సంబంధమున్నది' అనిచెప్పారు.[1]

విజయనగర సామ్రాజ్య పతనానంతరం క్రీ శ. 1630 నుండి మహమ్మదీయుల ఔన్నత్యం పెరుగసాగింది. ఈకాలంలో ఆంధ్రదేశాన రాజకీయంగా, సామాజికంగా సుస్థిరత కొరవడింది. చిన్న చిన్న రాజ్యాలమధ్య తరచూ యుద్ధాలు జరగడంతో ప్రశాంతత లోపించింది ఈ పరిస్థితి ఆనాడు వెలువడిన కావ్యాల్లో ప్రస్ఫుటమైంది.

ఉదా - వేమన పద్యాలు, క్షేత్రయ్య పదాలు, కూచిమంచి తిమ్మకవి రాజశేఖర విలాసము, రసిక జనమనోభిరామము.

తెలుగు సాహిత్యంలో మార్గపద్ధతికి చెందిన కావ్యాల్లో కొద్దిగాను, దేశిసరణిలో వెలువడిన కావ్యాల్లో అధికంగాను తెలుగుదేశీయమగు సామాజిక వాతావరణం గోచరిస్తుంది దేశి సంప్రదాయ ప్రియులైన కవులు ద్విపదకవులు అందుచేత ద్విపదకావ్యాల్లోని భాష, భావాలు, ఆచార వ్యవహారాలు, వేషభాషలు మున్నగునవి దేశితనంతో అలంకరింప బడివుంటాయి రామాయణం తెలుగుదేశ కథ కాక పోయినప్పటికీ సీతారాములు 'శ్రీరామాయణం'లో తెలుగువారుగానే కనిపిస్తా వారి ఆచార వ్యవహారాలు, వారిమాటలు, చేతలు తెలుగుతనంతో నిండి ఉంటాయి

## సాంఘిక పరిస్థితులు

ఈ అంశం కింద ఆనాటి వర్ణవ్యవస్థతో పాటు దైనందిన కార్యక్రమాల్ని పరిశీలించటం ద్వారా ఆకాలపు జీవన విధానం యొక్క స్థూలరేఖల్ని గ్రహించవచ్చు.

1) శుభకార్యానికి ముందుగా గాని, తర్వాతగాని భోజన సంతర్పణ చేయడం సహజం, శ్రీరామాయణంలో దశరథుడు సంతాన ప్రాప్తికోసం ఆశ్వమేధ యాగం చేయదలచి హోమనియమాలు నిర్వహించాడు. పేదలు, అనాథలు, రోగులు, వృద్ధులు, యోగులు మొదలైనవారికి 'ఇష్టమృష్టాన్నాల్ని' పెట్టించాడు. ఆ భోజన సంతర్పణలో దశరథుడు వడ్డింపచేసిన వివిధ పదార్థాల్ని ఒకసారి తిలకిద్దాము.

"అన్న పర్వతములు - నాజ్యవాహినులు
వన్నెమీఱు పసిండి - వన్నె సూపములు
ఫలములు కజ్జముల్- పాయ సాన్నములు
కలవంటకము లూరు-గాయ లంబళ్లు
పచ్చళ్ల పెరుగును - పాలు తేనియలు
నిచ్చలుగా భుజి-యించి యాజకులు
సవనావసరముల - శాస్త్ర ప్రసంగ
నివహముల్ గెలుచు పూ-ని కలవాదింప
నాగమ నిధులు ష-డంగ పారీణు
లాగమాంతార్థజ్ఞు-లైన ఋత్విజులు
ఉచితా సనంబుల - నుండి యయ్యాగ
మచలితక్రమముతో - నాచరింపంగ"[2]

1) కట్టా వరదరాజు శ్రీరామాయణము ఆధారంగా ఆనాటి సాంఘిక పరిస్థితుల్ని కొంతవరకు తెలిసికొనవచ్చు. వేషభాషలు, భోజన పానియాలు, శుభ కార్యాలు, పూజాపురస్కారాలు ఈ మొదలైన విషయాలెన్నో విపులంగా వరదరాజు వర్ణించియున్నాడు. రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారన్నట్లు 'కావ్యంసత్యమై ఆ కావ్యం వ్రాసిన కవి సత్యమైవుండగా, ఆ కావ్యంలోని విషయాలన్నీ సత్యదూరమనడం తగదు.'[3] కాబట్టి ఏ కవి ఏకావ్యాన్ని వ్రాసినా సమకాలంలోని రాజకీయ, సాంఘిక పరిస్థితులు ఆ కావ్యంలో తప్పక చోటు చేసికుంటూ వుంటాయి. శ్రీరామాయణములో రెండుచోట్ల విందుల్నిగూర్చి వర్ణించబడింది. ఈ సందర్భంలో మూలంలోకూడ విందుల ప్రసక్తి ఉంది. మూలంలో పేర్కొనని భక్ష్యాల్ని కొన్నింటిని వరదరాజు శ్రీరామాయణంలో మనము చూడగలం.

పుత్ర సంతానార్థియై దశరథుడు యాగ నిర్వహణ గావించు సందర్భంలోను, వేటకై వచ్చిన విశ్వామిత్రునికి ఆతని పరివారానికి వశిష్ఠుని కామధేనువు ఆకలిదప్పుల్ని తీర్చే సందర్భంలోను, మూలంలోను, శ్రీరామాయణంలోను భోజన ప్రసక్తికలదు.

యాగమునకు విచ్చేసిన వారందరికీ భోజన సదుపాయం కల్పించుట యాగనిర్వాహకుని బాధ్యత. రామాయణంలో దశరథుడు అశ్వమేధయాగాన్ని పుత్రసంతతికై చేశాడు.

అశ్వమేధయాగాది దినములలో దప్పిగొన్నవాడు గాని ఆకలిగొన్నవాడు గాని కనపడలేదని మూలంలో వర్ణితం.

"శ్లో || నతేష్వహస్సు శ్రాంతోవా క్షుధితోవాపి దృశ్యతే |,
నావిద్వాన్బ్రాహ్మణ స్తత్ర నాశతానుచర స్తథా ||
బ్రాహ్మణా భుంజతే నిత్యం నాథవంతశ్చ భుంజతే |,
తాపసా భుంజతే చాపి శ్రమణా భుంజతే తథా ||
వృద్ధాశ్చ వ్యాధితాశ్చై వస్త్రియో బాలాస్తథైవచ |,
అనిశం భుంజమానానాం నతృప్తి రుపలభ్యతే ||
దీయతాం దీయతా మన్నం వాసాంసి వివిధానిచ |,
ఇతి సంచోదితాస్తత్ర తథా చక్రు రనేకశః ||
అన్నకూటాశ్చ బహవో దృశ్యంతే పర్వతోపమాః |,
దివసే దివసే తత్రసిద్ధస్య విధివత్తదా ||
నానాదేశ దనుప్రాప్తాః పురుషా స్త్రీగణా స్తథా |,
అన్నపానై స్సువిహితా స్తస్మి న్యజ్ఞేమహాత్మనః ||
అన్నం హి విధివత్స్వాదు ప్రశంసంతి ద్విజర్షభాః |,
అహో తృప్తాస్స్మ భద్రం తే ఇతి శుశ్రావ రాఘవః ||
స్వలంకృతాశ్చ పురుషా బ్రాహ్మణాన్ పర్యవేషయన్ |,
ఉపాసతే చ తానన్యే సమ్మృష్టమణికుండలాః ||"[14]

ముదుసలులు, వ్యాధిగ్రస్తులు, స్త్రీలు, బాలులు ఎల్లవేళలా భుజిస్తున్నా. వారు తనివి నొందలేదు దీనికి కారణం ఆ పదార్థాల రుచి అతిశయమే 'అన్నం ఇవ్వబడుగాక అన్నం ఇవ్వబడుగాక' - అని పలువురు దశరథుని సేవకులు భోజనానికి అందర్నీ ఆహ్వానిస్తూ ఆయాగ సమయంలో కనపడ్డారు. నిత్యమూ పాకశాస్త్ర పద్ధతిగా తయారు చేయబడిన అన్నపురాసులు ఆయాగశాలలో ఉండినాయి. భోజనానంతరం బ్రాహ్మణులు తమతృప్తిని ఆశీర్వచనముల ద్వారా దశరథునికి తెలియజేశారు. వడ్డించేవారు సైతం అందంగా మంచి అలంకారాలు ధరించి భుజించువారికి ఆహ్లాదాన్ని కలిగించారు. వాల్మీకి పై వర్ణనల్ని కట్టా వరదరాజు గ్రహించి తనకాలంలోని వంటవార్ల వర్ణనను జోడించి దశరథునియాగ సమయంలో భోజన వర్ణన గావించాడు

స్త్రీలు, శిశువులు, వృద్ధులు, సన్యాసులు, ఆయాగంలో భుజించినట్లు మూలంలో, అనువాదంలోకూడ వుంది అన్నపర్వతాలు మాత్రమే మూలంలో చెప్ప బడగా నెయ్యినదులై ప్రవహించినట్లు, ఇంపుమీరిన సూపములు, పాయసాన్నములు,

ఫలములు, కజ్జములు, కల వంటకములు, పెరుగుపచ్చళ్లు, పాలుతేనియలు ఈ మొదలగు వంటకముల వర్ణన వరదరాజు రామాయణంలో ప్రత్యక్షమవుతుంది. స్వయంగా ప్రభువైన వరదరాజుకు భోజన విషయంలో రాజభోజనాన్ని వర్ణించడం అతిసహజం మూలంలో మంచి అలంకారాల్ని ధరించిన వారు బ్రాహ్మణులకు వడ్డిస్తూవుంటారని వర్ణింపబడింది వరదరాజు, నిపుణులైన వడ్డనలవారు యాగశాలలో బంతులకు వడ్డించినట్లుగా తెలియజేశారు. పై భోజన పదార్థాల వర్ణన వాల్మీకి కాలంనాటికి వరదరాజు కాలంనాటికి దేశకాలానుగుణంగా సమాజంలో వచ్చిన మార్పులకు ఉదాహరణగా స్వీకరించవచ్చు.

2) విశ్వామిత్రుని పరివారానికి విందు ఏర్పాటు చేయమని వసిష్ఠుడు తన కామధేనువును కోరాడు అప్పుడు కామధేనువు వారికి ఏయేపదార్థాల్తో విందు ఏర్పాటు చేసెంచో వరదరాజు తన శ్రీరామాయణంలో ఈ విధంగా తెలిపాడు.

"బంతులు సాగిన - పరివారమునకు
సంతసంబున నొక్క - సరియగుచుండ
లీల బంగారుప - ళ్లెరములు వారి
మ్రోల గిన్నెలతోడ - మొలిపించి యుంచి
కలిగించె నందుల - కలమాన్నరాశి
మొలిపించె బహు సూప-ముల కన్నుదనియ
పెరిగించెఁ జుట్టును - పెక్కు శాకములు
పరఁగించె మితిమీఱఁ - బచ్చళ్లగుంపు
జాలెత్తఁజేసె నా-జ్య ప్రవాహములు
తేలించెఁ దెప్పలఁ - దేనెకాలువలు
వెలయించె నేచాయ - వింతకజ్జములు
కలయించె నెడమీక - కలవంటకములు
ప్రవహింపఁజేసెను - పాయసాన్నములు
నవని నిండించెర - సావళ్లచేత
పులుసులు షడ్రసం-బులు వారివారి
తలఁపులఁదలఁచునం-తకు మున్నుగాగ"[5]

వాల్మీకి రామాయణంలో విశ్వామిత్రుడు రాజుగావుంటూ వేటకు వచ్చి వసిష్ఠుని ఆశ్రమంలో అతిథ్యాన్ని పొందిన సందర్భంలో భక్ష్యాల వర్ణనకలదు. వసిష్ఠుని ఆజ్ఞపై కామధేనువు చెఱకులను, తేనెలను, పేలాలను, శ్రేష్ఠమైన పానకాలను, నానావిధములైన

పిండి వంటలను, వేడివేడి అన్నపురాసులను, సూపంబులను పెరుగులను, షడ్రసంబులతో కూడిన భక్ష్యంబులను, బెల్లములతో చేసిన భక్ష్యంబులను ప్రసాదించి నట్లుగా వర్ణితము ఈ సందర్భంలో కట్టావరదరాజు వర్ణన గమనింపదగింది. వరదరాజు కవియొక్క రాజసము ఉట్టిపడుచున్న రీతిగానే ఈ వర్ణన సాగింది. భోజన వర్ణన ఎత్తుగడలోనే 'బంగారు పళ్లెరములు' అని ప్రారంభించాడు వరదరాజు. బంగారు పళ్లెరములు చుట్టూ గిన్నెల వర్ణనచేయబడింది. వాల్మీకి రామాయణంలో పళ్లెరములు, గిన్నెల వర్ణనలేనిచోట వరదరాజే పళ్లెరములు, గిన్నెల వర్ణన గావించినాడు అంటే వరదరాజు కాలంనాటికి పళ్ళెరములలో భోజనం చేయుపద్ధతి విరివిరిగా ఏర్పడి ఉండిఉండాలి. రాజు కాబట్టి బంగారు పళ్లెరముల వర్ణన చేసినాడు. శాకపాకములు, రకరకాల పచ్చళ్లు, నేయి, తేనె, వింతకజ్జములు, కలవంటకములు, రసావళ్లు వరదరాజు వర్ణనలో చోటు చేసికొన్నాయి

"ఘుమ్మని తావులు - గుమ్మరింపంగ
కమ్మందనంబు లా -కసమెల్లనిండ
దొరలతో నాటక - త్రుప్పుడుల్ దీఱ
పరిజనుల్ కుత్తుక - బంటిగా నపుడు
భుజియించి వార్చి తాం-బూలంబు లంది"[6]

అని పరిజనముల సంతుష్టిని వరదరాజు చక్కగా చేశాడు. రాజుగా వరదరాజు ఎన్నోపర్యాయాలు పరివారంతో కలిసి వనభోజనం కావించి ఉండవచ్చు. ఆ అనుభవం ఈ సందర్భంలో వరదరాజుకు ఉపయోగపడి వుండవచ్చు.

ఇట్లు వాల్మీకి రామాయణంలో గల భోజన సందర్భాలు వరదరాజు రామాయణంలో వర్ణనాధిక్యంతో కనిపిస్తాయి ఈ మార్పులు దేశకాలానుగుణంగా సమాజంలో వచ్చిన మార్పులకు నిదర్శనమని చెప్పవచ్చు.

3) సీతవృత్తాంతాన్ని తెలిసికొన్న వానరులు సంతోషంతో సుగ్రీవుని మధువనంలో ప్రవేశించారు. అక్కడ వారిచేత వరదరాజు త్రావించిన తేనెల్ని తిలకించండి.

"వల్లభంబగు మధు-వనము నీక్షించి
కంటిమిరా ! నేఁడు - కన్నుల మిట్టి
పంట ! యిందుల తీయ - ఫలములు గ్రోల
నాగ్రహించిన నేమి? - యామీఁద మనల
సుగ్రీవుఁడేమి చే-సుక పోయెనేమి
అనితేనె పెరమీఁద - నాఁడు మఱికల

యనువున నందఱు - నందులోఁజొచ్చి
పనఁటులకైవడిఁ - బనసల నున్న
తనువైన ఫలములు - తనివోక మెసవి
తియ్యమామిడి పండ్లు - తీయనివేడ్క
బయ్యాడి యామెత - పారణల్చేసి
గుళపానకము చవుల్‌కుఱు చఁగావించు
నెలనీళ్లు మేనుల - యెళపారఁద్రావి
పెరతేనియలు కుండఁ - బెట్టు తేనియలు
కురుజు తేనియలును - కొమ్మతేనియలుఁ
బుట్ట తేనియలును - బొదల తేనియలు
పుట్ట తేంతులఁ దీర్చి - జుంటి తేనియలు
బరులుబ్బఁగుత్తుక - బంటిగాఁబట్టి
తరువుల నీడలన్ - దగ విశ్రమించి"[7]

నేడు కొండప్రాంతాల్లో వుంటున్న కొంతమంది గిరిజనులు తేనెను ముఖ్యంగా సేవిస్తూ, అది విక్రయించి తమజీవన యాత్రను సాగిస్తూవుండడం గమనించ వలసిన విషయం వరదరాజు పై ద్విపద పంక్తుల్లో వివిధ రకాలతేనెల్ని గురించి చెప్పడాన్ని బట్టి ఆయనకు గ్రామీణ, అటవీ ప్రాంతాల ప్రజాజీవన విధానాలు సుపరిచితాలై ఉన్నాయని చెప్పవచ్చు

4) రావణుని ఆజ్ఞచే రాక్షసులు కుంభకర్ణుని నిద్రలేపడానికి ఉద్యుక్తులయ్యారు. అప్పుడువారు కుంభకర్ణునికి దాహోపశమన ద్రావ్యాల్ని ఇచ్చినట్లు వరదరాజు తెలిపాడు.

"అని పంచుటయును దైత్య శ్రేణివచ్చి
యనుపమ గంధమాల్యాంబరావళులు
నీరు మజ్జిగలు పన్నీరెళనీళ్లు
సారాయికుండలుఁ - జక్కెర చట్లు
కల్లుబిందెలు పానకంబులు చెఱకు
బిల్లలు మీఁగడ - పెరుగు కజ్జములు
నంజుడుల్నించు బానలు లేఁత తాఁటి
ముంజలు సుడిగొళ్లు - మొదలైనయట్టి
దాహోపశమన సద్ద్రవ్యంబులతని

గేహంబులోనఁ గ్రి-క్కి-తియ నమర్చి
పచ్చి నెత్తురుల దొ-బ్బలుఁ గొబ్బెరలను
దెచ్చి యాతని సమ-దృష్టి నమర్చి
యెటుచూడ యోజనం - బిరవైన యట్టి
పటువజ్రమయమైన - పడకింటి లోనఁ "[8]

కవి పైన తెలిపిన మజ్జిగ, చక్కెరచట్లు, పానకాలు, చెఱకు బిల్లలు, మీగడ పెరుగు కజ్జాలు తాటిముంజల్ని ప్రజలు ఎక్కువగా వేసవికాలంలో వాడతారు. వీటితో పాటు కుంభకర్ణుడు రాక్షసుడు కావున వరదరాజు వానిని సేవకులచే పచ్చి నెత్తురుల దొబ్బలుకూడ అందింపజేశాడు.

5) వరదరాజు శ్రీరాముడు సకల అలంకరణ సామగ్రితో అలంకరించుకొని సీతను వివాహమాడడానికి బయలదేరాడు. ఇక్కడ శ్రీరాముని వేషధారణ కవికాలం నాటి రాజుల వేషధారణగా కనపడుతుంది.

"ధరణీశునాజ్ఞ సో-దరులతోఁ గూడి
సరవిగా మంగళ - స్నానముల్ చేసి
సాంకవ మృగమద - సమ్మిశ్రమైన
కుంకుమపంకంబు - ఘుమ్మన నలఁది
నవరత్న భాసమా-నములైన యట్టి
వివిధాంగు ళీయక - వితతిఁ గీలించి
జవ్వాదితావు లె-సంగు సంపంగి
పువ్వుటెత్తులు సిగఁ - బొసఁగించి చుట్టి
సరిలేని కట్టాణి - చౌగట్లతోడ
నొరయుఁ జొక్కపుఁ గెంపు - టొంటులుదాల్చి
శ్రీకర రోహణ - శిఖర కూటంబు
రేక మాణిక్యకి - రీటం బమర్చి
మరకత శ్యామ కో-మల కుటీరమున
గరువంబుఁ గాంచు బం-గరు చేలఁగట్టి
పరమయోగుల మనః - పద్మముల్ వ్రాలు
సరణి సుతారక - సరములు వైచి
మనసులోఁ జొచ్చి య-మ్మదనుండు నిలిపెఁ
దనతేజి నన చిల్క-తాళిధరించి

పలక వజ్రములఁ జొ-ప్పడు భాషికంబు
నెలరేక హరుఁడు పూ-నిన మాడ్కి- పూని
ధరణీ భరము మాన్పఁ - దాదీక్షదాల్చు
కరణి ముంగేల కం-కణము ధరించి
శ్రీరామ విభుఁడు గై-సేసి సోదరులు
చేర రాఁగల్యాణ - శృంగారములను
జనకునిఁజేరి రా-జననాయకుండు
జనకు నింటికి వసి-ష్ఠ పురస్సరముగ"[9]

శ్రీరాముడు మంగళస్నానం చేసి 'ఘుమ్మ'ని వాసనలు వెదజల్లే కుంకుమ పంకాన్ని వంటికి పూసికొన్నాడు. నవరత్నాల్తో కూడిన ఉంగరాల్ని పెట్టుకొన్నాడు. తనసిగలో జవ్వాది వాసనల్ని వెదజల్లే పువ్వుల్ని సింగారించుకొన్నాడు నాలుగు ముత్యాల్తో తయారు చేసిన పోగుల్ని చెవులకు ధరించాడు. పర్వత శిఖరానికి వున్న కూటంలాగ తనశిరస్సుపై మాణిక్య కిరీటాన్ని అమర్చాడు మనోహరమైన తననడుమునకు బంగారు వస్త్రాన్ని కట్టుకొని, పరమయోగుల మనస్సుల్ని ఆకట్టుకొనే విధంగా మెడలో హారాల్ని వేసికొని మనస్సులో మదనుణ్ణి నిలిపాడు. చిల్కాలా? ధరించి, శివుడు అర్ధచంద్ర బింబాన్ని పూనిన విధంగా శ్రీరాముడు పలకవజ్రాల బాషికాన్ని ధరించాడు. భూభారాన్ని మాన్పడానికి దీక్షవహించిన విధంగా తాను ముంజేతికి కంకణాన్ని కట్టుకొని వసిష్ఠునితోగూడి జనకుని యింటికి వెళ్లాడని కవి తెలిపాడు

6) పెండ్లికుమార్తెను అలంకరించటం తెలుగు దేశంలో ఒకసంబరం. వధువును ముత్తైదువులు ముచ్చటగా అలంకరిస్తారు. ఇలాంటి సన్నివేశమే వరదరాజు శ్రీరామాయణంలో ఉంది

"సరిలేని ముత్యాల - సరులును కంఠ
సరియు నొడ్డాణంబు - సంది దండలును
కట్టాణి ముక్కర - కళుకుఁగమ్మలును
మట్టెలుంగరము ల-మ్మణుల గాజులును
కంకణమ్ములు నూడి-గములు నందెలును
కింకిణీ రవములఁ - గెలయు మేఖలయు
ముత్తేల బొగడలు - ముక్కెఱనడుగు"[10]

మున్నగు ఆభరణాలతో వరదరాజు కన్యలను పెండ్లికుమార్తెలుగా అలంకరింప జేశాడు. దివ్య సాంబ్రాణి ధూపగంధాలతో సముదీర్ణచిరత్నరత్న నానాచిత్రరంగ

వల్లికలతో నూత్నవైఖరులుగా కన్నులవిందు చేసేటట్లు పెండ్లిచవికెను ఏర్పాటు గావించాడు కవి వధూవరుల మధ్య తెరపట్టించాడు. అప్పుడు వసిష్ఠుడు 'కుర్వంతుతే మంగళమ్' - అని అనగా తెరతొలగించారు. ఆసమయంలో జనకుడు శ్రీరామునకు మధుపర్కం ఇచ్చి కన్యాదానం కావించాడు. తర్వాత శ్రీరాముడు సీతకు మంగళ సూత్రాన్ని కట్టాడు. పిదప వధూవరులు తెలుగువారి వలెనే తలంబ్రాలు పోసికొన్నారు.

7) భరతుడు శ్రీరాముని మరల అయోధ్యకు కొనిరావడానికి నిశ్చయించి అరణ్యానికి బయలుదేరాడు. అప్పుడు ఆతనిముందు నడచిన సిబ్బందిని, వారి వస్త్రాదుల్ని గురించి వరదరాజు ఇట్లు వర్ణించాడు

"పడివాగె తేజీలు - పదినూరు వేలు
కడవాగె సొదులు - గైకొనినడవ
పొగరు జీనానూలి - బొందుల యోర
సిగ కొత్తములపము - సేయుఁగత్తులును
బురుసారుమాలు ల-బ్బురపుమైఁ ఝూఁత
పరిమళంబులు దు-ప్పటి పెల్లెవాళ్లు
పట్టు చల్లడములు - పైదట్ల మీఁదఁ
గట్టిన వంకులుం-గల వీరభటులు
కైసీత మొకకోటి - కన్నుల యెదుర
రాజమార్గము నిండి-రా భరతుండు
తమ్ముఁడాచార్యుండు-తమ ప్రధానులును
కమ్మత మణిశతాం-గములపైఁగదల
కౌసల్యయు సుమిత్ర - కైకేయి మున్ను
గాసాధ్వు లందరుఁ - గనక పల్లకుల
గొల్లలాప్తులుఁ గంచు-కులు చేటికలును
పల్లకీలను వెంటఁ - బాయక రాఁగ
వెలయు డెబ్బది రెండు - వినియోగములకుఁ
గలవారు నలుదిక్కు - గదిసి భజింప
మున్నుగాఁ గోమట్లు - ముదుసళ్లు సెట్లు
సౌన్నారములవారు - సూపకారులును
పౌరులు నటులును - పాఠకు, లాట
వారును, కంచర - వారును, కాళ

వారును, సౌదపని - వారును, సాలె
వారును, పటుసాలె - వారును, ముచ్చి
వారును, కుమ్మర - వారును, చాకి
వారును, చాయల - వారును, పనుల
వారును, కటికిరి - వారును, వడ్ల
వారును, మేదర - వారును, గంధ
కారులు, జెట్లును - గణికులుఁ, జిప్పె
వారును, మాంత్రికుల్- వైద్యులు, సోది
చెప్పడు వారును - శిర్నాల వారు
చొప్పరులు, దలార్లు - జోస్యులుం గదల"[11]

ఖురుసారుమాళ్లు, దుప్పట్లు, వల్లెవాట్లు పట్టుచల్లడాలు, పైదట్లమీద కట్టిన వంకులుగల విరఖటులు భరతునితో బయలుదేరారు. పైవస్త్రాలు, ఉడుపులు వరదరాజు కాలంనాటి సమాజంలోని ప్రజలు ధరించేవని చెప్పవచ్చు. అలాగే వివధ వృత్తులు చేసికొనే అనేక వర్గాల ప్రజలు భరతుని ముందు నడిచినట్లు వరదరాజు పై ద్విపద పంక్తుల్లో పేర్కొన్నాడు వృత్తులపరంగా వర్గాలు ఏర్పడ్డాయని, వరదరాజు తెలిపిన పై వృత్తుల వారంతా నాటి సమాజంలో వుండేవారని చెప్పవచ్చు.

8) శ్రీరాముడు శివధనువును విరిచిన పిదప సీతాకళ్యాణ ముహూర్తం నిశ్చయ మైంది జనకుడు దశరథునకు శుభలేఖను పంపాడు. ఆ లేఖ పదహారు, పదిహేడు శతాబ్దాల్లోని రాజమర్యాదల్ని జ్ఞాపకపరుస్తూవుంది.

"-----------శ్రీమన్ మ-హామండలేశ్వ
రేందుకులోత్త మా-హీన ప్రతాప
జనక మహారాజ - చంద్రులంగారు
మనువంశ దశరథ - మనుజేశు నగరిc
జాలుమానిసులకు - సంప్రీతిcబంపు
మేలువార్త నిరుద్ధ - మితమున కేము
అందఱుc బరిణామ - మచటి మీారాజు
నందు యోగక్షేమ - మప్పటప్పటికి
వ్రాసి యంపునది మా-వైదేహిcబెండ్లి

చేసెద మిపుడు మీ-శ్రీరామునకును
మీరాజు వారును - మీ పురోహితులు
చారు వైఖరులఁ గౌ-సల్యాదిసతులు
రావలెనని తమ-రాజుతోఁ దెలుపఁ"[12]

ఈ లేఖవల్ల వరదరాజు కాలంనాటి రాచరిక వ్యవస్థలోని పెండ్లిపిలుపు పద్ధతు లెట్టివో గ్రహింప వీలగుచున్నది.

9) తెలుగుదేశంలోని కొన్ని ప్రాంతాల్లో పెండ్లికాగానే పెండ్లికూతురు యొక్క సంసారానికి అవసరమయ్యే వస్తుసామగ్రిని ఆమె తల్లిదండ్రులు సమకూర్చడం ఆచారం. అదేవిధంగా ఆమె జీవిత భద్రతకోసం నేడు ఇచ్చేకట్నంలాగానే వరదరాజు కాలంనాడు గోవులు, ఆభరణాలు మొదలైనవి అరణంగా ఇచ్చేవారు. సీతకు అరణంగా జనకుడు ఇచ్చిన ఈక్రింది వస్తుసామగ్రి సంపదను తిలకించండి.

"దశరథు ననిచి సీ-తకు నరణముగ
దశోతరస్యేకా-దాసీ జనములు
లక్షయేనుఁగు, లైదు-లక్షల హరులు
నక్షయంబగు పాఁడి - నమరుదేనువులఁ
గోట రథమ్ములం-గొన్ని, వస్త్రములు
కోటియు, గ్రామముల్- గొన్ని, యాభరణ
కోటియు, రత్నముల్- కొన్ని, దీనార
కోటియు, వస్తువుల్- గొన్ని, శాలువలు
పట్టెమంచములుసు - పరపులు, మేలు
కట్టులు, తెరలు, చౌ-క్కపు గుడారములు
దివ్యాగంబములు, చే-దీపముల్, గోవ
జవ్వాది పిల్లులు - జాలవల్లికలు
చప్పరమంచముల్- సానలు, పచ్చ
కప్పరంబుల క్రోవి-గములు, బన్నీరు
చెంబులు, గంధపుఁ - జెక్కలు, రత్న
కంబళములు, పచ్చి - కస్తూరి వీణె
పెట్టెలుం, జీరల - పెట్టెలు, సొమ్ము
పెట్టెలు, నపరంజి - బిందెలు, పైఁడి

కొప్పెరలును, తంబు-గులు, వట్టివేళ్ల
చప్పరంబులును, వా-సన సురటీలు
గిండులు, పడిగముల్- కిన్నెరల్, వీణె
దండెలు తంబురాల్- తలగడల్, పడక
కత్తులు, బటువులు - గాజు గిన్నెలును
చిత్తరు తెరలును - చిటికె వార్వములు
చిలుక పంజరములు - సింగాణి విండ్లు
నిలువుటద్దములు, మా-ణిక్యదీపములు
నుయ్యాల గొలుసులు - నుదిరిపావాలు
ముయ్యాడు చదరంగ-ములు, సొగటాలు
మొదలుగా నొసఁగి రా-ముని కొప్పగించి
మదిఁగలఁగఁగ బుద్ధి-మార్గముల్ పలికి"[13]

సీత రాజవంశజ కాబట్టి, ఆమెకు వెయ్యిమంది దీసీజనం, లక్షయేనుగులు, ఐదులక్షల గుఱ్ఱాలు, పెక్కు రథాలు, ఎన్నో గ్రామాలు, అనేక రత్నాలతోపాటు వివిధ వస్తుసామగ్రిని వరదరాజు జనకునిచేత అరణంగా ఇప్పించాడు.

10) అంతః పురమర్యాదల్ని వరదరాజు తన శ్రీరామాయణంలో చక్కగా ప్రస్తావించాడు. రాజు మందిరంలోనికి ప్రవేశించగానే బహుపరాకులను, బిరుదుగద్యల్ని చదవటం రాజమర్యాదల్లో ఒకభాగం. ఆ ప్రకారంగా కైకేయి అంతఃపురంలోని చిలుకలు, గోరువంకలు బహుపరాకుల్ని పలుకుతుంటాయి. ఆ చిలుకలే రాజుకు ఎదురేగి స్వాగతవచనాలు పలుకుతూవుంటాయి.

దశరథుడు కైకేయిమందిరంలో ప్రవేశించగా, ఆ మందిరంలోని కనకపంజరాల్లో వుండే శారికలు (గోరువంకలు) దశరథుని గాంచిపలికిన ఈ క్రింది పలుకులను చిత్తగించండి.

"అజకుమారక ! భాస్క-రాన్వయ జలధి
రజనీకర ! సమస్త - రాజమూర్ధన్య !
దాన దీక్షాధురం - ధర ! వైరిరాజ
మాన నీరాకర - మథన కృపాణ !
సత్యవాక్య ప్రతి-ష్ఠా సంప్రదాయ
అత్యంత నియత - ధర్మాచార నిపుణ !
దశరథేశ్వర ! యవ-ధారు ---------"[14]

అని ఆ అంతఃపురమందలి గోరువంకలచేత వరదరాజు బహుపరాకులు పలికించాడు.

11) భరతుడు అరణ్యానికిపోయి శ్రీరాముని అయోధ్యకు తీసికొనిరావడానికి నిశ్చయించాడు. అప్పుడు వనమార్గాన్ని ఏర్పరచడానికి భటులు ముందుగా వెళ్లారు. అందునిమిత్తమై వారు తమవెంట తీసికొనివెళ్లిన వివిధ పరికరాలు ఇలా ఉన్నాయి.

"పారలు, సుప్పర - పారలు, గడ్డ
పారలు, చెక్కుడు - పారలు, మడ్డు
గత్తులు, గొడ్డండ్లు - కర్జెలుం, గొలిమి
తిత్తులు, దన్నీరు - తిత్తులు, కరకు
కొడవండ్లు, నెడ్లును - గోనెలుc దాటి
గుడము, సున్నంబు, సం-కులుc గావిరాళ్లు
పంచవర్ణ ద్రవ్య - భాండముల్, నీరు
మంచముల్, నిచ్చెనల్- మ్రాఁకుల బండ్లు
చించపు రేకులు - చింతయంబళ్లు
పెంచులు, నిటికలు - బేర్పులు, నూనె
లగపలు, కణికలు - నావులు, రెట్లు
నగరి బొక్కిసము గు-న్నాపట్టి కరక
కాయలు, పంచాణి-కపుc బనిముట్లు"[15]

పైన పేర్కొన్న వేర్వేరు పనిముట్లతో భటులు ముందుగా వెళ్ళారని వరదరాజు తెలిపాడు. ఆ విధంగా కవి మీదపేర్కొన్న వేర్వేరు రకాల పనిముట్లను తెలుగుదేశంలో శ్రామికులు విరివిగా ఉపయోగించేవిగా ఉన్నాయి.

12) రామాదులు పదునాలుగేండ్లు అరణ్యవాసం చేయడానికి పయనమై గంగానది చెంతకు చేరుకొన్నారు. వారు గంగానదిని దాటుతూవుండగా సీత ఆ నదినిచూచి -

"నీకొఁ ఒకప్పుడ - నేకవిప్రులకు
సాకేతనగరి భో-జనములమర్చి
శాటికా గోదాన - శతములు చేసి
చాటించి పురి గంగ-జాతర నడచి

మైరేయ మాంస సామగ్రితోఁ గొలిచి
పేరటాంద్రకు నీదు - పేర పుట్టములు
కట్టించి నీదరి - గాఁచువేల్పులకుఁ
గట్టించెదము గుళ్ళు - గ్రామాంతరముల"[16]

అని మ్రొక్కుకున్నది. ప్రతియేడాది గంగజాతర చేయడం తెలుగువారిలో నేటికీ నిలిచివున్న ఆచారం. గంగజాతరలు ఈ నాటికీ పల్లెల్లోనే కాకుండా పట్టణాల్లోకూడా జరుగుతూనే వున్నాయి. ఈ జాతర్లలో భక్తులు, తమకోర్కెల్ని తీర్చమని గంగమ్మ తల్లికి మ్రొక్కుకొంటారు. పై ద్విపద పంక్తుల్లో వరదరాజు సీతచేత గంగాదేవికి మ్రొక్కించడం ద్వారా తెలుగుతనాన్ని చొప్పించాడు.

13) వరదరాజు గొప్పవిష్ణుభక్తుడు. అందువల్ల శ్రీరామాయణంలో అక్కడక్కడ వైష్ణవ సంప్రదాయాల్ని కొన్నింటిని వ్యక్తీకరించాడు

i) ఉదయం నిద్రనుంచి లేవగానే నామతీర్థాదికములను తీర్చడం దశరథునకు కూడా ఆచారమే.

ii) శ్రీరామ పట్టాభిషేకానంతరం అందరూ తమతమ నెలవులకు వెళ్లారు. విభీషణుడు, తనకు లంక అవసరం లేదని రాముని వద్దనే ఉంటానని తెలిపాడు. అప్పుడు రాముడు విభీషణునకు సంతృప్తి గొలిపించటానికి అతనికి శ్రీరంగశాయిని ఇచ్చాడు

"తనమారు తనకుల - ధనము పూర్వమున
మనుపుత్రుఁ డిక్ష్వాకు - మను జేశ్వరుండు
నిలిపిన మాపాలి - నిక్షేపమీవు
కొలువుము లంకకుఁ - గొని పొమ్మటంచు
సజ్జతో శ్రీరంగ-శాయి నొసంగ"[17]

14) వాలికి దహన సంస్కారం చేయడానికి అవసరమైన వస్తువులను తెప్పింపుమని లక్ష్మణుడు సుగ్రీవునకు చెప్పాడు. ఇక్కడ వాలిదహన సంస్కారానికి ఉపయోగించిన వస్తువులు తెలుగువారి సంప్రదాయానికి అనుగుణంగానే వున్నాయి.

"అర్కనందన ! రాజ-వవనికి నీవు
మర్కటేంద్రుల నంపి-మతికాష్ఠములను
గంధపుఁ జెక్కలుఁ - గదళికాండములు

గంధవొడియును నూత్న - కనకాంబరంబుఁ
దెప్పింపు మంగదుఁ - దెమ్మని పనుపు
మిప్పుడు, లాజలు - నెఱ్ఱపువ్వులును
పరిమళ ప్రసవధూ-పము లక్షతములు
పెరుగు పాలును నెయ్యి - బెల్లంబు తేనె"[18]

ఈ రీతిగా ఈ రాజకవీంద్రుని ద్విపదకృతిలో సమకాలీన సాంఘిక పరిస్థితులు చక్కగా ప్రతిబింబించియున్నవి.

## సంఖ్యా సూచిక

1 తంజాపురాంధ్ర సాహిత్య చరిత్ర, పుట. 320

2 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 57-58, పంక్తులు 1391-1400

3 సాహిత్యవ్యాసాలు, రాళ్లపల్లి అనతం కృష్ణ శర్మ.

4 శ్రీమద్రామాయణము, బాలకాండము, పుటలు 130, 132, శ్లోకాలు 9-16

5 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 161-162, పంక్తులు 3895-3910

6 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 162, పంక్తులు 3911-3915

7 శ్రీరామాయణము, సుందరకాండము, పుటలు 197-198, పంక్తులు 4654-4672

8 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 245, పంక్తులు 5497-5510

9 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 218-219, పంక్తులుఉ 5273-5298

10 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 221, పంక్తులు 5343-5349

11 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 566-567, పంక్తులు 7839-7870

12 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 203-204, పంక్తులు 4907-4919

13 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు227-228, పంక్తులు 5483-5512

14 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు284-285, పంక్తులు1011-1019

15 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుటలు 559-560, పంక్తులు 7687-7699

16 శ్రీరామాయణము, బాల అయోధ్యాకాండములు, పుట 461, పంక్తులు 5293-5300

17 శ్రీరామాయణము, యుద్ధకాండము, పుట 539, పంక్తులు 12308-12312

18 శ్రీరామాయణము, అరణ్య కిష్కింధాకాండములు, పుట 379, పంక్తులు 2503-2510

## ప్రకరణము - 5

# వరదరాజు శ్రీరామాయణంలోని భాషావిశేషాదులు

5 0 కవులు కావ్యరచనకు ఉపయోగించే ప్రధాన ద్రవ్యరాశి భాష, ఒకోకవి ప్రయోగించు భాషా స్వరూపములో అతని వైయక్తిక ముద్రతో పాటు కొన్ని ప్రత్యేక విశేషములు గోచరించు చుండును. రాజకవియగు కట్టావరదరాజు రచించిన ద్విపద రామాయణమునందలి భాషా విశేషములను సామెతలు, జాతీయాలు, లోకోక్తులు ఇత్యాద్యంశములుగా పరిశీలించుట ప్రకృత ప్రకరణము యొక్క ముఖ్యోద్దేశము.

### 5 1 సామెతలు

మానవుడు నిత్యము తాను సంఘంలో చూచే విషయాలను, తన అనుభవ సర్వస్వమును, గడించిన విజ్ఞానమును, లోకపురీతిని - చిన్న చిన్న మాటలతో జోడించి విసిరాడు. అవియే సామెతల రూపంలో నేడు చెలామణి అవుతున్నాయి. 'ఏదైనా ఒక విషయం చెప్పేటప్పుడు పోలికకోసం చెప్పేవాక్యం 'సామెత' అని స్థూలంగా చెప్పుకోవచ్చు' [1]

చెప్పదలచుకొన్న భావాల్ని సంక్షిప్తంగా, సూటిగా శ్రోతమనస్సుకు హత్తుకొనేటట్లు చెప్పడంలో సామెతకు సాటియైనది మరొకటిలేదు. శ్రోత అభిప్రాయాన్ని ఖండించడానికిగాని, బలపరచడానికి గాని సామెతల్ని ఉపయోగిస్తారు.

సామెతకు, జాతీయానికి సామాన్యమైన లక్షణాలు కొన్నికలవు. జాతీయానికి గల ధర్మములెన్నో సామెతయందు కనపడును. అయినా జాతీయము కొన్ని ప్రత్యేక లక్షణాల్ని కలిగివుండి సామెతనుండి వేఱుచున్నది. జాతీయానికి, సామెతకు గల సమానధర్మాల్ని గూర్చి 'బ్రాహి' పండితుడిట్లు వివరించాడు.

A proverb shares several characteristics of an idiom It is short and terse It comes from the people and is actually used by them, like an idiom it results from the common everyday experiences of our village folk and particularly ladies It's subject matter is also the same The genesis of an idiom and a proverb is common concretion and generalisation are then, the most prominent characteristics of a proverb as well as of an idioms "[2]

కొందరిమతమున కవిత్వానికి ఆరంభదశలోకోక్తులు. మరికొందరి మతమున సామెతలు. అల్పమైనను సామెతలకున్న శక్తి అనల్పము. 'అల్పాక్షరంబుల

ననల్పార్థరచన .... .......'అన్న పాల్కురికి సోమనమాటలు సామెతలకే అన్వయించుకోవచ్చును.

'సామెతలు కొన్నిసూటిగా, కొన్ని ధ్వని పూర్వముగ, మరికొన్ని అలంకార యుతముగ ఉండును.

'Proverbs are the daughters of daily life' అని ఒకడచ్ సామెత. సామెతలకు జీవితానికి గల అవినాభావ సంబంధమట్టిది.

బాషా శరీరానికి అలంకారములు సామెతలు. ఒక బాషలోని అందచందము లన్నిటిది ఒక ఎత్తు. సామెతలది ఒక ఎత్తు

అయోధ్యాకాండము :

| | | |
|---|---|---|
| 1 | "ములుతీగె ఫలవృక్షమునుఁ గూడినట్లు" | (పు 276, పం 805) |
| 2 | "మగడొల్లనట్టియమ్మగు వలకెందు<br>జగమెల్ల వెదకఁబూజ్యా తలేల కల్గు?" | (పు 337, పం 2309-2310) |
| 3 | "ఆవులేఁగనుఁ బాసియఁఋనట్లు" | (పు 338, పం 2337) |
| 4 | "పంచాననము లేడిఁబట్టినయటుల" | (పు 338, పం 2327) |
| 5 | "ప్రువ్వఁడిట్టిన తిట్లు పొరిగొనకున్నె?" | (పు 398, పం 3778) |
| 6 | "మునిఁడి చెట్టునఁదేనె మొలచునే తల్లి"! | (పు. 398, పం 3787) |
| 7 | "మొరయునే తంత్రికమ్ములు లేనివీణె ?" | (పు 416, పం 4217) |
| 8 | "తరలునే చక్రముల్ దప్పింపరథము ?" | (పు 416, పం 4218) |
| 9 | "లేఁగగానక కోల్పులికిఁ జిక్కునావుతో గూర్చె" | (పు 431, పం 4583) |
| 10 | "నీరంబు లేకగండెలు మనఁగలవె?" | (పు 466, పం. 5414) |
| 11 | "నక్కలు దిన్నట్టి నంజుడు గొంత<br>చిక్కినమేయునే సింగంపుఁ గొదమ ?" | (పు 490, పం 5987-5988) |
| 12 | "కొమ్ములు పడవేసికో సెదుమనిన<br>సమ్మతించునటె వృషభము లెచ్చోటఁ?" | (పు 490, పం 5993-5994) |
| 13 | "సింగంబునకు నమర్చినయా మిషంబు<br>చెంగట శునక మాసింపఁజేకూరునె ?" | (పు 637, పం 9581-9582) |
| 14 | "గరుడని గమనంబు కాకికిఁదగునె?" | (పు 637, పం 9583) |
| 15 | "ఖరమువోవునె తురంగమము చందమున ?" | (పు 637, పం 9584) |

16 "పెరుగుటలెల్లను పెక్కువ దక్కి
తరుగుటకే కాక తాయేలనిల్చు ?" (పు. 639, పం.9613-9614)

17 "జగతిఁబుట్టుటలెల్ల చచ్చుట కొఱకు" (పు. 639, పం. 9615)

18 "పగగొనుటకుఁజెల్మిబలవంతమగుట" (పు 639, పం 9616)

19 "మడికిఁ బారిన నీరు మఱలినయట్లు" (పు. 640, పం 9653)

20 "జలధిలో నావలాడంగఁదడికె చాటులఁదేల ?" (పు 661, పం. 10158)

అరణ్యకాండము :

1 "అగ్నివర్ణమున క్షితినెఱ్ఱనైయున్న
శిలవాల్పఁగఁలడె ?" (పు 98, పం 2312-2313)

2 "పిచ్చుకయెట్లు గుప్పించువారధిని?" (పు. 132, పం. 3115)

3 "నక్కవాకిలి గాచిన మృగంబులేమి
యక్కరలదీరి సౌఖ్యము లందఁగలవు?" (పు 143, పం 3390-3391)

4 "గఱిక గప్పిన నూతికైపడిఁ " (పు.162, పం 3828)

5 "కోరఁజెల్లని సింహకులసతి నక్క
గోరిన చందానఁ గోరితి వీవు" (పు 170, పం. 4028-4029)

6 "గరుడునితో మాలకాకియే రీతి సరివచ్చు?" (పు 171, పం 4050)

7 "యాగబియ్యంబనియత్తి వజ్రంబు
మూఁగి మ్రింగిన జీర్ణమున కేలవచ్చు?" (పు. 171, పం 4056-4057)

8 "పొడువ వచ్చిన వారిఁబొడుతురు గాక
విడుతురే యెంద్రైన వీరశేఖరులు?" (పు 182, పం 4320-4321)

9 "కరువలి నురిగోలఁగట్టి తేగలరె?" (పు. 203, పం 4828)

10 "తరలింపవచ్చునే దహనుతోఁగీల?" (పు 203, పం 4829)

11 "పశమెయూపమునఁ బల్వడి కట్టువడిన
పశువు తప్పించుక బ్రదుక నెంచఁగను?" (పు. 206, పం. 4898-4899)

12 "వాయువుచేత గదలునే మేరువు?" (పు 238, పం 5681)

13 "పుడమిపై వెదకుచుఁ బోయెడి తీవె
యడుగుల దగులు కొన్నట్టి చందమునఁ" (పు. 253, పం. 6043-6044)

కిష్కింధాకాండము :

1 "కార్యభాగంబు లొంగాములు గలవె?" (పు. 284, పం. 2207)

2 "చెలికానికైన యొచ్చెము మాన్పలేని
చులకని వాడు యశోనిధియగునె?" (పు. 349, పం. 1785-1786)

3 "కప్పవక్కినయట్ల కాలాహివక్కి
కప్పనమ్మికఁజేరఁగని మ్రింగినట్లు" (పు 434, పం. 3817-3818)

సుందరకాండము :

1 "ఏనుగుముందఱనెదురు కుందేలు
పోనోపునే గెల్చి?" (పు 77, పం. 1833-1834)

2 "పిచ్చుకమీఁద నోరామ ! బ్రహ్మాస్త్రమురక వేయుదురే?"
(పు 134, పం 3173-3174)

యుద్ధకాండము :

1 "దావాగ్ని చెదలంటునమ్మ" (పు. 140, పం. 3103)

2 "తరువృంతమునఁబోవు తాళఫలంబు
ధరడొల్లినటుల నీతలఁ ద్రెవ్వవైతు" (పు. 314, పం 7109-7110)

3 "వెదకుచు వచ్చు తీవియదైవగతిని
పదములు దవిలిన పగిదిఁగాంచితిని" (పు. 348, పం. 7905-7906)

4 "ఖరము నేర్చునె తురంగమురీతిఁ బఱవఁ ?" (పు 530, పం 12084)

5 "కఱిగాకి హంసంబుగతి మింటఁజనునె?" (పు 530, పం 12085)

6 "కరిమాడ్కి నడచునే గ్రామసూరకము?" (పు. 530, పం. 12086)

7 "హరియౌనె తానెంతయైన శ్వానంబు?" (పు 530, పం. 12087)

8 శిరసుండ మోకాలఁజేతురే పూజ?" (పు. 540, పం 12318)

## 5.2 జాతీయాలు

జాతికి సంబంధించినది జాతీయము. ఈ పదానికి నుడికారము, పలుకుబడి, పదబంధము అనునవి పర్యాయపదాలు ఇవి ఒక్కొక్క భాషలో ఒక్కొక్క విధంగా ఉంటాయి.

నానుడి - నాను + నుడి = 'అందరినోటను నానెడి వాక్యము' అనియర్థము. ఈ పదానికి జనశ్రుతి, కింవదంతి, లోకోక్తి సామెత అనేఅర్థాలను సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొన్నది. ఇందువలన లోకోక్తులు, సామెతలుకూడ నుడికారము క్రింద చేరగలిగినవే అని నిఘంటుకారుల అభిప్రాయమని తోస్తున్నది.

నుడికారము - నుడికారమనగా పలుకు, మాట, సరసత మున్నగు వాని యందలి చమత్కారము దీనినే శ్రీనాథుడు భీమేశ్వర పురాణంలో

"ప్రౌఢ పరికింప సంస్కృతభాష యండ్రు
పలుకు నుడికారమున నాంధ్ర భాష యండ్రు
ఎవ్వరేమన్ననేమి నాకేమి కొదువ
నా కవిత్వంబు నిజము కర్ణాట భాష"

- 1 ఆశ్వా, 15ప.

అని పేర్కొన్నాడు.

ఇట్టిభాషా విశేషాలు ఆ భాషను వ్యవహరించే ప్రజలయొక్క అభిప్రాయ వ్యక్తీకరణ సామార్థ్యాన్ని, బుద్ధిశక్తిని చాటుతూవుంటాయి. జనసామాన్యంలో ప్రచారంలో వుండే పలుకుబడులు శక్తిమంతాలు. వాటికి ప్రసిద్ధమైన రూపం, నిర్దిష్టమైన జీవం ఉంటుంది. "పలుకుబళ్లు సాధారణంగా జనసామాన్యంలోనుంచే వస్తాయి. పాండిత్యంవల్ల ఏర్పడినవి కావు. పలుకుబడి తెలుగు ప్రజలలో పుట్టి తెలుగు ముద్రను పొంది, తెలుగుదేశంలో వ్యాపించి తెలుగు జాతీయమన్న గౌరవం సంపాదించుకొని తెలుగు కవిత్వానికి ఒక అందాన్ని కలిగించింది. పండితకవులు పలుకుబడుల వలన రచనకు కలుగు ఆదరాభిమానములను గుర్తించి వాటిని విశేషముగా తమ రచనల యందుపయోగించి తెలుగువారి మెప్పును పొందినారు"[3] అని తాపీధర్మారావుగారు 'తెలుగు పలుకుబడులు' అనే వ్యాసంలో తెలిపారు "జాతీయములు మూడువిధాలు 1. పూర్వకవులు ప్రయోగించినవి. 2 నాడు జనవ్యవహారమునందున్నవి. 3 కవి స్వయముగా కల్పించినవి." [4]

వీనినే సూక్తులని కూడ ప్రాచీనకవులు పేర్కొన్నారు నన్నయ వీటినే 'నానారుచిరార్థ సూక్తు' లన్నాడు ఎఱ్ఱాప్రెగడ దీనిని 'సూక్తివైచిత్రి' అని నుడివినాడు కాబట్టి ఇవన్నీ ఒకేవిషయాన్నిగూర్చి తెలిపే వేర్వేరు మాటలని చెప్పవచ్చు

1 "గతజల సేతు బంధనము" (అయోధ్యా, పు. 269, పం. 629)

2 "కత్తి మీఁదిసాము" (అయోధ్యా, పు. 303, పం. 1481)

3 "తేనియ పూయుకత్తి" (అయోధ్యా, పు. 300, పం. 1398)

4 "గుటికె మ్రింగిన సిద్ధుఁడు " (అయోధ్యా, పు. 330, పం. 2143)

5 "చవుటనేలను వెదఁజల్లు బీజములు" (అయోధ్యా, పు. 338, పం 2335)

6 "కొఱవిఁ జూచిన యేనుగు" (అయోధ్యా, పు. 344, పం. 2489)

7 "తద్దినమ్ములు పెట్టుట" (అరణ్యా, పు 37, పం 845)

8 "సామజోత్తమము దీర్ఘుఁగనైన పనికి
దోమలు పూని పొందునె కార్యసిద్ధి ?" (కిష్కింధా, పు 524, పం. 5991)

9 "చంకదుడ్డు శరణార్థి" (యుద్ధ, పు 65, పం 1503)

10 "పైరు చేసిన చెట్టు ఫలమందుచోట
నూరక తెగగొట్టను చితంబెనీకు?" (యుద్ధ, పు 254, పం 5721-5722)

11 " అనిలోన వెనకముందైరఁటు నేఁడు" (యుద్ధ, పు 361, పం. 8212)

## 5.3 లోకోక్తులు

లోక ప్రసిద్ధమైన ఉక్తులను లోకోక్తులు అందురు లోకమనగా భాషను వ్యవహరించు ప్రజానీకం ప్రజలయొక్క వ్యవహారమున ప్రసిద్ధినొందిన విశిష్టార్థ సమన్వితములైన వాక్యము లెల్లను లోకోక్తులే ఐనను ఈ సందర్భమున సామెతలు, జాతీయములుకాక జన వ్యవహారమున సుప్రసిద్ధములుగా గోచరించు సూక్తులు లోకోక్తులుగా ఉదహరింపబడుచున్నవి.

అయోధ్యా కాండము :

1 "తప్పునేకాఁగల దైవయత్నంబు" (పు 370, పం 3102)

2 "కాలమందరికిఁ గర్తయౌఁగాదె" (పు 528, పం 6928)

3 "వ్యాళదుష్టుని వహ్నియందుఁ ద్రోయుదురె?" (పు 581, పం 8218)

4 "నరునకు కార్య నిర్ణయ శక్తిగలదె ?" (పు 638, పం. 9610)

5 "ఫలించుట యిలరాలు కొఁఋడు" (పు 639 పం 9617)

6 "సంపదలెల్ల నాశము నొందఁగాక
సంపన్నులకు కొనసాగనెక్కడిది ?" (పు. 639, పం 9611-9612)

7 "నిన్నటి రాతిరి నేటికి రాదు" (పు. 639, పం. 9625)

8 "వన్నట్టివార లెచ్చుట మళ్ళిరారు" (పు 639, పం. 9626)

9 "భరియింపఁదగు మోపు భరియించివోవ
నరిగించుకొనిన నాహారమింపగును !" (అరణ్య, పు 183, పం. 4336-4337)

కిష్కింధాకాండము :

1 "పాలనుఁడై విషపానంబుఁజేసి
బ్రదుకునే నరుఁడు?" (పు 299, పం 584-585)

2 "మత్తులు పాపకర్మంబులు సేయ
నుత్తములగు రాజులోర్తురే చూచి?" (పు 349, పం 1801-1802)

3 "దైవయత్నమునకు తను దూరనేల?" (పు. 377, పం 2451)

4 "ఇడుములఁబడు వానినింటికి నంపి
గడువు దప్పెనటంచుఁ గరుణ దప్పుదురె?" (పు. 416, పం 3383-3384)

5 "ధారుణినొరుల చిత్తములెవ్వఁడెఱుగు?" (పు 422, పం 3528)

6 "దొరచేతన గుపనుల్దొరలు సేయుదురు
పరిజనుల్చే నైన పాటితీర్పుదురు" (పు. 523, పం. 5977-5978)

యుద్ధకాండము :

1 "చచ్చిన చావయ్యె సరివారిలోన " (పు 106, పం 2399)

2 "అన్నకుఁగాని వాడన్యులకగునె?" (పు 111, పం 2488)

3 "కాపురంబులు సేయఁగలవెయాపదలు" (పు 182, పం 4056)

4 "దైవయత్నంబు ముందఱ నితరంబు
లేవియుఁ గొన సాఁగవేమి సేయుదును?" (పు 194, పం. 4349-4350)

5 "పదరకు కాఁగల పనులేల తప్పు? (పు 250, పం 5629)

## 5.4 శబ్దవిశేషాలు

బాలకాండము :

1 సీమంతినులు = భార్యలు
"సేవింపనిమ్ము నీ సీమంతినులను" (పు 67, పం 1611)

2 అవసరముల వారు = కావలిభటులు
"మారాకదెల్పుఁడే మఱకరాజునకు
చనుఁడన్నవిని యవసరములవారు " (పు 203, పం 4900-4901)

3 అజారము = ఇది 'హజార' శబ్దరూపాంతరం
"రాజగేహము హజారము చేరనేఁగి" (పు 203, పం 4895)

అయోధ్యాకాండము :

1 "మందెమేళము"
"నుదిమదినుండక మందెమేలమున
నెదురాడి పరుషోక్తులివు పల్కితివా?" (పు 326, పం. 2027-2028)

2 సరగ - త్వరగా
"సరగ విచ్చేయుఁడు సాకేతమునకు" (పు 520, పం 6730)

3 తన్నీరుతిత్తులు = మంచినీటి తిత్తులు
"గత్తులు గొడ్డండ్లు కర్జెలుం గొలిమి
తిత్తులు దన్నీరు తిత్తులు" (పు 559, పం 7689-7690)

4 గడిరాజు = శత్రురాజు

కడిరాజు = మిత్రుడైనరాజు

"<u>గడిరాజు</u> శత్రుఁడా <u>కడిరాజు</u> మిత్రుఁ

"డెడరాజు దాసీనుఁడెవ్వారికైన" (పు. 623, పం.9241-9242)

అరణ్యకాండము :

1 'ఒడలు' రూపాంతరం 'ఒళ్లు'

"<u>నొళ్లు</u> జాడించు మేనూరక విఱుచు" (పు. 146, పం 3463)

2 గరువించుట - గర్వించుట యొక్క రూపాంతరం.

"గరువించునేల? యీ ఖగరాజు తోడి" (పు. 195, పం. 3647)

3 కర్మచండాలుడు, - పుట్టుకచేతకాక పనులతో

చండాలుడైన వాడు.

"చండాల! నీకెట్లు చను నానచేయ?" (పు. 206, పం 4919-4920)

4 జాడె - జడ (లేక) కొప్పు

"జాడెలోపలనివి నవరించినారు!" (పు. 228, పం. 5428)

కిష్కింధాకాండము :

1 వైడూర్యము - వైడూర్యము యొక్క రూపాంతరం.

"<u>వైడూర్య</u> నిర్మల వారి పూరంబు" (పు 276, పం. 15)

2 కుపనము - కుప్పనము రూపాంతరం

"<u>కుపనమూ</u>డ్చిన త్రాఁచు కొదమల రీతి" (పు. 290, పం. 353)

3 విగ్రహించు = విరోధించు.

"వెడలి పొమ్మనుగాక <u>విగ్రహించి</u> నను" (పు. 313, పం. 899)

"వేయికన్నుల వానితో <u>విగ్రహించి</u> - వనిత!

యింకేమికానున్న వాఁడొ మరుడు" (శ్రీనాథుని శృంగార నైషధము)

4 హల్లోహలము = అల్లకల్లోలము

"<u>హల్లోహలం</u>బుగా నట్టి పోనంబు"

ఇది ధ్వన్యను కరణ శబ్దము (పు. 316, పం. 992)

5 అవివేకపడు

"<u>అవివేకపడు</u> చుఁగార్యము చేసెననుచు" (పు. 327, పం. 1263)

6 దీవెన - 'దీవన'కు రూపాంతరం.
"వీఁడెయంగదుడు దీవెన లిమ్ము" (పు. 368, పం 2253)

7 విగణించు = పరిగణించు. ఉపసర్గ విశేషము
"విగణింపఁగాల ప్రవృత్తిపైయుండు" (పు. 378, పం. 2488)

8 వరుషము - 'వర్షము'నకు రూపాంతరం.
"ఆవరుషబుతు సమాగంబునను" (పు. 386, పం 266)

9 ఘర్మకరుఁడు = సూర్యుడు.
'ఆఘర్మకరుఁడు దానాకాశమంది' (పు 391, పం. 2794)

10 క్రమియించుట = గడచుట
రాముఁడు దినములు క్రమియింపుచుండె" (పు 471, పం. 4718)

11 కమలాకరము = సముద్రము
"ఇక్కమలాకరం బెంత దాఁటుటకు?" (పు 519, పం 5865)

12 కమలధి = సముద్రము
"ఇక్కమలధి దాఁటు నెవఁడున్నాడు" (పు 519 పం 5880)

13 ఇనుడు = రాజు
"ఏముకొల్చిన వారమినుఁడవు నీవు" (పు. 523, పం 5956)

సుందరకాండము :

1 సూళగేరులు - ఇది 'సూళగేరి' అనుపదానికి బహువచనం.
"వారలఁదనయిరు వంకల సూళ
గేరులలోన నెగ్గించి చూచుచును" (పు 28, పం 651-652)

2 'మాఱాకులెత్త'
మలచిన కంబముల్ మాఱాకులెత్త (పు 37, పం. 867)

3 'కంచెల'కు 'కంచెలియ' అనురూపం.
"చనుగుబ్బలందు కంచలియలు బిగియ" (పు. 40,పం. 930)

4 పన్నలు = పరిచారకులు
"కన్నుఁ జూచినఁగా నాదు తనువు
పన్నలు వొగడ సాఫల్యమ్ము నొందు !" (పు 43, పం. 1004)

5 దోకొనిపోవు = తీసికొని పోవు.
"వన నిధియింకించి వచ్చి రావణుసఁ
దునిమి క్రమ్మఱఁ దన్నుఁ దోకొనిపోవు" (పు 63, పం. 1501-1502)

6 "బిగియఁ గౌఁగలించు" అనడానికి
"బిగ్గెకవుంగలించు" అని ప్రయోగం
"కేలుతోఁగూడ బిగ్గెకవుంగలించి" (పు 79 పం 1877)

7 చేతురు అనేకాక 'కోయుదము' అను ఉభయ

[illegible]

హారిగా ఋంగి మాపగఁదీర్చుకొనుఁడు " (పు 89, పం 2103-2104)

9 క్రోతి / కోతి /
"క్రోతినిఁగల గంటిఁలలో నఁ" (పు 101, పం. 2393)

10 'ఎఱుంగక' అనుటకు 'ఎఱుగక' అని ప్రయోగం
"రామ నీమహిమ యెఱుంగఁగ రాదు" (పు. 134, పం. 3169)

11 ధర్మదార = యుద్ధము ఆపడానికి ఊదేబాకా
"దనుజులలోఁ? ధర్మదార వట్టుదునొ?" (పు. 149, పం 3534)

సుందంకాండలో ఇంకా 'గగనమహలు' (పు 33 పం 772)' ఖురునీసులు' (పు 43, పం 1019) 'రామదానుడు'(పు. 154, పం 3634) (హనుమంతుని విశేషణం) 'విజయ విలాసము' (పు 142, పం 3358)

మొదలైన అసంఖ్యాక పదబంధాలు అనేక సమాసాలు ఇతనియొక్క జాతి వార్తా చమత్కారాన్ని చాటుతున్నాయి.

యుద్ధకాండము :

1 1) ఖళనంబుల
11) ఉక్కళంబుల
"ఖళనంబుల నుండఁ బనిచియాచుట్లు
నుక్కళంబులఁగపివ్యూహంబునునిచి" (పు. 16, పం 346-347)

2 మూలూరఫలములు - కుచములపోలిక
"మూలూరఫలముల మఱపించు సీత
పాలిండ్లు తెంగేలఁ బట్టుదునొక్కొ?" (పు. 19, పం. 411-412)

3 "కోంతి కూటువ మూఁక గొలువంగ వట్టి
కాంతారమున జనక సుతావరుండు" (పూర్ణఖిందు ప్రాసము)
(పు. 42, పం 941-942)

4 ' కోరికల్ తీరంగ గుక్కుటవృత్తి
చేరమించిన సీతఁజెల్లకున్నదియె?" (పు. 47, పం 1061-1062)

5 "ఎట్టిగీరుఋస రావణుఁజూచిపలికె" (పు. 53, పం 1216)

6 "నాస్తిగీతలి విసుమాయుర్వి మీఁద" (పు. 57, పం. 1313)

7 తానిలఁడమ్యో - తా నిలువఁడమ్యో
"తానిలఁడమ్యో కటికి వరుండు" (పు. 91, పం. 2049)

8 "దవిణసితిమ పసించె ' (పు 100, పం 2250)

9 అతనిపల్ల ప్రోవాశించు వారు - ప్రోగు (పు 144, పం 3188)

10 పుయిఖ్యాడు వేలుపు ముద్దుల గుమ్మలు (పు 156, పం 3458)

11 పిడమి పైమఱుఁ ఐడి-పిడమి - ప్రదిపిశబ్ద తద్భవము (పు 158 పం 3507)

12 కొఱుంత / రొఱుత /
"ఈ రాఘవులవెంపు నేమి కొఱుంత?" (పు 182 పం 4057)

13 "పకపక పోఁతుఁ పైకంబు సప్వఁ" -పైకంబు - సమూహం.
(పు 220, పం. 4942)

14 తోడితెండన - చేదోయి - దోయి రూపాంతరం
"తోడితెండన వాఁడుతోడనే వచ్చి" (పు 251, పం 5639)

15 కంజాయ, కెంజాయ - కన్నుశబ్దానికి సమానమున బిందువు
"గంజాయ కెంజాయ గ్రమ్మనిల్వెడలి" (పు 251, పం 5646)

6 "పుడమిరాగుప్ప ఎల్లభుని బాతిఁబడిన" (పు 266 పం 5988)

7 ఒక్కపరిగ = ఒక్కసారిగ
"పొఁబవేయుద మొక్కపరిగ మందయిము" (పు 275, పం 6217)

8 అస్రముల్ గ్రక్కె = నెత్తురులు క్రక్కెను
"సవిగినఁడన్నుకి యస్రముల్ గ్రక్కె" (పు. 281, పం. 6344)

9 పడవాళ్ళ = రిశకబటులు
"పడవాళ్ళచే గోట పదిలంబు సేయఁ" (పు 319, పం 7221)

) సుంకురాలంగ = వావగొడితిని
"జుట్టు సురాళించి సుంకురాలంగ" (పు. 308, పం 6978)

13 "ప్రాపుగాఁజికరాయపట్టుంబుగట్టి" (యుద్ధ, పు 541, పం 12339)

ఈ పాదమందలి 'చికరాయపట్టము'నకు

'యువరాజ పట్టాభిషేక' మని యర్థము

## 5.6 ఛందో విశేషాలు

### 5.6.1 యతులు :

1 రామచంద్ర । వివేకురాలు మాతార (కిష్కింధా, పు. 344, పం 1671)

ఇచ్చట హల్లునకుయతి, చిన్నయసూరి సూత్రాన్ననుసరించినచో అచ్చునకేయతి

2 "నట్టడవినిఁజిక్కినారు నాచేత" (అరణ్య, పు 7, పం 140)

ఇచ్చట హల్లుకుయతి

3 "పిక్కొట నదులు నవోఢలో యనఁగ" (కిష్కింధా, పు 396, పం 2907)

నవోడ శబ్దములో స్వరయితి

4 "ఉండక దిగువఁగూర్చుండి వివేక" (కిష్కిందా, పు 421, పం 3499)

దేశ్యధాతువుల ప్రత్యయములకు స్వరియతి పీనికి వ్యంజనయతి నిర్దిష్టం

5 "క్రూర కర్ముఁడు కృతఘ్నుఁడ సత్యపరుఁడు"

(కిష్కింధా, పు 433, పం 3791)

ఇచ్చట క్రూ-ఘ్న, అనునది విశేషయతియని అప్పకవి, కాని ఇట్టియతులప్ప కవికి ముందే కలవు.

6 "నను నెదిరింప నున్నారు మీవీటి" (సుందర, పు 149, పం 3533)

'ఉన్నారు' మొదలైన పదాల్లో 'నా'కు వ్యంజనయతి.

### 5.6.2 ప్రాసలు :

వరదరాజకవి శేఖరుడు శ్రీరామాయణంలో పెక్కుచోట్ల రసోచితరీతిలో ప్రాసల్ని ప్రయోగించాడు ఈ ప్రాసలవల్ల కావ్యానికి మనోజ్ఞమగు శైలీ సౌందర్యం చేకూరింది

1) ఈ కవిరాజు సార్థకంగా ప్రయోగించిన ఈ క్రింది యనుప్రాసలు పరికింపదగి వున్నాయి.

"తెఱచిన వాకిళుల్- తెఱచిన యట్లు
పఱచిన కంబళ్లు - పఱచిన యట్లు
మూసిన యంగళ్లు - మూసిన యట్లు

వేసిన గౌనులు - వేసిన యట్లు
కట్టిన గజములు - కట్టిన యట్లు
పట్టిన ఖైదువుల్ - పట్టిన యట్లు
నిలిపిన రథములు - నిలిపిన యట్లు
మలిపిన దీపముల్ - మలిపిన యట్లు
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
పూనిన మఖములు - పూనిన యట్లు
విలువని సొమ్ములు - విలువని యట్లు
కొలవని వేల్పులం - గొలవని యట్లు
సేయని పూజలు - సేయని యట్లు
హోయన నేడ్పులు - హోయను నట్లు"

2) ఇట్లే వరదరాజకవి కూర్చిన ఇంపైన ఈ క్రింది పదమధ్యానుప్రాసలు చిత్తగింపదగి వున్నాయి.

"హాటకగర్భుండౌ - నలబ్రహ్మయుండు
చోటును పావకు - చోటును శౌరి
చోటును శతముఖ - చోటును భాను
చోటును సోముని - చోటును శివుని
చోటును విప్రుల - చోటుం గుబేరు
చోటును వాయువు - చోటు ననంతు
చోటును గాయత్రి - చోటును యముని
చోటును వసువుల - చోటును వరుణు
చోటును స్కంధుని - చోటును ధర్ము
చోటునుం గనుచు వచ్చు ననంతరమున"

3) శ్రవణపేయంగా వినదిస్తూవున్న ఈ క్రింది అంత్యానుప్రాసలు తిలకింపదగి వున్నాయి.

"రథగజ హయభట - వ్రాత నిశ్శంక
పృథుగోపురాగ్రకుం-భిత హరిణాంక
పౌలస్త్యదోర్దండ - బలబిరుదాంక
సాలగుప్తి నిరస్త - శాత్ర వాతంక

పరబలోపల శారి - ఖటశౌర్యటంక
శరధి వేలావనాం - చక్ర్కలావింక
కలధౌత సౌధస - ఘటిత విటంక
లలిత శృంగారాక - లంక యాలంక"

4) ఈ కవి ప్రయోగించిన మరికొన్ని పదమధ్య ప్రాసలీ దిగువ నుదహరింప బడినాయి

"దానుల నర్థిని - దానల సుపరి
ధానుల వివిధాభి - ధానుల సదప
ధానుల రుచిరోప - ధానుల సావ
ధానుల జయసంవి - ధానుల సప్ర
ధానుల బహుయాతు - ధానులఁ గనుచు
నావల వివిధమా - యావులఁ గ్రూర
భావుల దీనసం - భావుల సాను
జీవులఁ గలుషోప - జీవుల మద్య
సేవులఁ గృతవీర - సేవులఁ గాంచి
ధీరులఁ బోషిత - ధీరుల సమర
శూరుల విక్రమ - శూరుల సపరి
వారుల శౌర్యదు - ర్వారుల వరవి
చారుల దుర్గుణా - పారుల నాత్త
చారుల యామినీ - శౌరులఁ జూచి"

5) ఈ కవిరాజు ద్విప్రాసల్ని ఉపయోగించిన తీరు మనోహరంగా అలరుతూ వుంది

"వేళంబ యందందు - వెదకుచు నతివి
శాలాయతన చంద్ర - శాలాంతరముల
రాజితంబులును బు-రందర ప్రముఖ
పూజితంబులును సం-పూర్ణ వస్తువుల
నూర్జితంబులును ది-వ్యోపధా విధస
మార్జితంబులును మా-యాసుర శిల్పి
నిర్మితంబులును మా-ణిక్య ప్రకాశ
పర్మితంబులును రా-వణ భుజాశౌర్య
పాలితంబులును న-పార విభూతి
లాలితంబులును నీ-లమణి ప్రవృద్ధ
నీలిమంబులును గం-ధిల ధూపధూమ
కాళిమంబులును రం-గన్మాలి కాంత

రామణీయకములు - రత్నవితర్ది
కామనీయకములుఁ - గాంచనకుడ్య
భాగంబులును దైత్య - భామాహితాను
రాంగబులును నైన - రాక్షసవిభుని
నడినన్న రాణివా-సముల వాసములు
పుడమి పట్టినిఁ జూచుఁ - బూనికఁజూచి"

వరదరాజ కవీంద్రుడు పదమధ్యాను ప్రాసల్ని ఉపయోగించి ఇంద్రజిత్తు కానించిన యుద్ధాన్ని హృదయ హారిగా చిత్రించిన విధాన్ని తిలకించండి.

"అసురేంద్ర సుతుఁడు బ్ర-హ్మాస్త్ర ప్రభావ
లసమాన తేజో - విలాసియై లాసి
నెరయించు నొకచోట - నీలమేఘములు
గురియించు నొకచోట - ఘోరాస్త్రవృష్టి
మలయించు నొకచోట - మంచు పెందెరలు
పొలయించు నొకచోట - భుగభుగఁబొగలు
వినుపించు నొకచోట - విలునారిమ్రోఁత
కనిపించు నొకచోట - కాంచన రథము
చెలఁగించు నొకచోట - సింహనాదములు
నెలకొల్పు నొకచోట - నేమికాధ్వనులు
నడరించు నొకచోట - హయహేషితములు
జడియించు నొకచోట - శక్తులువైచి
వినిపించు నొకచోట - విలుకేలఁబూని
ననముంచు నొకచోట - నాకృతిఁజూచి
యీలీల నెలయించె - యింద్రజిత్తుండు!"

## ఆధారసూచిక


తెలుగు సామెతలు - జనజీవనం. డా. పి నరసింహారెడ్డి పుట -1

ఆంధ్ర సాహిత్యంలో దేశికవిత్వోద్యమము - పాల్కురికి సోమనాథుని పాత్ర (షైప్-ప్రతి) పుట - 543

సాహిత్యోపన్యాసములు - మలికూర్పు 1970 - తాపీ ధర్మారావు.

ఎఱ్ఱన శ్రీనాథుల సూక్తివైచిత్రి (1984) - డా. జి. నాగయ్య - పుట - 50

# ఆంధ్ర సారస్వతము - కట్టావరదరాజకవి

సారస్వతము కవుల రచనలయొక్క సమాహార స్వరూపము సారస్వత జగత్తులో ఒక్కొక్క కవిది ఒక విశిష్టమగు స్థానము సాహితీ ప్రపంచమున కవియొక్క విశిష్టస్థానమును నుర్తించుటలో ప్రముఖ పాత్ర వహించునవి ఆ కవి రచనలు ఆయా రచనల వలన వాఙ్మయమునకు చేకూరిన పెంపు, సొంపులు కారణముగా, సాధారణముగ కవియొక్క విశిష్టస్థానము నిర్ణయింపబడుచుండును.

ఆంధ్ర సారస్వతమున కట్టావరదరాజు కవీంద్రుని వైశిష్ట్యమును గూర్చి పరిశీలించుట ప్రకృతాంశము ఈ కవిరాజు ఆంధ్రవాఙ్మయ ప్రపంచములో విలసిల్లిన రాజకవులలో ప్రథమ శ్రేణియందు పేర్కొనదగిన పండితకవి క్రీ శ 17వ శతాబ్ది నడిమి భాగమున జీవించియుండిన యీకవి 1) పరమ భాగవత చరిత్రము (చంపువు), 2) శ్రీరంగ మాహాత్మ్యము (చంపువు), 3) శ్రీరామాయణము (ద్విపద) - అనెడు కృతిత్రయమును వెలయించి యున్నాడు. ఇవి యొక్కొక్కటి ఆయా ప్రక్రియలలో ఒక్కొక్క ప్రత్యేకతను గడించుకొనియున్నవి.

శ్రీమద్భాగవతము, విష్ణుపురాణము మున్నుగాగల పురాణములందలి ప్రహ్లాద నారదాది పరమభాగవతుల పవిత్రగాథలే యితి వృత్తముగా రచింపబడిన మహా ప్రబంధము పరమ భాగవత చరిత్రము ఈ యితివృత్తముతో తెనుగున రచింపబడిన ప్రబంధమ్ములలో నిదేమొదటిది గణపవరపు వేంకటకవి, ఆలూరికుప్పన మొదలగు తదనంతరకవుల 'పరమభాగవత చరిత్ర'ల రచనలకు నిదే ప్రేరేపకమై విలసిల్లినది !

సంస్కృతగిరుడ పురాణమునందలి నూటయెనిమిది అధ్యాయముల (శతాధ్యాయి) గ్రంధ భాగమునకు ఈ కవి కావించిన పది యాశ్వాసాల యనువాదమే శ్రీరంగ మాహాత్మ్య ప్రబంధము వరదరాజుకవికి పూర్వమందు, తరువాతి కాలములలోను పెక్కురు తెనుగుకవులు వేర్వేఱురచనా ప్రక్రియలలో శ్రీరంగ మాహాత్మ్యములను రచించియున్నప్పటికిని, ఆ అన్నింటికంటె విపులతరమైన కృతిగా ఈ వరదరాజు కవిరచన ఒకానొక ప్రత్యేకతను గడించుకొన్నది

ఇకమూడవది, చిట్టచివరిదియగు ద్విపద రామాయణము పరిమితిచే యావదాంధ్ర ద్విపద వాఙ్మయమునందు, ప్రశస్తిచే ద్విపద రామాయణ రచనలన్నింటిలోను అగ్రగణ్యమై యలరుచున్నది

"పాఠ్యేగేయేచ మధురమ్" - అని ప్రశస్తిగాంచిన శ్రీమద్వాల్మీకి రామాయణమునకు అన్ని విధముల దీటుగా మధుర కవితాశాఖకు చెందిన ద్విపదచ్ఛందమున మనోజ్ఞశైలిలో కథాకథనమునకు కవితా రామణీయకమునకు తన శ్రీరామాయణ ద్విపద కృతిలో కమనీయమగు సమన్వయమును సాధించిన జాతీయ కవిశేఖరుడు కట్టావరదరాజ భూవరుడు

రచనను జాతీవాద్యా చమత్కార విలసితము గావించుటలోను, రచనలో సమకాలీన సామాజిక పరిస్థితులను చక్కగా ప్రతిబింబింప జేయుటయందును, ప్రకృతి వర్ణనలయందును వరదరాజ కవీంద్రుడు తనకు పూర్వులైన శ్రీకృష్ణదేవరాయ, రఘునాథ భూపాలురను అడుగడుగున స్మరింపజేయుచుండును

తెలుగు సాహిత్యముపై వాల్మీకి రామాయణ ప్రభావమును గూర్చి రామకథా సంబంధి సారస్వతమును గూర్చి పరిశీలించుటలోను, అట్లే వైష్ణవమత ప్రభావ క్రమవికాస పరిణామము ను పరిశోధించుటలోను వరదరాజ కవి రచించిన కృతులకు, అందులోను ముఖ్యముగా శ్రీరామాయణ ద్విపద కావ్యమునకు ప్రత్యేక ప్రాధాన్యము కన్పట్టుచున్నది

వరదరాజు ద్విపద రామాయణ రచనకు పూర్వము తెలుగులో వెలసిన ద్విపద రామాయణములు రెండు I) గోనబుద్ధరాజు రచించిన రంగనాథ రామాయణము II) తాళ్ళపాక అన్నమాచార్యులు రచించిన ద్విపద రామాయణము. కట్టావరదరాజు రచించిన ద్విపద రామాయణమునందలి భాగములు కొన్ని లేఖకుల ప్రమాదము కారణముగ రంగనాథ రామాయణ తాళపత్ర ప్రతులలోని కెక్కియున్నవి. కావున వరదరాజు రామాయణముతో రంగనాథ రామాయణము యొక్క ముద్రితాముద్రిత ప్రతులన్నింటిని తులనాత్మకముగా పరిశీలించినచో రంగనాథ రామాయణ స్వరూపమును నిర్ణయించు అవకాశము కలదు అదే రీతిని ఆ తులనాత్మక పరిశోధనలో ప్రక్షిప్తభాగములుగా తేలెడు భాగముల నుండి నేడు మృగ్యమైపోయిన అన్నమాచార్య ద్విపద రామాయణ కావ్య భాగములను పసికట్టవచ్చునని పరిశోధకుల నిశ్చితాభిప్రాయము. ఈ విధముగా ఈ రాజ కవి రచన ఆధునిక పరిశోధనాత్మకమగు విలువను సంతరించుకొనియున్నది ఇట్లు వరదరాజునకు మూడు శతాబ్దులకు మునుపు రచింపబడిన రంగనాథ రామాయణముయొక్క స్వరూపమును, పరిమితిని నిర్ణయించు పనిలో వరదరాజు కృతి యుపకరించుట దైవికమగు నొక విశేషము

కట్టావరదరాజ కవీశ్వరుని రచనలలో మొదటిదగు పరమ భాగవత చరిత్రము యొక్క గ్రంథాంత గద్యమునందలి "తిరువేంగళనాథ కటాక్ష రక్షిత సకల సామ్రాజ్య వైభవ" - అను విశేషమును బట్టి, ఈ కవి యాకాలమున తెనుగు దేశమునందలి కొంత భూభాగమునకు (బహుశః నేటి కడపజిల్లాలోని కొంత ప్రదేశమునకు) పాలకుడుగా నుండినట్లు భావింపవచ్చును, మఱియు, జన్మతః క్షత్రియుడగుటచే కాబోలు ఈ కవీంద్రునకు "సాహితీ భోజ" యను సార్థక బిరుదమున్నట్లు పై గద్యవలననే తెలియు చున్నది.

ఇక, రెండవ రచనయైన శ్రీరంగ మాహాత్మ్యము యొక్క ఆశ్వాసాంత గద్యనుబట్టి యాతడు

"నిరాఘాటమగు చాటు కవితాధార" కలవాడనీ, "చతుర్విధ కవిత్వ రచన" యందు చమత్కారముగల నేర్పరియనియు వెల్లడియగుచున్నది.

మూడవదగు ద్విపద రామాయణము నందలి ఆయాకాండాంత ద్విపద పంక్తులవలన నీరాజ కవి శేఖరుడు "వేంకటాధీశ వరణసేవాను భావమానసుడు" "నితాంత వరదానశాలి" యని విదితమగుచున్నది.

పైరీతిని మూడుకృతుల గద్యలయందీ కవి ప్రయోగించిన సాభిప్రాయ విశేషణముల ననుసరించి ఈ కవిరాజు చిత్త వృత్తియందలి క్రమపరిణతి చక్కగా గోచరించుచున్నది

కట్టా వరదరాజ కవీశ్వరుని కృతులపై ప్రత్యేక పరిశీలన కొనసాగించవలసిన యావశ్యకత నేడెంతైనను కలదు అది జరిగిననాడు క్రీ శ 17వ శతాబ్దికి సంబంధించిన భాషా, సారస్వత, సామాజిక విశేషములెన్నో వెలుగులోనికి వచ్చు నవకాశము కలదు

నన్నయాది ప్రాచీన మహాకవుల కవితా వీధులలో చక్కగా విహరించు సామర్థ్యము గలవాడు, విద్వజ్జనాధారుడు, తిరువేంగళ నాథ దివ్యపాద పద్మారాధకుడు నైన వరదరాజ కవీంద్రుడు, మొత్తము మీద, క్రీ.శ పదునేడవ శతాబ్దిలో విలసిల్లిన ఆంధ్రసాహితీయుగ కర్తలలో అగ్రేసరుడని చెప్పదగును

"రాజులు సత్కవి - రాజు లందందు
నీజగతీదలంప - నెందఱేగలరు
రాజవు సత్కవి - రాజవు నీవె
యీజగతి సమాను - లెవ్వారు గలరు?"

- శ్రీరామాయణము,
బాల అయోధ్యాకాండములు,
పుట 5, పంక్తులు 111 - 114

# ఉపయుక్త గ్రంథములు


1 అష్టమహిషీ కల్యాణము : తాళ్ళపాక తిరువేంగళ నాథసూరి విరచితము, సంపా వి విజయ రాఘవాచార్య, తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, 13-14 సెకండ్ లైన్‌బీచ్, మద్రాసు 1937

2 అప్పకవీయము : కాకునూరి అప్ప కవి రచితము, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్‌సన్స్, చెన్నపురి 1951

3 అముద్రి తాంధ్రగ్రంథ సర్వస్వము, సంపా చెలికాని లచ్చారావు, 5వ గ్రంథము శ్రీరామ విలాసముద్రాక్షరశాల, చిత్రాడ, 1929

4 ఆంధ్ర సాహిత్య చరిత్ర : డా॥ పింగళి లక్ష్మీకాంతం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్ 500 004 1974

5 ఆంధ్ర ప్రబంధము - అవతరణ వికాసములు : ఆచార్య కాకర్ల వెంకట రామనరసింహం, ఆంధ్ర విశ్వ కళాపరిషత్, ఆంధ్రా యూనివర్సిటి ప్రెస్, వాల్తేరు. 1965

6 ఆముక్తమాల్యదా సౌందర్యము : ఆచార్య, డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు అధ్యక్షులు - "ఆంధ్రభారతి" శ్రీ కృష్ణదేవరాయ విశ్వ విద్యాలయము, అనంతపురము 1971

7 ఆంధ్ర మహాభారతము - ఛందః శిల్పము : డా॥ పాటిబండ మాధవశర్మ, రీడర్, ఆంధ్రశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు, 1966

8 ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర : డా టి సుశీల, డిల్లీ విశ్వవిద్యాలయము వారిచే పి హెచ్ డి డిగ్రీ ఒసంగబడిన సిద్ధాంత వ్యాసము

9 ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర : డా॥ యస్వీజోగారావు, ఆంధ్ర విశ్వకలా పరిషత్తు, వాల్తేరు, 1961

10 ఉదాహరణ వాఙ్మయ చరిత్ర : నిడుదవోలు వేంకటరావు, ఆంధ్రభాషా శాఖాధ్యక్షులు, మదరాసు విశ్వవిద్యాలయము, విజయభాస్కర పబ్లికేషన్స్, హైదరాబాదు, 1950

11 కవిత్వ తత్త్వ విచారము : కట్టమంచి రామలింగారెడ్డి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ గ్రంథమాల, (ఎనిమిదివ ప్రచురణము)

12 కావ్యాలంకార సంగ్రహము (నరస భూపాలీయము) : రామరాజ భూషణుడు, వివరణకర్త శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి, యం. శేషాచలం అండ్ కంపెని, మచిలీపట్టణము సికింద్రాబాదు, 1945

13 కావ్యాలంకారచూడామణి : విన్నకోట పెద్దన, వ్యాఖ్య, వేదం వేంకటరామ శాస్త్రిఅండ్ సన్స్, మద్రాసు - 1, 1972

14 కుశలవోపాఖ్యానము (ద్విపదకావ్యము) : రామనార్యుడు. సం పా శ్రీ వి సుందరశర్మ, టి యం యస్ యస్ యం లైబ్రరి, టాంజూర్, 1951

15 తంజాపురాంధ్ర సహిత్య చరిత్ర : కొక్కొండ సత్యపతి, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఆకాడమి, బహుకృత గ్రంథము, 1963-1964

16 తాళ్లపాక అన్నమాచార్య చరిత్ర : చినతిరు వేంగళనాథుడు సంపా నిడుదవోలు వేంకటరావు, యస్ వి ఒ సిరీస్, 17 1949

17 తెలుగులో ఛందోరీతులు : డా|| గిడుగు వేంకట సీతాపతి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ఖైరతాబాద్, హైదరాబాద్-4, తొలిముద్రణ 1961

18 తెనుగుఛందో వికాసము : కోవెల సంపత్కుమారాచార్యులు, కులపతి సమితి వరంగల్లు. 1962

19 తెలుగుభాషలోని ఛందోరీతులు : విద్వాన్ రావూరి దొరస్వామిశర్మ, ప్రనాగాంధ్ర పండితులు, హిందూ స్కూల్, మద్రాసు - 5, 1962

20 ద్విపద వాఙ్మయము : డా|| జి నాగయ్య శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి

21 ద్విపద రామాయణ భారతి : డా జె వి సుబ్బరాయుడు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము వారి డాక్టరేట్ పట్టమును పొందిన గ్రంథము

22 నాట్యశాస్త్రము : (గుప్తభావ ప్రకాశ సహితము) పోణంగి శ్రీరామ అప్పారావు, నాట్యమాల ప్రచురణము, సర్వస్వామ్య సంకలితము విళంబి పుష్యము.

23 పండితారాధ్య చరిత్ర : పాల్కురికి సోమన, పరి శ్రీ చిలుకూరి నారాయణరావు, ఆంధ్ర గ్రంథమాల, చెన్నపురి 1939

24 పద్యబసవ పురాణము : పిడుపర్తి సోమనాథుడు, వావిళ్లప్రతి

25 పరమభాగవత చరిత్రము : కాగితపుతాళపత్రప్రతి, సంఖ్య, 7294, శ్రీ వెంకటేశ్వర విశ్వావిద్యాలయ ప్రాచ్యపరిశోధనా సంస్థ

26 పల్నాటి వీరచరిత్ర : విశాలాంధ్ర ప్రచురణ, 1961

27 ప్రదమాంధ్ర మహాపురాణము - ప్రబంధ కథామూలము : జి వి సుబ్రమణ్యం, ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి పి హెచ్. డి. పట్టాపొందిన సిద్ధాంత వ్యాసము. హైదరాబాదు. 1973

28 శ్రీ ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసము : గణపవరపు వేంకటకవి, సంపా వేదము వేంకటరాయశాస్త్రి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు, 500 004 1977

29 మానవల్లి రచనలు : మానవల్లి రామకృష్ణకవి, సంపా శ్రీ నిడుదవోలు వేంకటరావు, డా|| పోణంగి శ్రీరామ అప్పారావు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్ - సైఫాబాదు, హైదరాబాదు - 4, 1972

30 వ్యాస సంగ్రహము : చిలుకూరి నారాయణరావు, సంపా తెలికిచెర్ల వెంకటరత్నం

31 వైయాకరణ సిద్ధాంత కౌముది (ఉణాదులు) : నిర్ణయసాగర్ ప్రెస్, 9వ ముద్రణము, 1924

32 శిల్ప ప్రభావతి : రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, శిల్పి ప్రచురణలు, శారదా ప్రింటింగ్ ప్రెస్, కమలానగర్, అనంతపురం, 1980

33 శృంగార నైషధము : శ్రీనాథుడు, ఉత్పల వేంకట నరసింహాచార్య పరిష్కృతము, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్‌సన్స్, చెన్నపురి, 1956

34 శ్రీరంగనాథ రామాయణము : పరి వేటూరి ప్రభాకరశాస్త్రి, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ప్రచురణము,

35 శ్రీ మద్రామాయణము : చదలువాడ సుందర రామశాస్త్రులు, ఆంధ్ర తాత్పర్య సహితము, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్‌సన్స్, చెన్నపురి, 1954

36 శ్రీరామాయణము : కట్టా వరదరాజ కవికృతము, మద్రాస్ గవర్నమెంట్ ఓరియంటల్ సిరీస్, నం ఎల్ Vol I - IV, 1953

37 శ్రీరంగ మాహాత్మ్యము : కట్టావరదరాజ కవికృతము, కాగితపు వ్రాతప్రతి, సంఖ్య ఆర్ 519, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనా సంస్థ

38 సమగ్ర ఆంధ్ర సాహిత్యం, **10**వ సంపుటము : ఆరుద్ర యం శేషాచలం అండ్ కంపెని, మద్రాసు, మచిలీపట్టణము, సికింద్రాబాదు

39 **Further Sources of Vijayanagara History** : K A Nilakanta Sastry, N Venkataramanayya, Vol II - Texts, University of Madras, 1946

40 Madras Government oriental manuscripts library Bulletin, Vol I No I